# నివేదన

బెంగాలీ సాహిత్యాన్నిగురించి; అందునా ప్రత్యేకించి శరత్ సాహిత్యాన్నిగురించి యీనాడు తెలుగు పాఠకులకు విశేషంగా పరిచయం చేయవలసిందేమీలేదు. ఈ తరం పాఠకుల్లో కొంతమంది శరత్‌ను 'మనవాడు' గానే భావించారంటే, అందుకు అబ్బురపడనవసరంలేదు. ఎంచేతనంటే, శరత్ సాహిత్యాన్ని తెలుగులోనికి అందించడానికి ఆయా అనువాదకులు చేసిన విశేష పరిశ్రమా; ఆసాహిత్యంలోని సార్వజనీనతే ముఖ్యకారణం!

మాకు తెలిసినంతవరకూ రమారమి 1940 లో అనుకుంటాము; ఈనవలను తొలిసారిగా తెలుగులో ప్రచురించడం జరిగింది. అప్పటికీ యిప్పటికీ మధ్య ఎంతో కాలం జరిగిపోయినా; ఈనాటికీ తెలుగు పాఠకులు శరత్ సాహిత్యాన్ని ఆసక్తితో చదవడమే యీప్రచురణకు ప్రేరణనిచ్చింది.

కథాకథన సంవిధానంలోనూ, దేశకాల పాత్రల చిత్రీకరణలోనూ అఖిలభారత ఖ్యాతిపొందిన శరత్ శక్తిసామర్థ్యాలను గురించి మేమిప్పుడేమీ చెప్పబోవడంలేదు. కాని, గ్రామీణ జీవితాన్ని వాస్తవంగా చిత్రించడానికి యీనాటి వర్ధమాన రచయితలు చేస్తున్న భగీరథయత్నాన్ని కనీసం

ఒక్క రోజుకైనా నిలిపివేసి; ఈనవలలో భారతీయ గ్రామీ జీవితాన్ని శరత్ ఎంత నిర్దుష్టంగా వాస్తవంగా చిత్రించాడో పరిశీలిస్తే — మనకూ, మన ముందుతరాలవారికూ కూడా శ్రేయస్కరం !

సాహిత్యానికి పాత - క్రొత్తలనేవిలేవు; వున్నవల్లా మంచీ - చెడూ మాత్రమే ! మంచి సాహిత్యాన్ని మరోసారి చదివినందువల్ల లాభమేగాని నష్టం లేదుగదా !

ఈ ప్రచురణసంస్థ తరఫున ప్రథమపుష్పంగా ఈనవలను తెలుగు పాఠకులకు అందించగలుగుతున్నందుకు హృదయ పూర్వకంగా సంతోషిస్తున్నాము.

— ప్రకాశకులు

# పల్లీయులు

ముఖర్జీగారి యింటి ప్రాంగణంలో అడుగుపెట్టి పెట్ట డంతోనే వేణీమాఘోల్‌కు మధ్య వయస్కురాలైన ఒకామె కనిపించింది. ఆమెనుద్దేశించి, "అత్తయ్యా! రమ ఎక్కడికి వెళ్ళిందీ?" అనడిగాడు.

ఆమె భక్తిభావంలో లీనమైవున్నదేమో, వేణీ పిలుపు ఆమె భక్తికి కాస్త భంగం కలిగించినట్లయింది నోరెత్త కుండానే వంటింటివేపు సంజ్ఞచేసింది. వేణీ వంటగది దగ్గరకు వెళ్ళి గడప యివతలే నిలబడి "రమా! నువ్వేమని నిశ్చ యించుకున్నావూ?" అనడిగాడు.

రమ పొయ్యిమీద కాగుతున్న నీటి పాత్రను దింపి, "ఏ సంగతిని గురించీ?" అనడిగింది.

"అదే... వృద్ధతారిణీ బాబు చనిపోయాడుగదా! అతని శ్రాద్ధాన్ని గురించి. అతని కొడుకు రమేష్ నిన్ననే బస్తీనుంచి వొచ్చాడు. తండ్రి శ్రాద్ధం మహాఘనంగా జరిపిస్తాట్ట! వెల్తావా!" అనడిగాడు వేణీ బాబు.

"నేనా? తారిణీఘోషాల్ శ్రాద్ధానికా?" అంది రమ ఆశ్చర్యంగా. వేణీ అప్రతిభుడై "అవును, నాకా సంగతి తెలుసు. మీ కుటుంబంలో ఎవరూ ఆ యింటి గడప త్రొక్కరు." అని ఒక్క నిముషం ఆగి, "కాని, వాడు మాత్రం యింటింటికీ వెళ్ళి అందిర్ని ఎంతో మర్యాదగా,

అభిమానంగా ఆహ్వానిస్తున్నాట్ట! ఖర్మకాలి, ఆ సౌభాగ్యుడు మీ యింటి కూడా వచ్చి మిమ్మల్ని కూడా ఆహ్వానిస్తే ఏమని సమాధానం చెబుతావు?" అనడిగాడు. రమకు వొళ్ళు మండినంత కోపం వచ్చింది. రోష పూరితస్వరంతోనే "నే నేమీ చెప్పను. వాళ్ళకు చెప్పవలసిన సమాధానం వాకిట్లో నౌకరే చెప్పగలడు" అంది రమ.

నిజానికి అత్తయ్య కళ్ళుమూసుకుని భగవధ్యానంలో వున్నదన్న మాటేగాని, ఆవిడ మనసంతా ఈ సంభాషణ మీదే వుంది. తన చెల్లెలి కూతురైన రమ చెప్పిన చివరి ముక్క వినీవినడంతోనే,- చటుక్కున యిటువేపు తిరిగి, "ఈ భాగ్యానికి నౌకర్లు కూడా కావాలా! నే చెప్పలేనూ తగిన సమాధానం?" అని ఒక్కక్షణం ఆగి, "ఆ సౌభాగ్యుడు ఈ గుమ్మంలోకి రావాలేగానీ- జన్మ జన్మంతా గుర్తుండే సమాధానం చెబుతా! తారిణీఘోషాల్ కొడుకు మమ్మల్ని పిలవడానికి వొస్తాడా! సిగ్గులేకపోతేసరి! వేణీబాబూ, గతాన్ని నే నేమీ మర్చిపోలేను. ఆ చచ్చిపోయిన తారిణీబాబు ఈ 'సుపుత్రు'ని వివాహమే రమతో చేయాలని ఆరాటపడేవాడు. అప్పటికింకా యతీంద్రుడు (రమతమ్ముడు) పుట్టనేలేదు. రమ తన కోడలు కావాలని ఆ ముసలాడు ఎందుకు ఆరాటపడేవాడో తెలుసా! ఆస్తికోసరం!. ముఖర్జీగారి యావదాస్తీ తనభుక్తం చేసుకోవడానికి. తెలిసిందా వేణీబాబు!" అని ఒక్కక్షణం ఆగి, "కాని ఆ వివాహం అట్లా జరగనేలేదు. రమ తన కోడలు కాలేదనీ, ఆ ఆస్తి తనకు లభించలేదనీ, ఆ ముసలాడు ఎన్ని కుతంత్రాలు చేసాడో తెలుసా...

ఆ భైరవాచార్యులుకి అంతో యింతో ముట్టజెప్పి ఎన్నెన్ని మంత్ర తంత్రాలూ, ఎన్నెన్ని చాతబళ్ళు చేయించాడో నీకేం తెలుసు? నా బిడ్డ జీవితంలో నిప్పులు పోశాడు. ఆర్నెల్లు తిరిగీ తిరగకముందే, నాబిడ్డ పసుపూ కుంకాలు పోగొట్టుకుని, పుట్టెడు దుఃఖాన్ని నెత్తినెత్తుకుంది. అయితేనేం వాడు మాత్రం సుఖపడి చచ్చిందేముంది. నా బిడ్డ ఉసురు తగిలి ఆ ముసలాడు కూడా అట్లానే అర్థాంతరపు చావు చచ్చాడు! కులం తక్కువ వెధవ. వాడు అట్లా చావవలసిందే!" అంది కసితీర. మాటలన్నీ కసితీర ఒక్కవూపులో అనేసిందేమో, కుస్తీ పట్టిన వస్తాదులాగా రొప్పడం ప్రారంభించింది. ఆమె తన మాటల్లో కులాన్ని గురించి విసిరిన విసురు సూటిగా వేణీబాబు గుండెల్లో నాటుకు పోయింది. ఎందుచేతనంటే, ఆమె ఎవరినైతే కులం తక్కువవాడని నిందించిందో అతను సాక్షాత్తూ వేణీబాబుకు పినతండ్రే! ఈ మాటలన్నీ వినేసరికి వేణీబాబుకు ముఖం తెల్లగా పాలిపోయింది. ఈ సంగతి రమ వెంటనే పసిగట్టి, పిన్నిని మందలిస్తున్న ధోరణిలో, "చాల్లే వూరుకో పిన్నీ! ఎందుకు అనవసరంగా వంశాలూ, జాతుల ప్రసక్తి తీసుకొస్తావు? ఎవరు ఏ కులంలో పుట్టారో-వాళ్ళకదే గొప్పది" అన్నది రమ.

వేణీబాబు సిగ్గు పడిపోయాడు. మరోక్షణం తర్వాత లేనినవ్వు తెచ్చుకుని, "కాదు రమా కాదు. అత్తయ్య చెప్పిన మాటే నిజం? నువ్వు ఎంతో గౌరవనీయమైన వంశానికి చెందినదానవు. నిన్ను మా యింటి కోడలుగా చేసుకో గలిగినఅర్హత మాకెక్కడిది! అసలు అటువంటి ఆలోచన రావ

డమే మా బాబాయి దౌర్భాగ్యం! ఇహ మంత్ర తంత్రాలూ, చాతబళ్ళ సంగతంటావా, అవ్వీ నిజమే అవుండొచ్చు. ఇహ ఆ వెధవ భైరవాచార్యులు సంగతి చెప్పనే అక్కర్లేదు వాడికి పాపపుణ్యాలూ, మంచిచెడ్డలతో నిమిత్తమే లేదు అన్నిటికంటే దౌర్భాగ్యమేమిటంటే- తిరిగి ఆ భైరవాచార్యులే మళ్ళీ యిప్పుడు రమేషుకు సలహాదారుడుగా తయారయ్యాడు."

"సరే; అదంటే తెలిసీ తెలియని సంగతనుకో! కాని అతను పది పన్నెండేళ్ళు ఈ వూరి ఛాయలకైనా రాలేదు గదా! యింత కాలం ఎక్కడున్నట్టూ?" అనడిగింది పిన్ని.

"ఏమో నత్తయ్యా! మా బాబాయిగారి కుటుంబానికీ మీ కుటుంబానికీ మధ్య ఏ మాత్రం పొత్తున్నదో, మాకూ ఆ కుటుంబానికీ కూడా అంతే! ఎక్కడో బొంబాయిలో వున్నాడంటారు కొందరు, కాదంటారు కొంతమంది. మెడిసిన్ పాసయ్యాడని ఒకడు చెబుతాడు, కాదు 'లా' ప్యాసయ్యాడు అంటాడు మరొకడు. అసలు యిదేదీకాదు, అతనికసలు మతే లేదంటాడు మరొకడు. అతను యింటికొచ్చిన మొదటిసారి చూచిన వాళ్ళు మాత్రం అతని కళ్ళు ఎర్రగా వున్నాయని మాత్రం చెబుతున్నారు"

"పోనీలే! ఎలాగో అలా అఘోరించనీయ్. మనం మాత్రం గుమ్మంలో అడుగు పెట్టనీయవద్దు! అంది పిన్ని దృఢంగా.

వేణికి సంతృప్తి కలిగింది. తన సంతోషాన్ని వ్యక్త పరుస్తూ "అంతే అత్తయ్యా అంతే!"

అని ఒక్కక్షణం ఆగి, "కాని రమా! అసలు నీకు రమేష్‌బాబు గుర్తున్నాడా?" అనడిగాడు.

రమ లోలోపలే సిగ్గుపడిపోయింది. తన జీవితపు దురదృష్టం తాలూకూ విషయాలుకూడా యిట్లా చర్చకు వొస్తాయని ఆమె అనుకోలేదు. అలా సిగ్గుపడుతూనే, చిన్నగా నవ్వి "ఎందుకు గుర్తులేదూ! ఆయన నాకంటే చాలా పెద్దవాడు! మేమిద్దరమూ ఒకే స్కూల్లో చదివాం. వాళ్ళమ్మ చనిపోవడం యిప్పటికీ నాకు బాగా గుర్తు. మా పిన్ని నేనంటే ఎంతో అభిమానంగా చూసేది..."

ఈ మాట వినేసరికి పిన్నికి అరికాలిమంట నెత్తికెక్కింది. ఆ కోపంలోనే "అభిమానించేదా? అఘోరించింది పక్షి! అదంతా దాని స్వార్థం తప్ప మరేంకాదు. ఏదో విధంగా నిన్ను వాళ్ళ బుట్టలో వేసుకోవాలనేగాని, నిజంగా వాళ్ళ అంతరాత్మల్లో అభిమానాలు కూడానా?" అంది.

"అంతే అత్తయ్యా అంతే! మాపిన్ని నిజంగా ఎంత స్వార్థపరురాలంటే..." అని వేణీబాబు మాట పూర్తిచెయ్యనే లేదు; రమ మధ్యలోనే అందుకొని "ఎందుకుపిన్నీ అనవసరపు విషయాలు ప్రస్తావించుకోవడం! ఏం జరగాలో అది జరిగిపోయింది. శవాన్ని త్రవ్వుకున్నందువల్ల ఏమిటీ ప్రయోజనం!" అంది రమ.

రమేష్‌బాబు తండ్రి అంటే రమకు సదభిప్రాయం లేకపోయినా, తల్లి విషయంలో మాత్రం చాలా సదభిప్రాయం వుంది. ఈ సంగతి యితరులకేం తెలుసు! ఇంతకాలం జరిగిపోయినా, మనసులోని ఆ ప్రేమాభిమానాలు మాత్రం

అలానే వుండిపోయినాయ్. వెంటనే వేణీబాబు కూడా స్లేటు ఫిరాయించి, "మా పిన్ని చాలా విషయాల్లో మంచిదే! ఎప్పుడేనా ఆమె ప్రసక్తి వస్తే యిప్పటికీ మా అమ్మ కంటతడి పెడ్తుంది." అన్నాడు.

ఇక ఈ సంభాషణను యిలాగే సాగిస్తే యింకెంత దూరం పోతుందోననే అభిప్రాయంతో వేణీబాబు చప్పున ప్రసంగాన్ని మార్చి; "సరే రమా! ఇహ ఈ విషయంలో తుదినిర్ణయం జరిగిపోయినట్టేగా!" అన్నాడు.

ఒకక్షణం రమ నవ్వి; "వేణీబాబూ! శత్రుశేషాన్ని, ఋణశేషాన్ని అగ్ని శేషాన్ని ఉండనివ్వకూడదని మా నాన్న గారు అంటూండేవారు. తారిణీఘోషాల్ ప్రసక్తి వొస్తేనే మావాళ్ళు కోపంతో మండిపోతుంటారు. ఆయన ఒకప్పుడు మా నాన్నను సైతం జైలుకు పంపాలని ప్రయత్నించాడు. అంతా నాకు బాగా గుర్తే వేణీబాబూ! ఏ సంగతీ నేను మర్చిపోలేదు. ఇప్పుడు ఈ రమేష్ అయినా మరెవరో కాదు గదా! సాక్షాత్తూ ఆ తండ్రికి కొడుకు! ఇక నే చెప్పేదేముంది? అసలు నామట్టుకు నేను ఏ విధంగానూ, ఆ గడప లోనికి వెళ్ళలేను, ఇహ ఆస్థిపాస్థుల విషయంలో ఏ విధమైన పేచీలూ లేకుండా; నాన్నగారే నాకూ తమ్ముడికీ కూడా స్పష్టంగా విభాగాలు చేసి రాసిపెట్టారు. కాకపోతే వాడు మరీ చిన్నవాడు గనుక ఈ ఆస్థికి సంబంధించిన రక్షణ భార మంతా నా నెత్తిమీదనే వుంది. నేను వెళ్ళను సరేగదా, నా కుటుంబంలో వాళ్ళుకూడా ఎవరూ వెళ్ళరు!" అంది రమ. మరోక్షణం ఆగి, "అదిసరేగాని వేణీబాబూ! అసలు

ఏ బ్రాహ్మణుడు కూడా ఈ శ్రాద్ధకర్మలో పాల్గొనకుండా నిరోధించే అవకాశం ఏమీ లేదంటావా?" అనడిగింది రమ.

వేణీ మరికొంచెం ముందుకు జరిగి; మరింత ఉత్సాహంతో; "నేనూ అందుకే ప్రయత్నిస్తున్నాను రమా! నీ సహకారం వుండాలేగాని ఎన్నయినా సాధిస్తాను. చివరకు రమేష్‌ను ఈ వూరినుంచే వెళ్ళగొట్టకపోతే, నా పేరు వేణీ ఘోషాల్ కాదనుకో! ఇకపోతే నేనూ-ఆ భైరవాచార్యులు మిగులుతాం, వాడిసంగతి నేను చూస్తాను! చచ్చిన తారిణీ ఘోషాల్ చావనే చచ్చాడు; ఇహ చూస్తాను వాడిని ఎవరు ఆదుకొంటారో! అన్నాడు వేణీబాబు.

రమ వెంటనే అందుకుని "ఇంకెవరు? రమేష్‌బాబే ఆదుకొంటాడు. ఎందుకంటే, శత్రుత్వం విషయంలో తండ్రి కంటే ఈయనేమీ తక్కువవాడు కాదు!"

వేణీ మరింత ముందుకు జరిగి సరిగ్గా గడప మీదే కూర్చున్నాడు. కంఠస్వరాన్ని మరింత చిన్నదిగా తగ్గించి; "శత్రువుకు నడుం విరగగొట్టాలంటే, సరిగా యిదే సమయం. మనం ఉపేక్షించి ఈ సమయాన్ని పోగొట్టుకున్నామో; ఇహ మనకు యిట్లాంటి అవకాశం ఎన్నడూ రాకపోవచ్చు. ఆస్తి పాస్తులు- వాటి సంబంధించిన బరువు - బాధ్యతలూ వాడి కింకా మొదలూ చివరా తెలియవు. కనుక ఈ సమయంలో మనం వాళ్ళను నిశ్శేషంగా నిర్మూలించ లేకపోతే- భవిష్యత్తులో వాళ్ళే మనకు గుండెలమీద కుంపటిగా తయారవుతారు అన్నింటికంటే - అసలు వాడు తారిణీఘోషాల్

కొడుకేగానీ మరొకడు కాదనే సంగతి మనం ఎప్పుడూ మర్చి పోగూడదు!" అన్నాడు వేణీబాబు.

"అవును ఆ సంగతి నాకు తెలుసు!" అంది రమ.

"నీకెందుకు తెలియదు రమా! తెలుసు తెలుసు! భగవంతుడు అసలు నిన్ను పురుషుడుగా పుట్టించాలను కుంటూనే ఏ కారణంచేతనో స్త్రీగా పుట్టించాడు. తెలివి తేటల విషయంలో ఏ యువరాజు నీముందు నిలవగలడు! ఈ సంగతి మేం అనేకసార్లు అనుకుంటూనే వుంటాం! సరే! చాలా వేళయింది; నే వెళ్తాను. వీలుంటే రేపు ఉదయం మళ్ళీ కనిపిస్తాను" అంటూనే లేచి నిలబడ్డాడు.

తనను గురించిన ప్రశంస తానే విని రమ లోలోపల చాలా సంతోషపడింది. ఆ ప్రశంస సరికాదనీ, ఏదో చెబుదా మని ఎంత ప్రయత్నించినా మనసులోని ఆందోళనవల్ల నోరెత్త లేక పోయింది.

సరిగ్గా ఈ సమయానికే "రాణీ! ఎక్కడున్నావు?" అని పిలుస్తున్న గంభీరమైన కంఠస్వరం వరండాలోనుంచి విని పించింది. కాని ఆ కంఠస్వరం ఎవరిదో యిద్దరూ చప్పున పోల్చుకోలేకపోయారు. రమేష్ తల్లి మాత్రమే రమను ఆ పేరుతో పిలుస్తుండేది. కాని ఆ సంగతి రమ అప్పుడే మర్చి పోయింది. మరుక్షణంలోనే రమేష్ అక్కడకు రానేవచ్చాడు. ఆ సమయమున అతని కాళ్ళకు చెప్పులు లేవు, జుత్తు తైల సంస్కారంలేక చిందరవందరగా వుంది. తెల్లని ప్రపంచె కప్పుకొని వున్నాడు. వేణీబాబును చూడ్డంతోనే "అరె! పెద్దన్నయ్యా కూడా యిక్కడే వున్నారే! సరే సరే చాలా

సంతోషం! మీకోసమే వూరంతా వెతుకుతూ తిరుగుతున్నాను. పదండి, మీరు లేకుండా అక్కడ ఏం జరుగుతుంది?" అని ఒక్కక్షణం ఆగి "మరి రాణీ ఎక్కడుందీ?" అనడిగాడు రమేష్.

రమేష్ గుమ్మానికి ఎదురుగా నిలబడివున్నాడు. రమ గుమ్మానికి లోపలే ఎదురుగా తలవంచుకుని నిలబడివుంది. అక్కడించి పారిపోదామన్నా అవకాశంలేదు. రమేష్ ఒక్కక్షణం ఆమెను ఆపాదమస్తకం పరిశీలనగా చూసి గుర్తించి ఆశ్చర్యపడ్డాడు.

"అరె! నువ్వు రాణీవుకదూ! ఓ! చాలా పెద్దదానివై పోయావుసుమా! గుర్తించనే లేకపోయాను! కులాసాయేగదా!" అన్నాడు రమేష్.

రమ అదే విధంగా తలవంచుకుని నిలబడివుంది రమ నోరెత్తి ఏమీ చెప్పలేకపోయింది. మరోక్షణం తర్వాత రమేష్ చిన్నగా నవ్వి; "నన్ను గుర్తించావా! నేను రమేష్‌ను" అన్నాడు.

ఇప్పటికీ రమ తలెత్తి అతని ముఖంకేసి చూడలేకపోతున్నది. కాని, మృదుమధురమైన స్వరంతో అతన్నుద్దేశించి; "మీరు కులాసాయేగదా!" అనడిగింది.

"ఆ! ఆ! కులాసాయే! అది సరేకానీ, 'మీరు' అని కొత్తగా సంబోధిస్తున్నావేమిటీ యివాళ!" అన్నాడు రమేష్.

మరోక్షణం తర్వాత చిన్నగా నవ్వుతూ వేణీనుద్దేశించి, "అన్నయ్యా చాలా కాలం క్రితం రమ అన్నమాట

యిప్పటికీ నాకు గుర్తొస్తుంది. మా అమ్మ చనిపోయినప్పటి సంగతి. అప్పటికి రమ యింకా చాలా చిన్నది అంత చిన్న వయసులోనే నన్ను ఓదార్చుతూ, కన్నీళ్ళు తుడిచి, రమేష్ బాబూ! ఎందుకు ఏడుస్తావు! మీ అమ్మ చనిపోతే, మా అమ్మ లేదా! నీకేమిటి లోటు? దుఃఖపడకు అని ఎంతగానో ఓదార్చింది... బహుశా ఈ సంగతి రమ మర్చిపోయే వుంటుందనుకుంటాను. సరేగాని రమా! మా అమ్మ నీకు గుర్తుందా? అనడిగాడు రమేష్.

రమ సిగ్గుతో తలను మరింత వాల్చుకుంది. 'చిన్నత్త నాకు బాగా గుర్తుందనీ, నే నెప్పుడూ మర్చిపోలేదని' చెబుదామని ఎంత ప్రయత్నించినా ఆ మాట చెప్పలేకపోయింది.

మరో నిముషం తర్వాత రమేష్ ప్రత్యేకించి రమనుద్దేశించి; "ఇక అట్టే వ్యవధి లేదు. అంతా కలిపి రెండు మూడు రోజుల్లోనే శ్రాద్ధకర్మలు ప్రారంభించాల్సి వుంటుంది. ఇంత వరకూ ఏమీ పనులు జరగలేదు, ఇక ఏం జరగాలో ఎట్లా జరగాలో అవన్నీ నువ్వు స్వయంగా దగ్గరుండి జరిపించాలి. ఇంక నాకెవరున్నారు? ఈ ప్రపంచంలో నిజంగా, నిరాధారుడూ, ఆశ్రయ విహీనుడూ అంటూ ఎవరన్నా వుంటే-వాణ్ణి నేనే! అందుకే ఈ గుమ్మంలోనికే వచ్చాను మీరు లేకుండా నే నేమీ చెయ్యిలేను." అన్నాడు రమేష్‌బాబు.

సరిగ్గా ఈ సమయానికే రమ పిన్ని వచ్చి రమేష్ ముందు నిలబడింది. రమగానీ వేణీబాబూగానీ రమేష్‌కు ఏ సమాధానమూ చెప్పక పోవడంతో ఈమెకు చాలా సౌలభ్యం ఏర్పడింది. ఈ అవకాశం పోగొట్టుగోవడం యిష్టం

లేక వెంటనే కళ్ళు మరింత పెద్దవిచేసి రమేష్ ముఖంలోనికి సూటిగా చూస్తూ! "నాయనా నువ్వు తారిణీఘోషాల్ కొడుకువి కాదుటోయ్ !" అనడిగింది విచిత్రంగా.

రమేషు యిప్పటి వరకూ ఈమెను చూడనేలేదు. ఎందుచేతనంటే రమేషు ఈ వూరు విడిచి వెళ్ళేనాటికి ఈమె యింకా ఈ ముఖర్జగారి కుటుంబంలోనికి రాలేదు. రమ తల్లికి జబ్బుగా వున్నప్పుడు యీామె వొచ్చింది. ఆ రావడం రావడం యిహ మళ్ళీ వెళ్ళనేలేదు. అంచేత రమేషుకు ఎంతో ఆశ్చర్యం కలిగింది.

క్షణక్షణానికి పిన్ని కోపం మరింత పెరిగిపోతున్నది. ఆ కోపంలోనే "ఆఁ నువ్వు తారిణీఘోషాల్ కొడుకువే! కాకపోతే యింత సిగ్గుమాలిన తనం యింకెవరికుంటుంది? తండ్రి ఎంతో కొడుకూ అంతే!" అన్నది కటువుగా.

రమేషు నిర్ఘాంతపోయాడు.

వేణీబాబు తన అసహాయత్వాన్ని కప్పిపుచ్చుకునేందుకా అన్నట్లు నెమ్మదిగా అక్కణ్ణుంచి తప్పుకున్నాడు. రమ గదిలోపలే నిలబడి పిన్ని నుద్దేశించి "ఏమిటీ నువ్వు వాగే వాగుడు! ఎందుకూ అనవసరపు విషయాలు ప్రస్తావించడం! నీపనేదో నువ్వు చూసుకోరాదూ?" అన్నది. దానితో పిన్ని మరింత రెచ్చిపోయి విషపూరిత స్వరంతో, "నువ్వూరుకోవే పిచ్చిదానా! మనం చేసేది నిర్భయంగా చెయ్యాలి; చెప్పదలచింది నిర్మొహమాటంగా చెప్పాలి. మీలాగా మనిషి ముందొకమాట మనిషి వెనక మరోమాటా మాట్లాడ్డం నాకు చేతకాదు. లేకపోతే వేణీబాబు అట్లా ముఖం చాటు చేసు

కోవడం దేనికీ? ఏం; వాడు ఎదురుగా నిలబడి, 'ఏమయ్యా మీ తండ్రి శ్రాద్ధపు భోజనం కోసరం, మీ యింట్లో నీళ్ళు తోడిపొయ్యడానికీ పిండి విసరడానికీ మేమేం గుమాస్తాలమా, లేకపోతే మీ జమీందారీలోని రైతులం అనుకుంటున్నావా' అని ఒక్కముక్క అనలేదూ! తారిణీబాబు చచ్చాడులే ప్రాణాల్లో వాళ్ళంతా నిశ్చింతగా గాలి పీల్చుకుంటున్నారు" అని ఆగిపోయింది పిన్ని. కోపంతో ఆమె ముఖం కందగడ్డలా మారిపోయింది.

రమేష్ నిర్ఘాంతపోయి అలాగే నిలబడి పోయాడు. ఇలాంటి పరిణామం సంభవిస్తుందేమోనని అతను కలలోకూడా ఊహించలేదు. లోపల వంటగది తలుపు గొళ్ళెం కదిలిన చప్పుడైంది. కాని ఆ సంగతి ఎవరూ గమనించలేదు. అప్రతిభుడు, లజ్జాభరితుడైన రమేష్‌ను సూటిగా చూస్తూ; "నాయనా! ఎంతచెడ్డా నువ్వు బ్రాహ్మణ బిడ్డవి! నౌకర్ల చేత సమాధానం చెప్పించి నిన్ను అవమానపరచడం నాకిష్టం లేదు!. పో! వెళ్ళు; వెళ్ళి నీ పనులేవో నువ్వు చూసుకో! నువ్వేం ముక్కుపచ్చలారని చంటిబిడ్డవేం కాదు. అయిన దానికి కానిదానికీ, యికమీదటనుంచీ మావంటి గృహస్థుల గుమ్మాల్లోకి రావడం అట్టే మంచిదికాదు. భోజనానికి కాదు సరికదా, కనీసం గుమ్మంలో కాళ్ళు కడుక్కునేందుకు కూడా రమ మీ యింటికి రాదూ! నే చెబుతున్నాను; ఇహ వెళ్ళు" అంది పిన్ని నిష్కర్షగా!

ఆ మాటతో రమేశ్‌కు మళ్ళీ మెలుకువ వచ్చినట్లయింది. మరుక్షణంలోనే దీర్ఘంగా నిట్టూర్చాడు. ఆ

నిట్టూర్పు తనకే ఆశ్చర్యం కలిగించింది. గదిలోపల నిలబడిన రమ ఈ క్షణాన తలెత్తి రమేశ్ ముఖంలోకి చూసింది. రమేశ్ ఒక్కక్షణం అటూఇటూ చూసి; రమ నుద్దేశించి; "రావడానికి యిష్టమే లేకపోతే; యింక నేను చెయ్యగలిగిందేముంది! కాని, ఇన్ని సంగతులు నాకసలు తెలియవు. తెలియక నేను కలిగించిన ఉపద్రవానికి, నన్ను క్షమించు రాణీ!" అన్నాడు రమేశ్.

ఆతర్వాత రమేశ్ నెమ్మదిగా వెళ్ళిపోయాడు. ఆతరువాత యింట్లో యిందుకు సంబంధించిన మాటలేమీ వినపడలేదు. ఎవరైతే క్షమాభిక్ష కోరి వెళ్ళిపోయాడో, ఆ వ్యక్తి అసహాయంగా, నిరాశతో కూలబడి పోయిందనే సంగతి అతనికేం తెలుసు? సరిగ్గా ఆ క్షణానే వేణీబాబు మళ్ళీ ప్రత్యక్షమయ్యాడు. అతను ఎంతోదూరం వెళ్ళలేదు; ఇక్కడే వరండాలో ఏ మూలో నిలబడి, తనకు ఆసక్తికరమైన ఈ దౌర్భాగ్యపు చర్చ ఎట్లా అంతమవుతుందా అని చూస్తున్నాడు. అత్తయ్యను చూడ్డంతోనే అతనికి మరింత సంతోషం కలిగింది. వేణీ మరింత ముందుకొచ్చి; "భలే! మొత్తానికి మంచి సమాధానం చెప్పావు అత్తయ్యా! ఇంత కటువుగా సమాధానం చెప్పడం నాకెన్నడూ వల్లేమవుతుంది!" అని అదే సంతోషంలో రమ నుద్దేశించి; "రమా! నువ్వు చూశావో లేదోగానీ, అత్తయ్య చెప్పిన సమాధానం వినేసరికి వాడిముఖం ఆషాఢమేఘంలాగా మబ్బేసి పోయిందనుకో! మంచి ప్రాయశ్చిత్తం జరిగింది వాడికి." అన్నాడు వేణీ.

అతని మాటలు వినేసరికి పిన్నికి మళ్ళీ రోషం పుట్టు కొచ్చింది. వేణీ నుద్దేశించి, "జరిగిందేదో మంచే జరిగింది కానీ, నువ్వు చేసింది మాత్రం మంచి పనికాదు. సమాధానం చెప్పవలసిన బాధ్యత మాలాంటి ఆడవాళ్ళగిూద వది లేసి, నువ్వు తప్పుకోవడం పురుషుడు చేసే పనేనా? ఒక వేళ నువ్వు చెప్పలేకపోతే; నేను చెబుతున్నప్పుడైనా నువ్వు ప్రక్కన నిలబడి వింటే నీకూ పనికొచ్చేది. సమయమొచ్చినప్పుడు తప్పుకు పోవడం పురుషులు చేసేపనికాదు." అంది కఠినంగా

ఆ మాటకు వేణీ ముఖం కాస్తా పాలిపోయింది అతని చిరునవ్వు కాస్తా చిందర వందరై పోయింది. ఈ అభియోగానికి ఏమని సమాధానం చెప్పడమా అని ఎంత ఆలోచించినా అతనికి అంతుబట్టలేదు. ఎంతసేపు ఆలోచించనవసరం లేకుండానే; యింతవరకూ పల్లెత్తి మాట్లాడని రమ అందుకుని; అర్థంకాని ధోరణిలో; "పిన్నీ నీకంటే కఠినంగా లోకంలో యింకెవరు మాట్లాడగలరు? పాము కోరల్లో విషాన్ని మాత్రమే చూశానుగానీ; మనిషి మాటల్లో కూడా యింత విషం వుంటుందనుకోలేదు." అంది రమ.

పిన్ని, వేణిబాబూ, యిద్దరుకూడా నిర్ఘాంతపోయారు. పిన్ని తలతిప్పి రమను పరీక్షగా చూసి "ఏమిటే! నువ్వంటు న్నదీ?" అనడిగింది విచిత్రంగా.

"ఏం లేదు! జపం చెయ్యాలని కూర్చుని ఇప్పటికి ఏడుసార్లు లేచావు. ఆ జపం సంగతేదో చూడు! ఈపూట కేమన్నా వంట అయ్యేదున్నదా లేదా?" అంటూనే వంట గదిలోనుంచి బయటకొచ్చి యింకేమీ మాట్లాడకుండానే

సరాసరి వరండాలోనుంచి అవతలి గదిలోకి వెళ్ళిపోయింది. వేణీబాబు తడి ఆరిపోయిన గొంతు సవరించుకుని, "అత్తయ్యా! ఏమిటీ ఆవిడ ధోరణి!" అనడిగాడు. అతని కేమీ అర్థంకాక.

'ఏం చెప్పను నాయనా! ఒకాయన రాజు; ఒకావిడ రాణి! వాళ్ళిద్దరి మనసులలోని సంగతులు తెలుసుకోవడం, నాబోటి దాసదాసీలకు సాధ్యమా నాయనా!" అంది. క్రోధంతోనూ, క్షోభతోనూ ఆమె ముఖం నల్లబడి పోయింది. ఆమె మళ్ళీ జపం చెయ్యడానికి పీటమీద కూర్చుంది. ఆమె మనస్సు దేన్ని జపిస్తున్నదో ఆ సంగతి భగవంతునికే తెలుసు. వేణీ అక్కణ్ణుంచి వెళ్ళిపోయాడు.

## 2

ఈ ఊరిపేరు కుద్రాపూరు. ఈ ఊరితోపాటు దీనికి సంబంధించిన ఆస్తిపాస్తులనుగురించి ఓ చిన్న కథవున్నది. రమారమి వంద సంవత్సరాలకు పూర్వం కులీన బ్రాహ్మణుడైన బలరామ్ ముఖర్జీ తన మిత్రుడైన ఘోషాలునితోపాటు విక్రమపురంనుంచి యిక్కడకు వచ్చాడు. కేవలం ఆస్తిబలమేకాకుండా బుద్ధిబలంకూడా కలిగినవాడు ముఖర్జీ. వివాహం చేసుకున్నాడు; ఆ తర్వాత వర్ధమాన మహారాజు దగ్గర నౌకరీకూడా చేశాడు. ఆ సమయంలోనే ఆయన అనేకవిధాల తన ఆస్తిని ఎన్నోరెట్లు పెంచాడు. ఘోషాల్

మహాశయుని వివాహంకూడా ఈ ప్రాంతంలోనే జరిగింది కాని; ఆయన తన జీవితకాలంలో భుక్తి గడుపుకోవడమే తప్ప—ఆస్థి సంపాదించలేకపోయాడు. ఈ వివాహాన్ని గురించే ఈ ఉభయ మిత్రులమధ్య అభిప్రాయభేదాలు ఏర్పడినయ్. ఈ అభిప్రాయభేదాలు ఎంత కఠినంగా పెరిగాయంటే-ఒకే వూళ్ళో వుంటూకూడా రమారమి ఇరవై ఏళ్ళవరకూ ఒకరి ముఖం మరొకరు చూసుకోలేదు. చివరకు బలరామ్ ముఖర్జీ చనిపోయిన రోజునకూడా ఘోషాల్ ఆ గుమ్మంలో అడుగు పెట్టలేదు. కాని ముఖర్జీ చనిపోయిన నాలుగోనాడు ఒక విచిత్రమైన విషయం బయటపడింది. ఆయన చనిపోతూ తన యావదాస్థిని రెండు సమభాగాలుచేసి, సగం తన కుమారు నికీ-మిగిలినది తన మిత్రునికుమారునికీ చెందేట్టు వీలునామా వ్రాశాడు. అప్పట్నుంచీ, ఈ యిద్దరి వంశస్థులు ఈ ఊరి తాలూకు స్థిరాస్థిని సమంగా అనుభవిస్తూ వొస్తున్నారు. వీరు తమంత తామే జమిందారులమని చెప్పుకున్నారు, గ్రామస్థులుకూడా కాదని వ్యతిరేకించలేదు. ఆ తర్వాత కొంతకాలానికి ఘోషాల్ వంశస్థులుకూడా రెండుభాగాలుగా విడిపోయారు. ఘోషాల్ వంశంలోని కనిష్ఠసోదరుని వార సుడు, సర్వాధికారి. తారిణి ఘోషాల్ మహాశయుడే! ఈయనే కోర్టుకు సంబంధించిన ఒకానొక వ్యవహారంలో జిల్లాకోర్టు వరకూ వెళ్ళాడు. ఇదికాక ఇంకా చిన్నచిన్న దావాలు మరో ఐదారువరకూ ఏ తీర్పూ లేకుండా ఇంకా వూగిసలాడుతూనే వున్నాయి. ఇంతలోనే ఏ కోర్టునుంచి, ఏ జడ్జి తీర్పుచెప్పాడో కాని, ఆయనకాస్తా ఈలోకంనుంచే శాశ్వతంగా సెలవు

తీసుకున్నారు. ఆయన ఆకస్మిక మరణంవల్ల వూళ్ళోనూ, పొరుగువూళ్ళలోనూ కాస్త గందరగోళంగానే చెప్పు కున్నారు. ఘోషాల్ వంశంలోని జ్యేష్టసోదరుని వారసుడూ, సర్వాధికారీ వేణీఘోషాల్ పినతండ్రి చనిపోవడంతో ఆయ నకు చాలా సౌలభ్యం ఏర్పడింది. వ్యక్తిగతంగా అతని మనసు కెంతో ప్రశాంతత లభించినట్లయింది. రమారమి పది పన్నెం డేళ్ళనుంచి, ఆస్థులకు సంబంధించిన విషయాల్లో పినతండ్రికీ కొడుక్కీకూడా మాటల్లేకుండా పోయినవి. మాటలేకాకుండా, ఆయన బ్రతికి వున్నంతవరకూ వీళ్ళిద్దరూ ముఖముఖాలు కూడా చూసుకోలేదు. మనుషులు పోయినా, వాళ్ళు రగి ల్చిన ఈర్ష్యా ద్వేషాలూ మిగిలినవాళ్ళలో యింకా రగుల్తూనే వున్నయ్. పినతండ్రి శ్రాద్ధకర్మకు సంబంధించినంతవరకు సాధ్యమైనంత ఎక్కువ ప్రతిష్టంభన ఎట్లా కలిగించడమా అనే యిప్పుడు వేణీబాబు ఆలోచిస్తున్న విషయంకూడాను.

తారిణీఘోషాల్ భార్య చనిపోయికూడా చాలా కాలమే అయింది. అందుచేత కొడుకు రమేష్‌ను అతని తాత గారింటికి పంపించివేసి, యీ కోర్టు దావాలతో జీవిత కాల క్షేపం చేస్తున్నాడు. ఇంట్లో పనిపాట్లన్నీ నౌకర్లే చూస్తుం టారు. రమేష్ రూర్కీ ఇంజనీరింగ్ కాలేజీలో చదువు తున్నాడు తండ్రి మరణవార్త అతనికి అక్కడే అందింది. తండ్రిపట్ల తన శేషకర్తవ్యాన్ని నిర్వర్తించడంకోసరం నిన్న మధ్యాహ్నమే రెండుగంటలవేళ యింటికొచ్చాడు. రమా రమి పది పన్నెండేళ్ళ తరువాత రమేష్ తన యింటికి రావడం యిదే మొదటిసారి.

శ్రాద్ధకర్మలు ప్రారంభించడానికి అట్టే వ్యవధి లేదు. వచ్చే గురువారమే. ఆద్య శ్రాద్ధం ప్రారంభించాల్సివుంది. వీటితో పాటు సహపంక్తి భోజనాలకోసరం కాస్త ఘనమైన ఏర్పాట్లే చేయాలని రమేష్ తాపత్రయం. ఈలోగా అతిథులు అంతా కలిపి అయిదారుగురికంటే ఎక్కువ రాలేదు వారైనా యిరుగుపొరుగు గ్రామాలనుంచే వచ్చారు. స్వగ్రామంలో వాళ్ళుమాత్రం ఒక్కరైనా యింతవరకూ రాలేదు. అసలు వస్తారన్న నమ్మకంకూడా కలగడంలేదు కేవలం భైరవాచార్యులూ, ఆయన కుటుంబ సభ్యులుమాత్రమే వచ్చారు. వాళ్ళంతా యింటిపనుల్లో మునిగిపోతున్నారు. స్వగ్రామంలోని పరమ పవిత్రమైన బ్రాహ్మణ పాదధూళి తనకు లభిస్తుందో లేదోననే సందేహమే రమేష్‌కు అంతకంతకూ ఎక్కువౌతున్నది. అయినా, తన శక్తికొద్దీ యీ కార్యాన్ని కాస్త ఘనంగానే జరిపించే ఏర్పాట్లు చేస్తున్నాడు.

ఇవాళ చాలాసేపట్నుంచీ యింటిపనుల్లోనే రమేష్ మునిగితేలుతున్నాడు. బయటికి తొంగిచూసే అవకాశమే లభించడంలేదు. యాదృచ్ఛికంగా అట్లా బయటకు చూసేసరికి యిద్దరు వృద్ధమహాశయులు జంపఖానామీద కూర్చుని హుక్కా పీలుస్తున్నారు వాళ్ళని పరామర్శించడంకోసరం రమేష్ బయటికొచ్చి శ్రద్ధా వినయపూరితస్వరంతో ఏదో మాట్లాడబోయే సమయానికి, వెనుకనుంచి ఎవరో వస్తున్న చప్పుడు వినిపించింది. వెనక్కు తిరిగి చూసేసరికి, అయిదారుగురు పిల్లల్ని వెంటబెట్టుకుని అతివృద్ధుడైన మరొక మహాశయుడు దగ్గుతూ ఆయాసపడుతూ లోపలికి వొస్తున్నాడు.

ఆయన భుజంమీద మాసిన అంగవస్త్రంవుంది. కళ్ళకు భూత ద్దాల్లాంటి మందపాటి కళ్ళజోడు దారంముక్కల సాయంతో చెవులకు కట్టుకున్నాడు. తలంతా పూర్తిగ పండిపోయింది. తెల్లబడిపోయిన మీసాలుకూడా, ధూమపానంవల్ల పొగబట్టి అదోక విచిత్రమైన రంగుగా మారిపోయినయ్. ఆయన లోప లికి- దాబాపు రమేష్‌కు దగ్గరగావచ్చి, కళ్ళద్దాల్లోనుండి రమే ష్‌ను ఒక్కక్షణం పరిశీలనగాచూసి, మరుక్షణంలోనే పెద్ద పెట్టున భోరున ఏడుపు ప్రారంభించాడు. రమేష్ ఆయన్ను అసలు గుర్తించనేలేదు. అయినా వృద్ధుడు ఏమాత్రం సంకో చంలేకుండా దుఃఖపూరితస్వరంతో రమేష్ నుద్దేశించి, "కాదు నాయనా కాదు; యీ దుఃఖాన్ని సహించడం నావల్లకాదు. తారిణీబాబు యింత అకస్మాత్తుగా వెళ్ళిపోతాడని నే నెప్పుడూ అనుకోలేదు. గౌరవనీయమైన ఛటర్జీలవంశంలో ఏ అసత్యాన్నీ నేను చెప్పలేను. నే వచ్చే దారిలో వేణీ ఘోషాల్ కనిపిస్తే, "మా రమేష్‌బాబా! అతనిలాంటివాళ్ళు నూటికీ కోటికీ ఒకరుంటారేమో! తండ్రి శ్రాద్ధకర్మలను యింత ఘనంగా జరపడం, యీ ప్రాంతంలో ఎవ్వడూ కనీవినీ ఎర గడు" అని వాడి మొహాన్నే చెప్పాను" అన్నాడు వృద్ధుడు.

మరోక్షణం ఆగి, "నాయనా రమేశ్‌బాబూ! ఆ గాడిద నాగురించి నీకు వున్నవీ లేనివీ అనేకం చెప్పివుంటాడు. వాటినిగురించి అట్టే పట్టించుకోవద్దు. నే చెపుతున్నాగా! నా పేరు కేవలం ధర్మదాసేకాదు; నేను నిజంగా ధర్మానికే దాసుణ్ణి! అధర్మానికి దాసుణ్ణికావడం యీ జన్మలో నావల్ల అయ్యేపనికాదు" అన్నాడు వృద్ధుడు.

ఆ తర్వాత 'సత్యాన్ని'గురించి మరో గంభీరమైన ఉపన్యాసంచెప్పి అది పూర్తికాగానే; ఆ ప్రక్కనేవున్న గోవిందగంగూలీ చేతిలోని హుక్కాకాస్తా చటుక్కున లాక్కొని గట్టిగా రెండుదమ్ములు లాగాడు. ఆ వెంటనే దగ్గు ముంచుకొచ్చింది.

ధర్మదాసుచెప్పిన యితర విషయాల్లో కొన్ని అతిశయోక్తులున్నమాట నిజమేకాని; శ్రాద్ధకర్మను యింత ఘనంగా జరపటం అన్న మాటల్లోమాత్రం ఏమీ అతిశయోక్తిలేదు. కలకత్తానుంచి ప్రత్యేకంగా మిఠాయిచేసే వంటవాణ్ణి పిలిపించాడు. వాడు వరండాకు ఆ చివరగా ఒక పెద్ద పొయ్యి ఏర్పాటుచేసి, అక్కడే మిఠాయిలు తయారు చెయ్యడం ప్రారంభించాడు. అంతపెద్ద పొయ్యి, బాణలీ చూసేసరికి యిహ పిల్లలంతా ఎంతో వింతగా అక్కడే చేరడం ప్రారంభించారు. నిమ్నజాతివాళ్ళకు వస్త్రదానం చెయ్యడానికికూడా ఏర్పాట్లుచేశాడు రమేశ్. వరండాకు యీప్రక్కగా కూర్చుని భైరవాచార్యులు తానులుకొద్దీ గుడ్డను సమంగా ముక్కలుగా చింపుతున్నాడు. ఇదికూడా ఎంతో చిత్రంగా చూడ్డం ప్రారంభించారు. ఎంచేతనంటే, యీ చుట్టుప్రక్కల ఎవళ్లూకూడా యింత ఘనంగా శ్రాద్ధకర్మలకు ఏర్పాట్లు చేసివుండలేదు. తమకు దానంగా లభించబోయే వస్త్రాలనుగురించి ఎంతో ఆశతోనూ, ఆనందంతోను వాళ్ళ ముఖాలు వికసిస్తున్నప్పటికీ- వాళ్ళ అంతరాత్మల్లో మాత్రం రమేశ్ యొక్క తెలివిమాలినతనాన్నిగురించి, యీ దండుగమారి ఖర్చులనుగురించి వాళ్ళు వూహించకమాన

లేదు. బీదాబిక్కి జనం అంతా ఈ సంగతి తెలియడంతోనే సుదూర ప్రాంతాలనుంచి కూడా జట్లు జట్లుగా రావడం ప్రారంభించారు. ముసలి - ముతకా - ఆడా- మగా, పిల్లా- జల్లా భేదం లేకుండా, ఓపికవున్న ప్రతివాడూ అక్కడు చేర డంతో - ఇల్లంతా నిండిపోయింది.

ఈ విధంగా పోగైన జనం వాళ్ళల్లో వాళ్ళే- ఈ అనవ సరపు ఖర్చును గురించీ- అనవసరపు ఆర్భాటాన్ని గురించీ వాదోపవాదాలు ప్రారంభించారు. సమర్థించే వాళ్ళు సమర్థి స్తూనే వున్నారు, వ్యతిరేకించే వాళ్ళు వ్యతిరేకిస్తూనే వున్నారు. ధర్మదాసు తలెత్తి నాలుగువైపులా చూసేసరికి, ఎటుచూసినా ఈ పరిస్థితే కనిపించింది. ఈ అనవసరపు వాదోప వాదాలను గమనించేసరికి ఆయనకు మళ్ళీ దగ్గు ముంచు కొచ్చింది.

ఎవరు ఏమనుకొన్నప్పటికీ రమేశ్ మాత్రం ఎవరికీ ఏ సమాధానమూ చెప్పలేదు. అయినా ధర్మదాసు అతన్ని విడిచి పెట్టలేదు చెయ్యి పట్టుకుని అతన్నుద్దేశించి ఖంగు ఖంగుమని దగ్గుతూ ధర్మదాసు ఏమని అన్నాడో- ఆ సంగతి ఒక్క అక్షరంకూడా ఎవరికీ బోధపడలేదు.

నిజం చెప్పాలంటే అందరికంటే ముందు వచ్చినవాడు గోవిందగంగూలీ. చెప్పవలసింది ఏదైనా వుంటే-న్యాయంగా గోవిందగంగూలీ చెప్పవలసింది. కాని ఆ అవకాశం కాస్తా ధర్మ దాసు కొట్టేశాడు. అందువల్లగంగూలీ మహాశయునికి కడుపులో వల్లమాలినంత మంటగా వుంది. ఐనా తన యత్నాన్ని విడిచి పెట్టేరకం కాదు గంగూలీ. అదీగాక ఇంకా అవకాశం వుండనే

వుంది. దాన్ని సద్వినియోగం చేసుకునేందుకుగాను ధర్మదాసు నుద్దేశించి, "ధర్మాభాయ్! నిన్న ఉదయం ఏం జరిగిందో తెలుసా! ఎంతగా రావాలని ప్రయత్నించినా. వీలైతేనా? వేణీ ఘడియఘడియకూ కబురు పంపిస్తూనే వున్నాడనుకో నాకోసరం! బాబాయిని ఒకసారి వచ్చి కనీసం చుట్టయినా కాల్చుకు వెళ్ళమని కబుర్లమీద కబుర్లు పంపాడనుకో! నాకైతే వాళ్ళు మండినంత కోపం వచ్చింది. కాస్త వాడికి బుద్ధివచ్చేట్టు చేద్దామా అనిపించిందిగానీ; సరే, పోనీలే అని సహించాను. కాని, ఆ దరిద్రుడు ఏమన్నాడో తెలుసా; వింటున్నావా రమేశ్ బాబూ?

"బాబాయ్! మీరే రమేశ్ కు ఆధారమూ, మార్గదర్శకులూ అనుకో! కాని నువ్వే చెప్పు బాబాయి, వాడి కొంపలో ఆ శ్రాద్ధపు తిండి ఎవడన్నా తింటాడంటావా? అని నన్నే అడిగాడు వాడు. కాని నేను విడిచిపెడతానూ! ఎన్నడూ గుప్పెడు అటుకులైనా పొరుగువాడికి పెట్టేవాడు! ఆ తర్వాత వేణీతో ఏం చెప్పానో తెలుసా? "వేణీబాబూ! దారి యిదేగదా! కాస్త అట్లావెళ్ళి చూసిరారాదా? పేద వాళ్ళకు వస్త్రదానం కోసరం ఎంతఘనంగా రమేశ్ ఏర్పాట్లు చేస్తున్నాడో నీకే తెలుస్తుంది." అన్నాను. అంతే, మళ్ళీ వాడు నోరెత్తలేదు. అని మరోక్షణం ఆగి; "రమేశ్ అంతా కలిపి నిన్న మొన్నటి కుర్రాడు! ఐతేనేం; ధైర్యం అంటే ఇతన్ని ముందుచెప్పి యితరుల్ని చెప్పాలి! ఓహోహో! ఏం దర్జా, ఏం హుందాతనం. ముక్కులో వెంట్రుకలు కూడా పండిపోయే వయసొచ్చిందిగానీ,- జీవితంలో నేనెన్నడూ

శ్రాద్ధకర్మలు యింత ఘనంగా చేసినవాణ్ణి చూళ్ళేదు! ఫర్స్టుక్లాస్! ఒక్కమాటే చెబుతున్నా వినూ! లోకులు వస్తారా, రారా అనే సంగతి మనకు అనవసరం. మనం చేసేది మనం చేసుకుంటూపోవడమే! అసలు యిదంతా ఎవరి పేరు మీదుగా అయితే జరుగుతుందో- వాళ్ళ అంతరాత్మ సంతోషిస్తుంది; మనకు అంతకంటే కావలసిందేముంది?" అన్నాడు గోవిందగంగూలీ.

ధర్మదాసు ఇంకా తలగుంఖంగుమని దగ్గుతూనేవున్నాడు. అతని శ్వాసకోశం స్థితి ఏమాత్రం బాగా లేదు. అతని ముందు కూర్చుని గోవిందగంగూలీ తన నాలిక దురదకొస్తా వాదిలించుకుంటున్నాడు. అసలే జమీందారీ కుటుంబపు అమాయకుడు రమేశ్! ఇహ అతనిమీద తన ప్రభావాన్ని ఎంతగా చూపెట్టడానికి వీలుంటుందో అంతమేరా చూపించాలని గంగూలీ అభిప్రాయం. కాని ధర్మదాసుకు యిదంతా అసహ్యంగానే వుంది. ఆయన స్వయంగా ఏమైనా చెయ్యాలనుకున్నా ఈ ముదనష్టపు దగ్గు మూలంగా చెయ్యలేక పోతున్నాడు. ఏదైనా చెబుదామనున్నా, వున్నదగ్గు మరింత ఎక్కువౌతున్నది.

మరోక్షణం తర్వాత, రమేశ్ నుద్దేశించి; "నాయనా రమేశ్! నువ్వేం మాకు పరాయివాడివా? నీకు తెలియదేమోగాని; మీఅమ్మ నాకేమౌతుందో తెలుసా! సాక్షాత్తూ మా మేనత్తకు పినతండ్రి మేనకోడలు. రాధానగరపు బెనర్జ వంశాన్ని గురించి మీ నాన్నకు బాగా తెలుసు. ఏ చిన్న విషయానికైనా పెద్దదానికైనా, సాక్ష్యానికైనా దెబ్బలాట

కై నా; అదీ ఇదీ అనేమిటీ - ప్రతిచిన్న విషయానికీ నన్ను పిలవండే వ్రారకునే వాడుకాదు మీ నాన్న" అన్నాడు గోవిందగంగూలీ.

ఈ లోగా ధర్మదాసు తన 'దగ్గు' మీద విజయం సాధించాడేమో; కాస్త గొంతు సవరించుకొని; "ఎందుకురా గోవిందూ; ఎందుకట్లా ఏకరువు పెడతావు? నేనేమన్నా నిన్నగాక మొన్న పుట్టానంటావా? అన్నీ తెలుసునాకు. ఒకసారి నిన్ను సాక్ష్యం వేసుకుంటే; తారిణీబాబుకు నువ్వు చెప్పిన సమాధానం నాకు గుర్తులేదనుకున్నావా?" అని ఒక్క క్షణం దగ్గు సంబాళించుకుని, రమేశ్ వేపుతిరిగి; "ఈ గోవింద గంగూలీయే కోర్టుకు రావడానికి కాళ్ళకు చెప్పులులేవని వంక పెట్టాడు. అప్పుడు తారిణీబాబు రెండున్నర రూపాయలు పెట్టి చెప్పులు జత కొనిస్తే; ఆ జతే తొడుక్కొని తారిణీకి వ్యతిరేకంగా, వేణీ తరఫున సాక్ష్యం చెప్పాడు." అని చెబుతుండగానే దగ్గుతెర మళ్ళీముంచు కొచ్చింది. మరో క్షణం తర్వాత తెప్పరిల్లుకొని, "ఆ సమయంలో సాక్షాత్తూ, తారిణీబాబును మూర్ఖుణ్ణి చేసింది నువ్వుగదూ! నేను మర్చిపోయాననుకుంటు న్నావా?" అన్నాడు ధర్మదాసు. ఎలాగో తెరిపి చేసుకొని, గోవిందుని కళ్ళు కోపంతో ఎర్రబడిపోయినాయ్. ధర్మదాసు వేపు తీక్షణంగా చూస్తూ "ఎవరూ? నేనా? తారిణీ బాబాయిని మూర్ఖుణ్ణి చేశానా?" అన్నాడు గోవింద గంగూలీ.

"కాకపోతే యింకెవరు?" అన్నాడు ధర్మదాసు.

"ఛీఛీ! నోరుముయ్యి! అన్నీ దొంగకూతలూ, నువ్వూ!" అన్నాడు గంగూలీ.

"దొంగను నేను కాదు; నువ్వూ, నీ బాబూ!" అన్నాడు ధర్మదాసు.

గంగూలీ కోపంతో మండిపోతూ, జీర్ణావస్థలోనున్న తన గొడుగు తీసుకుని, ధర్మదాసును చావమోదడానికి సిద్ధపడ్డాడు. ధర్మదాసుకూడా ఏమాత్రం జంకకుండానే తన చేతికర్ర తీసుకుని తిరగబడడానికి సిద్ధపడ్డాడు. ఈ వాదోపవాదాలు యింతలోనే యింత తీవ్రస్థాయికి చేరుకుంటాయని ఎవరూ వూహించలేదు. ఇదంతా చూసేసరికి రమేష్‌కు సిగ్గూ ఆశ్చర్యమూ ఒక్కసారే కలిగినయ్. వెంటనే జోక్యం కలిగించుకుని, యిద్దర్నీ చెరొకవైపూ కూర్చోపెట్టాడు. అయినా ఒకరినొకరు తిట్టుకోవడం మాత్రం మానలేదు. ధర్మదాసు వైపు కళ్ళురుముతూచూస్తూ, "నువ్వుండు రమేష్, వాడి సంగతేమిటో నేను అంతుతేలుస్తాను" అంటున్నాడు గోవిందగంగూలీ.

"ఏడిశావులే పోరా! పక్షి; నీవల్లేమవుతుంది?" అంటున్నాడు ధర్మదాసు రొప్పుతూ.

కలకత్తానుంచి వచ్చిన మిఠాయివంటవాడు పూరీలు చేస్తూచేస్తూ యీ దృశ్యాన్ని చూశాడు. వాడికీ ఎంతో ఆశ్చర్యం కలిగించింది. ఆ దగ్గర్లోనే చిల్లరమల్లర పనులు చూస్తున్నవాళ్ళుకూడా పనులు వొదిలేసి, యీ తమాషా ఏమిటో చూడ్డానికి వచ్చి ఎదురుగా నిలబడ్డారు. ఇహ పిల్లల సంగతి చెప్పనే అక్కర్లేదు; వాళ్ళు మరింత విచిత్రంగా

చూస్తూ చుట్టూ చేరారు. రమేషు సిగ్గుతోనూ, అవమానం తోనూ కింకర్తవ్యతామూఢుడై పోయి తలవంచుకు నిల బడ్డాడు. పల్లెత్తి ఒక్క మాటకూడా పలుకలేకపోయాడు. అసలు యివంతా ఏమిటి? ఎందుకిట్లా జరిగిందీకూడా అతని కర్థంకాలేదు. ఇద్దరూ పెద్దవాళ్ళు, చాలాకాలంగా తెలిసిన వాళ్లు! పైగా ఇరుగుపొరుగువాళ్ళు. అదీగాక బ్రాహ్మణులు. ఇంత స్వల్పమైన విషయానికి ఎందుకిట్లా సిగ్గువిడిచి రచ్చ కెక్కుతున్నారో తెలియదు. ఛి, ఛీ అనిపించింది. వరండాకు ఆ చివరగా కూర్చుని భైరవాచార్యులు గుడ్డలతానులు చింపుతున్నాడు. ఇంత జరిగినతర్వాత యిప్పుడు తాపీగా లేచి రమేష్‌దగ్గరకొచ్చి: "రమా-రమి ఐదొందలు ముక్కలు చింపాం. యివి సరిపోతాయా, యింకా కావాలా?" అనడి గాడు. భైరవ్.

రమేష్ సిగ్గుతోనూ అవమానంతోనూ తలవంచుకు కూర్చున్నాడేమో, భైరవాచార్యులకు ఏమీ సమాధానం చెప్పలేకపోయాడు. రమేషు మానస్థితి చూసేసరికి భైరవునికి నవ్వొచ్చింది. సానుభూతిస్వరంతో రమేషు నుద్దేశించి, "రమేషుబాబూ! మీ రెందుకు విచారిస్తారు? పల్లెటూళ్ళలో యిది చాలా సాధారణమైన విషయం. ఇటువంటి సందర్భాల్లో పెద్దపెద్ద కొంపల్లో ఒక్కోసారి తలలు పగలకొట్టు కోవడందాకా పోతుంది" అని ఒక క్షణం ఆగి, గోవిందు నుద్దేశించి.

"గంగూలీ మహాశయా, ఏంపని యిది! చి ఛీ! నీకెట్లా వుంటేగాని, నాకుమాత్రం ఏమీ బాగాలేదు" అని తిరిగి

ధర్మదాసు నుద్దేశించి, "ధర్మదాబాబూ! ఇహ మీరుకూడా కాస్త తెలివిలోకి రండి! చూడండి, యిప్పటికి చింపిన గుడ్డ ముక్కలు సరిపోతాయంటారా? యింకా కావలసి వుంటా యంటారా ?" అనడిగాడు.

ధర్మదాసు నోరెత్తకముందే గోవిందుడు తలూపుతూ "కావద్దూమరి! లేకపోతే అవేం సరిపోతాయి? కథా-కార్యాలు జరిగేప్పుడు యిలాంటివి మామూలే! అదీగాక, లక్ష అబద్ధాలు ఆడితేగానీ ఒక పెళ్ళికాదని, శాస్త్రాల్లోనే చెప్పారు...అరే భైరవ్! ఆ సంవత్సరం ఏంజరిగిందో నీకు గుర్తుందా? అదేరా...జాదూముఖర్జీ కూతురు మహాలక్ష్మి వ్రతం చేసిన సంవత్సరం! ఒక చిన్న విషయానికిగాదూ రాఘవభట్టాచార్య, హారాన్ ఛటర్జీ తలలు పగలకొట్టుకో లేదూ! కాని నే చెబుతున్నానుగదా॥ రమేషుబాబు చేస్తున్న యీపనిమాత్రం నాకేమీ బాగాలేదు. నీచజాతివాళ్ళకి వస్త్ర దానంచెయ్యడం అగ్నిలో ఆజ్యం పొయ్యడంలాంటదే అనుకో! అట్లా కాకుండా బ్రాహ్మణుడికి ఒక్కొక్కజత ధోవతులు, వాళ్ళ పిల్లలకు అంగవస్త్రాలూ, దానంచేస్తే- దాని వల్ల పరువూ-ప్రతిష్టా పెరుగుతుంది, పుణ్యమూ వుంటుంది. నామాట వినదలిస్తే రమేషుబాబూ...అట్లా చేయించు. ఏం ధర్మదాసుబాబూ, చెప్పవేం!" అన్నాడు గోవిందగంగూలీ.

ధర్మదాసు తలూపుతూ, "గోవిందుడు చెప్పిందినిజమే ఈ వెధవలకు లక్షవస్త్రాలు దానంచేసినా పుణ్యమూలేదు, ప్రయోజనమూ లేదు. మనం ఎంతచేసినా శూద్రులు

శూద్రులే! వింటున్నావా రమేషుబాబూ !" అన్నాడు ధర్మదాసు.

రమేషు యింతవరకూ అసలు మాట్లాడనేలేదు. వస్త్రదానంగురించి వీళ్ళు చేస్తున్న ఆలోచనలతో అతని మనసుకు మరింత కష్టంకలిగింది. ధర్మదాసు, గోవిందు వీళ్ళు చేస్తున్న నీచపు ఆలోచనలు అతనికి మరింత అసహ్యం కలిగించినయ్. వీళ్ళు యింతసేపూ ఎవరినైతే నీచులూ, దౌర్భాగ్యులూఅని నిందించారో॥ వాళ్ళ కళ్ళముందే, వాళ్ళకంటే హీనాతిహీనంగా స్వల్పవిషయానికి కొట్లాడుకున్నారు. అందుకు వాళ్ళ ముఖాల్లో చీమతలకాయంతైనా సిగ్గులేదు. సరిగదా, ఉచ్ఛనీచాలను గురించి ఉపన్యాసాలివ్వడం ప్రారంభించారు. భైరవుడు యిప్పటికీ రమేష్‌కు ఎదురుగానే వున్నాడు. అతనుద్దేశించి, ఇంకా రెండొందలముక్కలు చింపండి." అన్నాడు రమేష్.

అవి లేకపోయినా పనిజరిగిపోయింది. కాని రమేష్ చెబుతున్నాడు గనుక భైరవునికి చెయ్యక తప్పలేదు. రమేష్ చెప్పినమాట వినపడగానే; గోవిందుడు వెంటనే లేచి; "పద భైరవ్, నేకూడా సాయంచేస్తాను. నువ్వొక్కడివీ ఎన్నని చింపుతావు?" అని మరో మాటకు ఎదురు చూడకుండానే, తానులు దగ్గర భైరవునితోపాటు కూలబడ్డాడు. రమేష్ యింట్లోకి వెళదామనుకున్న సమయంలోనే ధర్మదాసు అతన్ని చెయ్యిపుచ్చుకొని అవతలికి తీసికెళ్ళి చెవిలో ఏమిటో గుసగుస చెప్పాడు. ఆమాటలు ఎవరికీ వినిపించలేదు. ఆమాటలన్నీ విని రమేష్ తలూపుతూ తన సమ్మతిని ప్రకటించి లోప

లికి, వెళ్ళిపోయాడు. కాని ఈ సంగతి మాత్రం, గుడ్డలు చింపుతూ గోవిందగంగూలీ అంతా ఒక కంటితో కనిపెడు తూనే వున్నాడు.

మరి కాసేపటికి మరొక వృద్ధ మహాశయుడు వరండా లోనికి వచ్చాడు. ఆయన మూతిమీద మీసాలు పూర్తిగా లేవు ఆయన వస్తూనే "రమేష్‌బాబు ఎక్కడున్నాడూ?" అనడిగాడు.

ఈ వృద్ధ బ్రాహ్మణునివెంట ముగ్గురు పిల్లలుకూడా వున్నారు. అందులో ఒక ఆడపిల్ల. పిల్లల్లో ఈ యిద్దరు మగ పిల్లలకంటె, ఆపిల్లే కాస్త పెద్దది. బాగా మాసిపోయిన బట్టలు కట్టుకున్నారు. వాళ్ళ పేదరికం వాళ్ళు చెప్పకుండానే తెలిసిపోతున్నది. మొగపిల్లలిద్దరూ, మొలకు చిన్న చిన్న గోచీల్లాంటివితప్ప మరొక ఆచ్ఛాదనమే వాళ్ళకు లేదు. ఆ వరండాలో అంతకు ముందున్న వారంతా తలెత్తి వీళ్ళను చూశారు. అందరికంటె ముందుగా స్వాగతమస్తున్న ధోర ణిలో ఆవృద్ధుణ్ణి ఉద్దేశించి "రా! దీనూబాబు! రా. ఇవేళ మేం చాలా అదృష్టవంతులం, యింతకాలానికి నీపాదధూళి లభ్యమవుతున్నది. ఇంకా సందేహిస్తావేం, యిట్లా పైకిరా; పిల్లల్ని అటు లోపలికి పంపించు" అన్నాడు గోవిందగంగూలీ.

ధర్మదాసు తీక్షణంగా ఒక్కసారి గోవిందుని వైపు చూశాడు. మరోక్షణం తర్వాత దీనూ నుద్దేశించి, చిన్నగా నవ్వుతూ, "ఎప్పుడు రావడం" అని పరామర్శించి, హుక్కా అతనికి అందించాడు. దీనూ భట్టాచార్య వరండాలో కూర్చుని నిప్పు ఆరిపోయినా ఆహుక్కానే రెండుసార్లు గుడగుడమని

పిల్చాడు. ఆతర్వాత ధర్మదాసు నుద్దేశించి చెబుతూ "మా అమ్మాయిని తీసుకొద్దామని మొన్ననే అత్తారింటికి వెళ్ళాను. ఇంతకీ రమేష్‌బాబు ఎక్కడున్నట్టు" అని ఒక్క క్షణం ఆగి మొన్న వూరినుంచి తిరిగి వచ్చేప్పుడు అక్కడే సంతలో ఎంత గానో చెప్పుకుంటున్నారు ఈ విషయాన్ని గురించి రమేష్ తన తండ్రి శ్రాద్ధకర్మలు ఎంతో ఘనంగా జరిపిస్తున్నాడనీ, పిల్లలకీ పెద్దలకీ కడుపునిండా తిండిపెట్టి డజనుడజను పూరీలు, మిటాయిలు కూడా చేతికిచ్చి పంపుతున్నట్టుగా...! అన్నాడు దీనూబాబు.

గోవిందుడు గొంతుసవరించుకుని; "అంతేగాదు, వస్త్ర దానం కూడా జరుగుతుంది... అదుగో రమేష్‌బాబు, రా నాయనా, యిలారా, ఈయనెవరో తెలునా; దీనూ భట్టా చార్య; గుర్తున్నాడా?" అని మరోక్షణంతర్వాత తన ధోరణి లోనే చెప్పుకుపోవడం మొదలెట్టాడు. "నువ్వు చేస్తున్న ఈ ఘనకార్యంగురించి పొరుగువూళ్ళల్లోకూడా చెప్పుకుంటున్నా రంట. ఆ సంగతి తెలిసీ తెలియడంతోనే దీనూబాబు సరా సరి యిక్కడికే వచ్చేశాడనుకో! నీకు యిలాంటివాళ్ళ ఆశీర్వా దాలే ముఖ్యం నాయనా; వీరి ఆశీర్వాదం వల్లనే ఇహంలో సుఖమూ, పరంలో పుణ్యమూ లభిస్తుంది." అని తిరిగి దీనూ బాబునుద్దేశించి, "ఇక్కడ రమేష్‌బాబు యింత ఘనంగా జరుపుతుంటే, వేణీ యిటువేపు కన్నెత్తి కూడా చూళ్ళేదు. పైగా కుతంత్రాలుకూడాను, నా దగ్గరకే రెండుమూడు సార్లు మనుషుల్ని కూడా పంపించాడు. అయినా నేను లక్ష్యపెడ తానూ? నాకూ రమేష్‌బాబుకూ వున్న బాంధవ్యం అంత

స్వల్పమైనదా ఏమిటీ... నిజం చెప్పాలంటే-మా బాంధవ్యం నర నరాల్లోనూ జీర్ణించిన సంబంధం వుంది... అరే షష్ఠీచరణ్ ఎక్కడ చచ్చావురా? కాస్త ఇట్లావచ్చి యిందులో కొంచెం పొగాకు వేసిపో! నాయనా, రమేష్ ఒక్కసారి యిలారా! నీకోసంగతి చెప్పాలి; మళ్ళీ తర్వాత మర్చిపోతానేమో...” అని రమేష్ రెక్క పుచ్చుకొని కొంచెం అవతలగా తీసికెళ్ళి చెవిలో గుసగుస చెప్తూ; “లోపల ఎవరు వున్నారూ; ధర్మదాసు భార్యేనా? ఆవిడే అనుకుంటాను, వొద్దునాయనా వొద్దు; ఆవిడచేతికిబంగారం తాళంచెవులు మాత్రం యివ్వకు. ఆ బ్రాహ్మడు ఎన్ని చెప్పినా నమ్మకు. నెయ్యి, నూనె, గోధుమరవ్వ, పంచదార, అన్నీ సగానికి సగం మాయం కాగలవు ఏమిటీ ఆలోచిస్తున్నావు? సందేహించకు నాయనా, నే వెళ్ళి మీ అత్తయ్యను పంపిస్తాను. దానిచేతికి తాళాలు యిచ్చావంటే, నీ సొమ్ము చిల్లిగవ్వంత కూడా వృధాకానివ్వదు. దాని సంగతి నాకు బాగా తెలుసు.” అన్నాడు గోవింద గంగూలీ.

“సరే, మీ యిష్టం” అని తలూపాడు రమేష్. కాని అతనికెంతో ఆశ్చర్యం కలిగింది. ఎంచేతనంటే, అంతకు ముందే ధర్మదాసు కూడా గోవిందుని భార్యను గురించిసరిగ్గా యిట్లాగే చెప్పాడు. తనభార్య సత్యసంధతను గురించి, గోవిందుడు చెప్పినట్టే ధర్మదాసుకూడా, చెప్పాడు. ధర్మదాసుకొచ్చిన అనుమానమే సరిగ్గా అట్లాగే గోవిందునిక్కూడా కలిగేసరికి రమేష్కు ఆశ్చర్యం కలిగింది. యింతలోనే గోచీలు పెట్టుకున్న యిద్దరుపిల్లలు పరుగెత్తుకుంటూవచ్చి దీనూబాబు

భుజాలమీద పడి మిఠాయి కోసరం మారాం చెయ్యడం మొదలు పెట్టారు.

దీనూబాబు నిస్సహాయంగా ఒకసారి రమేశ్ ముఖం లోనికి మరోసారి గోవిందుని వైపుచూసి, "మిఠాయి ఎక్కడి దిరా నాయనా; ఎట్లా వస్తుందీ?" అన్నాడు.

పిల్లలు కళ్ళు మరింత పెద్దవిచేసి "అదేం! అక్కడ తయారుచేస్తున్నారు" అన్నారు పిల్లలు మిఠాయి పొయ్యి వేపు చూపిస్తూ.

"మాకు కావాలి. మాకు కావాలి," అంటూ మరి కొంతమంది పిల్లలుకూడా ధర్మదానుచుట్టూ గంతులువేస్తూ నిలబడ్డారు.

ఇదంతాచూసి రమేష్‌వాళ్ళ నుద్దేశించి, "ఉండండి నాయనా, నేపెట్టిస్తాను." అని వంటవాణ్ణి ఉద్దేశించి, "ఇదో మహాశయా; నీపేరేమిటి – కాస్త నామాటవిను ...ఈపిల్లలు ఎంతసేపనగా అయిందోవచ్చి; అన్నాలైనా తిన్నారో లేదో.. ఈపిల్లలు ఎంతసేపనగా అయిందోవచ్చి ; అన్నాలైనా తిన్నారో లేదో ... కాస్త అమిటాయిపళ్ళెం యిట్లా పట్టుకురా! అన్నాడు రమేష్.

వంటవాడు మిటాయిపళ్ళెం తెచ్చి పిల్లలముందు పెట్టాడు. పళ్ళెం పెట్టీపెట్టటంతోనే పిల్లలు అందరూ ఒక్కసారే ఆకలిగొన్న పులుల్లాగా దానిమీద విరుచుకు పడ్డారు. ఆమిటాయి ఎవరూ ఎవరికీ పంచిపెట్టనవసరం లేకుండానే; తలాకాస్తా తన్నుకుపోయారు. పిల్లలు ఆవిధంగా ఆవురావురు మంటూ, మిటాయి తినడం చూసేసరికి, దీనూనాథుని కళ్ళు

చెమ్మగిల్లినయ్. మరోక్షణం తర్వాత; పిల్లల్నుద్దేశించి, "ఒరే ఖేన్‌దీ ఎక్కడకి పోయాడురా యింతలోనే?" అన్నాడు. ఆమరుక్షణంలోనే వాడుకూడా యింత మిటాయి నోట కుక్కుకుని నమలడంచూసి; "అహా నువ్వా యిక్కడే వున్నావా? ఉఁ ఎట్లా వుందిరా మిటాయి అనడిగాడు.

"బావుంది, బావుంది." అంటూ కళ్ళు మరింత పెద్దవి చేసి చెప్పాడు.

దీనూనాధుడు మరింత సంతోషంతో "అవునవును, అసలే అది మిటాయి, అందులోనూ కలకత్తావాళ్ళు చేసింది; ఎందుకు బావుండదూ? అని మళ్ళీ మిటాయి వంటవాణ్ణి వుద్దేశించి, "ఏమయ్యా అప్పుడే బాణలి పొయ్యిమీదనుంచి దింపేశావేం!" అనడిగాడు.

"అదేమిటి గోవింద్‌భాయీ అట్లా అంటావు; యింకా మిటాయి చేసే రోజులు వున్నయి గదా!"

కలకత్తా మిటాయి వంటవాడు మాత్రం ఏభావమూ వ్యక్తం కాకుండానే, అవును బాబూ అవును; యింకా మిటాయి చేసే రోజులు చాలా వున్నాయ్. యివాళ యింకా సంధ్య వేళైన కాలేదు"

అలాఐతే కొంచెం మిటాయి గోవిందుని కివ్వరాదూ? ఎలావుంటో కాస్త రుచి చూస్తాడూ! కలకత్తావాళ్ళ వంట పనితనంకూడా ఎట్లాంటిదో తెలుస్తుంది అరే... వొద్దు వొద్దు నాకు మాత్రంవొద్దు. అంతగా కావలంటే; అందులో సగమే చాలు, అంతకంటే రుచి చూడలేను ... అరే; షష్టీచరణ్ ఎక్కడున్నావురా నాయనా ... కాస్త అట్లా లోపలికిపోయి

ఒక్క గ్లాసు మంచినీళ్లుపట్రా ... చేతులు కడుక్కొని ఈ మిటాయి రుచిచూడాలి."

అంతలోనే రమేష్ కల్పించుకుని, షష్టీచరణ్ నుద్దేశించి వొస్తూ వొస్తూ మరో నాలుగు పళ్ళాలుకూడా తీసుకురా." అన్నాడు రమేష్‌కూడా చెప్పడంతో షష్టీచరణ్ నిజంగానే, నాలుగు పళ్ళాలు, నాలుగు నీళ్ళ గ్లాసులు తెచ్చి అక్కడ పెట్టాడు. చూస్తూ చూస్తూండగానే ఆ ముగ్గురు బ్రాహ్మణులు అంతపెద్ద మిఠాయి పళ్ళాన్ని మలేరియా దోమల్లాగా పీల్చిపారవేశారు. ఆతరువాత తాపీగా చేతులూ, మూతులూ కడుక్కుంటూ, ఏం సోదర మహాశయా! మిటాయి బావున్నట్టేనా ... మొత్తానికి కలకత్తావాళ్ళ ప్రతిభ చెప్పుకోదగిందే అనుకుంటాను, ఏమంటావు ? అన్నాడు దీనానాధుడు తన పక్కవాళ్ళ నుద్దేశించి ధర్మదాసు పళ్ళెం యింతకుముందే ఖాళీ అయింది. మిటాయితో కడుపుకాక గొంతుకూడా పూడిపోయిందేమో, ధర్మదాసు నోటితో మాత్రం ఏమీ చెప్పలేక కేవలం సంజ్ఞలద్వారానే తన సంతృప్తిని వెల్లడించాడు.

గోవిందుడు అందరికంటే చివరగా చేతులూ, మూతీ కడుక్కుంటూ, "దీన్నే 'ఇంద్రజాలం' అంటారు. యిలాంటి మహత్తరమైన ఇంద్రజాలాన్ని ఎక్కడో వస్తాదుల్లాంటివాళ్ళు తప్ప చెయ్యలేరు." అని నవ్వుతూ అన్నాడు.

వంటవాడు మరింత వినయంగా గోవిందు నుద్దేశించి "మహాశయా, కాస్త కష్టం అనుకోకుండా ఈ'రవ్వకేసరి'

కూడా కాస్త రుచి చూశారంటే..నాకు చాలా సంతోషం!" అని అన్నాడు.

"రవ్వకేసరా? ఏదీ ఎక్కడుందీ, తీసుకురా చూద్దాం!" వంటవాడు 'రవ్వకేసరి' పళ్ళెంకూడా తీసుకొచ్చి ముందు పెట్టాడు. అంతకు ముందు పెట్టిన మిటాయి పళ్ళెంలాగానే ఈరవ్వకేసరి పళ్ళానికికూడా పట్టబోయే 'దురవస్థ' వూహించుకునేసరికి రమేశ్ కు నోట మాటలేకుండా పోయింది. ఆశ్చర్యంతో కళ్ళప్పగించి అట్లాగే చూస్తూ కూర్చుండిపోయాడు.

దీనూనాథుడు పిల్లదాన్నుద్దేశించి, "ఒసే నువ్వుకూడా కాస్త రుచి చూడవే!" అన్నాడు.

"వొద్దు నాన్నా, యిహ తినలేను."

"ఏం ! ఓసి పిచ్చిదానా ! అంతగా అయితే ఒక్కగ్లాసు మంచినీళ్ళు తాగు, అంతా జీర్ణమైపోయింది. పోనీ అంతగా తినలేకపోతే, కాస్త కొంగునకట్టుకో, రేపుతాపీగా తిందువుగాని, ఆఁ రమేష్ బాబూ ! సరేగానీ యింతకీ ఈ రెండు రకాలేనా మిఠాయి చేయించేదీ ?" అనడిగాడు. రమేష్ చెప్పకముందే వంటవాడు కల్పించుకుని, "ఇవే కాదు బాబు; ఇంకా చాలా వున్నయ్, రసగుల్లా. ఖీరామోహన్: వగైరా వగైరా వున్నయ్ బాబూ" అన్నాడు వంటవాలు.

"ఖీరా మోహనా ! ఆఁ హాఁ, మరి చూపించనైనా లేదేం!"

రమేష్ ఆశ్చర్యంతో యిదంతా వింటూ చూస్తూ కూర్చుండి పోయాడు. దీనూ నాథుడు రమేష్ నుదేశించి, "బాబూ! నువ్వు నమ్ము నమ్మకపో; రాధానగర్ లోని బోస్

బాబుగారింట్లోనే నేను ఖీరామోహన్ తిన్నాను అంటే! ఇహ ఆ తర్వాత మళ్ళీ లభించనేలేదు. ఆసంగతి గుర్తొస్తే యిప్పటికీ నోరూరుతుంది. ఖీరామోహన్ అంటే నాకు ఎంత యిష్టమో చెప్పలేను"

'అవును, ఆసంగతి నాకు తెలుస్తూనేవుంది' అన్నట్టుగా రమేష్ నవ్వుతూ తలూపాడు,

ఇంతలో ఏదో పనిమీద రాఘాల్ అటువేపు వెళ్తున్నాడు. అతన్నుద్దేశించి, "చూడు రాఘాల్, కాస్త లోపలికి వెళ్ళి 'ఖీరామోహన్' కొంచెం పళ్లెంలో పెట్టి పంపించే ఏర్పాటు చెయ్యి" అనిచెప్పాడు

సంధ్యవేళ కావొస్తున్నది. అయినప్పటికీ బ్రాహ్మణులు ఖీరామోహన్ కోసరం యింకా ఎదురుచూస్తూనే వున్నారు. రాఘాల్ తిరిగివచ్చి, "భండారానికి తాళం వేసివుంది. ఇహ ఈవేళ తియ్యడం సాధ్యంకాదనుకుంటాను" అన్నాడు.

ఆ మాట రమేష్కు కొంచెం కష్టంకలిగించింది. అంచేత మళ్ళీ అతనుద్దేశించి" లోపలికివెళ్ళి నా పేరుచెప్పు; నేకావాలంటున్నానని చెప్పు" అన్నాడు రమేష్.

రమేష్ నిస్సహాస్థితిని గోవిందగంగూలీ పసిగట్టి "చూశావా దీనూభాయ్, ఇదంతా ఆ భైరవాచార్యులుపయోగించిన అతితెలివి! తల్లికిలేని ప్రేమ మేనత్తకు పుట్టుకొచ్చిందోయ్ దీనూ; వింటున్నావా? అందుకే నేనంటూనే వుంటాను..."

ఈ మాటలన్నీ వినేసరికి రాఘాల్ నిగ్రహించుకోలేకపోయాడు. వాళ్ళ నుద్దేశించి "పాపం భైరవాచార్యులేం

చేస్తాడు? ఆయనెన్నెందుకు అడిపోసుకుంటారు? ప్రక్కింటినుంచి ఎవరో ఒక 'అమ్మ' వచ్చింది. ఆమె వచ్చీ రావటంతోనే చిన్నదానికి, పెద్దదానికీ; రెండు భండారగృహాలకు తాళాలు వేసింది." అన్నాడు రాఘూలుడు ధర్మదాసు, గోవిందుడూ కూడా పూర్తిగ ఆశ్చర్యపడి "ఎవరూ"? ఎవరూ వచ్చింది?" అనడిగాడు యిద్దరూ ఒక్కసారి!

రమేష్‌కూడా ఆశ్చర్యంతోనే, "ఏమిటీ పెద్దమ్మ వచ్చింది" అనడిగాడు కుతూహలంగానూ.

"అవునుబాబూ! ఆమెగారే రెండుగదులుకీ తాళాలు వేశారు" ఆశ్చర్యమూ, ఆనందమూ రెండూ ఒక్కసారే కలిగినయ్ రమేషుకు. పెద్దమ్మ వొచ్చినసంగతి తెలియడం తోనే ఇహ అక్కడ ఒక్కక్షణం కూర్చోలేదు. వెంటనే లోపలికి వెళ్ళాడు.

# 3

"పెద్దమ్మా! పెద్దమ్మా!"

పిలుపు వినిపించడంతోనే విశ్వేశ్వరి యింట్లో నుంచి బయటికొచ్చింది. వేలీ వయసుతో అంచెనా వేసిచూస్తే, ఈమె వయసు కనిసం యాభై ఏళ్ళకు తక్కువ వుండదు. కాని చూడ్డానికి నల్భై ఎళ్ళకంటే చిన్నదానిలా కనపిస్తుంది.

రమేశ్ అమెను చూస్తూ అలాగే నిలబడిపోయాడు. ఈ నాటికీకూడా పెద్దమ్మలోని ఆస్వర్ణకాంతులు అలాగే నిలచి

పోయాయా అనిపించింది అతనికి. తన చిన్నప్పుడు ఆమెను ఏ రూపంలోనైతే చూశాడో, ఈనాటికీ అలా గే కనిపిస్తున్నది. కాలప్రభావంగానీ, కాలగతి వల్ల మనుషులలో వచ్చే విపరీతమైన మార్పులు గాని ఈమె సౌందర్యాన్నిగురించీ, ఆప్రాంతం వాళ్ళంతా ఎంతో గొప్పగా చెప్పుకునేవాళ్లు. ఆనాటి సౌందర్యం ఈ నాటికీ ఏమాత్రం చెదిరినట్టు కనిపించడం లేదు. ఆమె శరీరంలో ని ప్రతి భాగంలోనూ సౌందర్యం భాసిస్తూనేవుంది. కాకపోతే తలనిూది రెండుమూడు వెంట్రుకలు మాత్రం కొం చెంగా తెల్లబడి, నుదుటిమీద గాలికి రెపరెపలాడుతున్నయ్. అంతకు మినహా మరో మార్పేకనిపించలేదు. ఆముఖ ఆకారమూ, పెదాలూ, చేతులూ, కంఠస్వరం, అంతా కూడా, ఏ మహత్తరమైన శిల్పియొక్క చిరకాలతపస్సాధనాఫలితంగా నో ఉద్భవించిన మానవమూర్తిగా కనిపిస్తుంది. ఇహ ఆ రెండు కళ్ళూ-అదొక అద్భుతసృష్టి! ఒక్కసారి ఆ కళ్ళనుచూసి. ఏ మందభాగ్యుడూ జీవితకాలంలో మర్చిపోలేడేమోననిపిస్తుంది. ఈమే రమేశ్ కు పెద్దమ్మ అవుతుంది. చనిపోయినరమేశ్ తల్లిని ఈమె ఎంతగానో అభిమానించేది. ఐతే ఈ భాంధవ్యాలు గాఢంగారూపొందడమనేది అత్తవారింట్లోనే జరిగింది. ఎంచేతనంటే, వేణీతల్లి (విశ్వేశ్వరి) రమేశ్ తల్లీ ఒకే కుటుంబం లోని తోటికోడళ్ళు. ఆ సమయంలో మామా ఆడబిడ్డల అపరిమిత కాష్టానికి తలొగ్గి, ఈతోడికోడళ్ళిద్దరూ, ఇంట్లో ఏమూలో కూలబడి కళ్ళల్లోనీరు కళ్ళల్లోనే దిగమింగుకునేవారు. అలాంటి సమయాల్లోనే వాళ్ళిద్దరి మధ్యా, కేవలం తోడికోడళ్ళ బాంధవ్యం కాకుండా, అంతకు మించిన, అనురా

గాలూ. ఆ ప్యాయతలూ పాదుకున్నవి. ఆతర్వాత కాలక్ర మాన్ననుసరించి ఎన్నో మార్పులు జరిగిపోయినయ్. కుటుం బాలు విడిపోవడం, మాట పట్టింపులు-ద్వేషాలూ, దావాలూ, కోర్టులూ, ఎన్నో జరిగిపోయినయ్. ఇవన్నీ కూడా చూస్తు చూస్తుండగానే ఒకతుఫానులాగా ఈ రెండు కుటుంబాల్లోనూ ఎన్నో మార్పులు తెచ్చి పెట్టింది. ఈలోగా పిల్లలు కూడా పెరిగి పెద్దవాళ్ళయి, ఆస్థిపాస్తులు, మంచిచెడ్డల విషయాల్లో స్వయం నిర్ణయాలు చేసుకునేస్థితికి వొచ్చారు. వివాహాలవల్ల ఎర్పడ్డ ఈ అభేద్య బాంధవ్యాలు, ఈ మార్పులవల్ల కొంత సన్నగిల్లినమాట నిజమేగాని, పూర్తిగా మాత్రం అంతరించి పోలేదు.

చాలా సంవత్సరాల తర్వాత ఈవేళే మొదటిసారిగా పెద్దమ్మ మళ్ళీ ఈ గడపలో కాలుపెట్టింది. అట్లా పాదం పెట్టిన ఉత్తరక్షణంలోనే, కొన్ని సంవత్సరాలకు పూర్వం చిన్నకోడలు తనయింటిని ఎట్లా తీర్చిదిద్దుకున్నదో-ఆ దిద్దు బాటు, అలంకరణా అన్నీ యీనాటికీకూడా స్పష్టంగా గుర్తు కొచ్చి ఆమెకళ్ళు ఒక్కక్షణం చెమ్మగిల్లినయ్. ఆ ఒక్కక్షణం ఆమె మనస్సులో నిష్కల్మషమైన ప్రేమానురాగాలు ప్రవ హించినమాటమాత్రం నిజం

రమేష్ పిలుపువిని అకస్మాత్తుగా యింట్లోనుంచి బయ టికి రావడంతో ఆమె కళ్ళల్లోని నీరు స్పష్టంగా రమేష్ చూసి, నిర్ఘాంతపోయాడు. ఈ విషయాన్ని ఆమె వెంటనే పసిగట్టినా, పితృహీనుడయిన రమేషును చూడ్డంతోనే, ఆమె మనసు మరింత కరుణాపూరితంగా ద్రవించిపోతున్నా, ఆ

భావాన్ని తనముఖంలో ఏమాత్రం వ్యక్తంకానీయకుండానే చిన్నగా నవ్వి, "గుర్తించావా నాయనా? నే నెవర్ని?" అనడిగింది.

రమేషుకంఠం రుద్ధమైపోయింది. తల్లి చనిపోయిననాడు యీ పెద్దమ్మే తనను గుండెలకు హత్తుకుని ఎన్నోరోజులు తనను లాలించి పాలించింది. ఆ తరువాత తాతగారింటికి వెళ్ళిపోయాడు. ఆ పెద్దమ్మే ఆవేళ యింటికి వెడితే, తనకు కనిపించలేదు సరికదా, 'యింట్లోలేదని' చెప్పించింది. ఆ రెండు సంఘటనలూ రమేషు యింకా మర్చిపోలేదు. ఆ తర్వాత రమ యింటిముందు వేణీ సమక్షంలో ఏం జరిగిందో అదంతా సరిగ్గానే గుర్తున్నది. అంత అవమానం జరిగిన తరువాత; యిహ యీ వూళ్ళో తనవాళ్ళంటూ ఒకరున్నారన్న విశ్వాసమే రమేషుకు లేకుండా పోయింది.

విశ్వేశ్వరి, రమేష్ దీనవదనాన్ని గుర్తించి, "రామ రామ! అదేమిటి నాయనా, యిది దిగులుపడే సమయమా?" అని అన్నది. ఆమె కంఠస్వరంలో ఏ కొంచెమైనా, అభిమానం వుందో లేదో కూడా గుర్తించడం కష్టంగానేవుంది ఐనా రమేషు తనను తాను సంబాళించుకుని, దేశకాలపాత్రల నెరుగకుండా అభిమానాన్ని వ్యక్తంచేయడం తగదన్న నిర్ణయానికొచ్చాడు. అంచేతనే ఆమె నుద్దేశించి, "లేదు పెద్దమ్మా; నేనేమీ దిగులుపడటంలేదు. నాకు చాతనైనదీ–చెయ్యగలిగినంతవరకే చేస్తున్నాను. కాని నువ్వు వచ్చినందు వల్ల ఎక్కువ ప్రయోజనం వుంటుం దనుకోవడంలేదు" అన్నాడు,

పెద్దమ్మ నవ్వి "నువ్వు నన్నెమీా పిలవలేదుగదా! ఐనా ఆ విషయం ఎందుకు? సరే నే చెప్పేది శాస్త్రవిను. భోజనాలవ్యవహారాలు పూర్తికాకముందే, తినడానికి వంట యింట్లోనుంచి ఏవస్తువూ బయటికి పోనీయను. నే వెళ్ళేప్పుడు వంటగది తాళాలు నీకు అప్పచెప్పి వెళ్తాను. తిరిగి రేపు వుదయంవచ్చి నీదగ్గర్నుంచి నేనే తీసుకుంటాను. చూడు నాయనా, యీా తాళాలుమాత్రం యితరులకు యివ్వకు. ఆఁ అది సరేగానీ, ఆవేళ మీా అన్నయ్యను కలుసుగోడానికి వెళ్ళావుగదా? ఏం జరిగిందీ ?" అనడిగింది.

రమేషు సందిగ్ధంలో పడ్డాడు. పెద్దమ్మకు అసలు తన కొడుకునుగురించి, అంతా తెలుసా, లేక అసలు తెలియదా? కొంచెం ఆగి, "ఆవేళ? పెద్దన్నయ్య యింట్లోలేనిరోజా ?" అన్నాడు రమేషు.

మాట అడగడమైతే విశ్వేశ్వరి అడిగిందికాని ఆ మరు క్షణంలోనే ఆమెముఖం కాంతిహీనంగా మారిపోయింది. ఐతే యీా సంగతి రమేషు గుర్తించకపోలేదు. కాస్త ఆ తరు వాత ఆమె సరళమైన మధురస్వరంతో చిన్నగా నవ్వుతూ రమేషు నుద్దేశించి,

"అయ్యోరామ! ఆవేళ ఆయన కనిపించకపోతే మళ్ళీ కలుసుగోడానికి వెళ్ళనేలేదన్నమాట! ఆయనకు నీమీాద కోపంగావున్నమాట నిజమే ఆసంగతి నాకు తెలుసు. కాని నీ కర్తవ్యాన్నికూడా నువ్వు నిర్వర్తించుకోవాలిగదా! వెళ్లు నాయనా వెళ్ళు! వెళ్ళి ఒక్కసారి, మీా అన్నయ్యకు నచ్చ చెప్పు. ఎంత కాదనుకున్న ఆయన నీకంటే పెద్దవాడుగద!

పెద్దవాడిముందు తలవంచుకున్నందువల్ల సిగ్గుపడవలసిం దేమి లేదే! అయినా యిల్లాంటి క్లిష్టపరిస్థితుల్లో కాస్తా వెళ్లాపడ్డా నా మనం మనపనులు పూర్తిచేసుకోవాలిగాని, యిట్లా భీష్మించుకు కూర్చుంటే ఎట్లా? తప్పు నాయనా, వెళ్ళు. నా మాట విను. నా బాబుగదూ. నా రత్నాల బిడ్డ! నా మాట ఎప్పుడూ కాదనవు. వెళ్ళి ఒక్కసారి మీ అన్నయ్యను కలుసుకుని మంచీచెడ్డా మాట్లాడిరా !"

రమేషు పల్లెత్తిమాట్లాడలేదు. పెద్దమ్మ యింతగా బ్రతిమాలి ఎందుకు చెబుతున్నదో అతనికి అర్థంకాకుండానే వుండిపోయింది. విశ్వేశ్వరి మరింతముందుకు రమేషుకు దగ్గరగాజరిగి, మరింత అభిమానంగా, "నువ్వు చిన్నవాడివి నాయనా, కేవలం పసివాడివి! ఇప్పుడు బయట వరండాలో కూర్చున్న చాలామంది అతిథుల్ని నీకంటే నేను బాగా ఎరుగుదును నాయనా! వాళ్ళమాటలు వినకు। పద, నేను తీసుకెడతాను. ఒక్కసారి అన్నయ్యను కలుసుగుని వద్దువుగాని" అన్నది.

రమేషు అయిష్టంగా తల అడ్డంగాత్రిప్పి, "వొద్దు పెద్దమ్మ, వొద్దు. వరండాలోని నలుగురైదుగురు అతిథులు నిజానికి నాకు అంత ఆత్మీయులు కాకపోయినా, ఆత్మబంధువులకంటే ఎక్కువ ఆదరణ, అభిమానాన్ని నా పట్ల చూపుతున్నారు అన్నాడు రమేషు. ఇంకా ఏదో చెప్పాలని అతని మనసులో వున్నప్పటికీ, యీక్షణాన విశ్వేశ్వరిముఖం చూసేసరికి యికనేమీ చెప్పలేకపోయాడు. అకాలసంధ్యాసమయంలాగా ఆమె ముఖం మరింత నల్లబడిపోయింది. మరి కాస్సేప

టికి ఆమె దీర్ఘంగా నిట్టూర్చి, "సరే నాయనా నీ యిష్టం! నే వెడుతున్నాను. అసలు నీకు వెళ్ళడమే యిష్టంలేనప్పుడు యింకా ఆలోచనయా లెందుకు? సరే, ఏమైనా కానియ్, కాని దిగులుపడకు! ఏదో విధంగా గడిచిపోతుందనుకో! మళ్ళీ నేను తెల్లవారుజామునే వస్తాను" అన్నది విశ్వేశ్వరి.

ఆ తరువాత పనిమనిషిని వెంటబెట్టుకొని, దొడ్డిదారినే వెళ్ళిపోయింది. అట్లా వెళ్తున్న సమయంలోనే రమేషు యింతఃపూర్వమే వేణీదగ్గరకు వెళ్ళివుంటాడని ఏదో కొంత జరిగివుంటుందని ఆమె అర్థంచేసుకున్నది, పెద్దమ్మ వెళ్ళిన వైపే ఆమె కనిపించినంతసేపూచూసి, విచారవదనంతో రమేషు బయటి వరండాలోనికి వచ్చాడు. రమేషును చూడ్డం తోనే "బాబూ పెద్దమ్మగారు వొచ్చారుగదూ?" అనడి గాడు గోవిందగంగూలీ.

రమేషు తలత్రిప్పి "ఔ" నన్నట్లు సమాధానం చెప్పాడు.

"భండారగృహానికి తాళంవేసి, తాళంచెవికూడా ఆమె పట్టుకుపోయిందిగదూ?" అనడిగాడు గోవిందుడు.

ఆ మాటకుకూడా రమేషు తలూపుతూనే సమాధానం చెప్పాడు. కాని, ఆమె అట్లా ఎందుకుచేసిందో మాత్రం ఆ సంగతి రమేషుక్కూడా అర్థంకాలేదు

"చూశావా ధర్మాభాయ్! నే మొదటే చెప్పాను. రమేషుబాబూ, యిప్పుడైనా నీకు అర్థమైందా?" అన్నాడు గోవిందుడు.

రమేషు లోలోపలే కృంగిపోయాడు. తన అసహాయ

త్వానికి తానే బలై పోయాడు. దరిద్రుడైన దీనూబాబు యింకా వెళ్ళనైనా లేదు. దరిద్రం వున్న తెలివినికూడా పోగొట్టిందేమో తెలియదు. ఎవరిదయవల్లనైతే యిప్పటి వరకూ పిల్లాజెల్లా అందరూ కడుపునిండా యింత మిటాయి తిన్నారో వాళ్ళనూ, వాళ్ళ పితామహుల్ని ఆశీర్వదించ కుండా అతనుమాత్రం ఎట్లా వెడతాడు? అంచేత రమేషు నుద్దేశించి, పెద్దమ్మగారు అట్లా చేసిందంటే, ఆమె అభి ప్రాయం మరేమీకాదు; ఆ తాళాలు మరొకరికీ అందకూడ దనే ఐవుంటుంది. ఆమెకు అన్నీ తెలుసు!" అన్నాడు దీనూ బాబు.

గోవిందునికి వొళ్ళుమండినంత కోపం వొచ్చింది. దీనూ నుద్దేశించి "అసలు నీకు ఏమీ తెలియదు. చెబితే వినవు, నీకు తోచదు. అటువంటప్పుడు ఎందుకు అనవసరపు మాటలు మాట్లాడుతావు" అన్నాడు గోవిందుడు.

గోవిందుని విశలింపుతో దీనూబాబుకు మరెంత తెలివి ఎక్కువై అతనుకూడా కాస్త వేడివేడిగానే సమాధానం చెప్పాడు. గోవిందు నుద్దేశించి "అరే యిందులో తెలియని దేముందయ్యా! పెద్దమ్మగారు స్వయంగా వచ్చింది. భండార గృహం తాళాలు బొడ్లోపెట్టుకు వెళ్ళిపోయింది. ఇందులో అర్థంకాని దేముందీ?" అన్నాడు దీనూబాబు.

గోవిందుని కింకా కోపం తగ్గలేదేమో, అతన్నుద్దేశించి "మహాశయా! నీ కర్థంకాదుగానీ, నా మాటవిని యిహ ఈ పూటకు యింటికి దయచెయ్యరాదూ! పిల్లాజెల్లాతో సహా కడుపునిండా యింత మిఠాయి తింటివిగద! అంతగా ఐతే

"ఫిరామోహన్" శేపుతిందువుగాని, యిక్కడ మాకు యింకా చాలాపనులున్నయ్" అన్నాడు గోవిందుడు. ఈ మాటతో దీనూమహాశయుడు సిగ్గుతో తలవంచుకున్నాడు. కాని రమేష్‌కుమాత్రం గోవిందుని మాటలతీరు ఏమీ నచ్చ లేదు. పైకి సిగ్గుతో తలవంచుకున్నా, లోలోపల కోపంతో మండిపోతున్నాడు. గోవిందు నుద్దేశించి, "గంగూలీ మహా శయా! ఎందుకు మీరు అనవసరంగా ప్రయాసపడి యితరు లను అవమానిస్తారు?" అన్నాడు కాస్త కటువుగానే. గోవిం దుడు అర్థంచేసుకున్నాడు. ముఖం తెల్లబడిపోతున్నా, లేని నవ్వు తెచ్చుకుని "అరె! నేను ఎవరినైనా ఎందుకు అవమా నిస్తాను రమేష్‌బాబూ! పోనీ ఆయన్నే అడిగిచూడండి. మేమేం పరాయివాళ్ళమా; ఆయన కొమ్మలాంటివాడు మేము ఆకులాంటివాళ్ళం! చూశావా ధర్మాభాయ్, దీనూబ్రాహ్మడి పెంకెతనం! సరే పోనీ..."

ధర్మదాసు ఏంచూశాడో, ఆసంగతి అతనికే తెలి యాలిగానీ, గోవిందుని సిగ్గుమాలినతనానికి మాత్రం రమేష్ అప్రతిభుడై పోయాడు. దీనూబాబు రమేష్ నుద్దేశించి "అవును నాయనా; అవును. గోవిందుడు నిజమే చెబు తున్నాడు. నేను నిజంగా పేదవాణ్నే. ఆ సంగతి అందరికీ తెలుసు. వీళ్ళలాగా నేనేమీ ఆస్తిపరుణ్నేమీ కాదు. తకిలీ వాడుకుంటూ భిక్షాటనచేస్తూ ఎన్నో అవస్థలు పడుతుం టేనేగాని బ్రతుకు తెల్లవారటంలేదు. నా బిడ్డలను ఏ కొంచె మైన మంచితిండి కొనిపెట్టే శక్తిసామర్థ్యాలు భగవంతుడు నాకివ్వలేదు. అంచేతనే గొప్పవాళ్ళ యిళ్ళల్లో ఏదైనా కథా

కార్యాలంటూ జరిగితే-అక్కడికీ పిల్లా జెల్లాతో వెళ్ళి కాస్త కడుపునింపుకునేమాట నిజమే! ఎందుకునాయనా నువ్వు మధనపడతావు! తారిణీబాబు బ్రతికినంతకాలం మమ్మల్ని ఎంతో దయగానూ, అభిమానంతోనూ చూశేవాడు; కడుపు నిండా యింత తిండిపెట్టి తృప్తిపరచేవాడు. అట్లాగే యివాళ కూడా నీ దయవల్ల సంతృప్తిగానే తిన్నాము. పరలోకంలోని నీ తండ్రి నిజంగా సంతోషిస్తాడు నాయనా!" అన్నాడు దీనూబాబు. అకస్మాత్తుగా ఆయన కళ్ళనుండి రెండు అశ్రు బిందువులు నెమ్మదిగా జారిపడినయ్. ఈ సంగతి అక్కడున్న వాళ్ళంతా గమనించారు. రమేష్ చూడలేక సిగ్గుతో ముఖం ప్రక్కకు త్రిప్పుకున్నాడు దీనూబాబు వందలాది కుట్లుతో నిండి మాసిపోయిన తన అంగవస్త్రంతో కళ్ళు తుడుచు కుంటూ "నాయనా యివాళ నేనూ నా పిల్లలేకాదు; పర లోకంలోని నీ తండ్రికూడా నిజంగా తృప్తిపడతాడు. యిది నిజం! అంతేకాదు నాయనా; ఈ ప్రాంతంలో నాలాంటి దుఃఖితులు, దౌర్భాగ్యులూ అందరూకూడా తారిణీబాబుకు కృతజ్ఞులే నాయనా! కాని యీసంగతి ఎంతమందికి తెలుసు? కుడిచేత్తో ఆయన దానంచేస్తే ఆసంగతి ఎడమచేతికే తెలి యదు...అదీ నాయనా వున్న సంగతి. ఇహ నీకు కష్టం కలి గించను ... లేమ్మాలే ... నాయనా హరిధన్, లే బాబూ! వెళదాం పదండి. ఇంకేంచెప్పను నాయనా రమేష్. వీలుంటే మళ్ళీ రేపు కన్పిస్తాను. చిరకాలం జీవించి; తండ్రిలాగే కీర్తి వంతుడివికావాలని ఆశీర్వదిస్తున్నాను నాయనా!" అన్నాడు దీనూబాబు.

రమేష్ కొంతదూరం ఆయనను సాగనంపుతూ నడిచాడు. నాలుగడుగులు నడిచిన తరువాత "దీనూ మహాశయా! కాస్త ఈనాలుగైదు రోజులు నాయందు దయకలిగి వుంటారనే ఆశిస్తున్నాను. మీతోపాటే ఈపిల్లల మాతృమూర్తి కూడా కాస్త మాయింట్లో పాదంపెట్టినట్లయితే, నాకు చాలా సంతోషం కలిగివుండేది." అన్నాడు రమేష్,

దీనూబాబు మనస్సు ద్రవించిపోయింది. ఆయన తన రెండు చేతుల్తోనూ రమేష్ చేతులు పట్టుకుని, గద్గదస్వరంతో "నాపరిస్థితి ఏమీ బాగాలేదు నాయనా. ఏమీ బాగాలేదు. నేను చాలా పేదవాణ్ణి. ఇందువల్ల నాజీవితమంతా దుఃఖమయంగానే వుండిపోయింది. మరింత అభిమానంతో ఆదరించి నన్నెందుకు లజ్జపరుస్తావు!" అన్నాడు.

ఆ తరువాత తన పిల్లల్ని వెంటబెట్టుకుని, వృద్ధుడు రమేష్ దగ్గర శెలవు తీసుకుని వెళ్ళిపోయాడు.

రమేష్ వెనక్కు తిరిగివచ్చాడు. అట్లా వొస్తూవొస్తూ ఒక్కక్షణం ఆలోచించాడు. అసలు గోవిందగంగూలీ, దీనూ మహాశయుణ్ని ఎందుకంత కఠినంగా మాట్లాడాడో అతనికి అర్థంకాలేదు. అంతలోనే గోవిందగంగూలీ కాస్త పరుషంగానే మాట్లాడుతూ "ఇది మా స్వంతవ్యవహారంలాంటిది నాయనా రమేష్! నువ్వు గౌరవంగా పిలిచినా పిలవకపోయినా, మేము రాకనూతప్పదు; వచ్చి యీ పనులు పూర్తిచెయ్యకనూ తప్పదు. అందుకే నేనూ, ధర్మదాసు కూడా నువ్వు ఆహ్వానించావా లేదా అనేసంగతి పట్టించుకోకుండానే మేము వచ్చాం" అని అంటున్నాడు.

ధర్మదాసు హుక్కా పీల్చి యింకా దగ్గుతూనేవున్నాడు చేతికర్ర ఆధారంతో నిలబడి [ఆయన ముఖమంతా దగ్గు మూలంగా ఎర్రబడివుంది] చేతులూపుతూ "మేము వేణీ ఘోషాల్‌లాంటివాళ్ళం గాదు నాయనా, మాకు యీ యింటితో జన్మాంతర సంబంధాలున్నయ్" అన్నాడు.

అసందర్భమైన యీ ప్రసంగంతో రమేష్‌కు కాస్త చికాకు కలిగింది ఐనా తనను తాను నిగ్రహించుకున్నాడు. ఈ కాస్త వ్యవధిలోనూ, వీళ్ళదర్శి ఎంతో చక్కగా అర్థం చేసుకున్నాడు. వీళ్ళు తమ అజ్ఞానంకొద్దీ నిస్సంకోచంగా చెప్పగూడనిది చెప్తారు, చెయ్యగూడనిది చేస్తారు. చిత్రమేమిటంటే అసలు యీసంగతి వాళ్ళకే తెలియదు.

పెద్దమ్మ ఆదరపూర్వకమైన ఆహ్వానము, చివరకు ఆమె ముఖంలోని విషాదచ్ఛాయలు రమేష్ యింకా మర్చిపోలేదు. ఏమైనాసరే ఒకసారి అన్నయ్యదగ్గరకు వెళ్ళివద్దామనే నిశ్చయించుకున్నాడు.

రమేషు చండీమండపందగ్గరకు వచ్చాడు. రాత్రి సుమారు తొమ్మిదిగంటలై వుంటుంది. లోపల ఏదో తగాదా జరుగుతున్నట్టుగావుంది. మిగతావారికంటే గోవిందగంగూలీ గొంతే స్పష్టంగా వినిపిస్తున్నది. గోవిందుడే మరింత గట్టిగా పందెంకాస్తున్నవాడి ధోరణిలో మాట్లాడుతూ "రెండు మూడు రోజుల్లోనే వాడు సర్వభ్రష్టుడు కాకపోతే నాపేరు గోవిందుగంగూలీయేకాదు వేణీబాబూ! నవాబుల దర్బా సంగతి నీకు తెలియనిది కాదుగా? తారిణీఘోషాల్ చస్తూ చస్తూ చిల్లిగవ్వయినా విడిచిపెట్టి పోలేదుకదా, యింత అడం

బరాలెందుకు చెప్పు! చేతిలో డబ్బుంటే చేసుకోవచ్చుగానీ, సిరాస్తులు తాకట్టు పెట్టుకుని శ్రాద్ధాలు ఘనంగా చేసుకునే వాణ్ణి నేనెక్కడా చూళ్ళేదు! వేణీమాధవ్ బాబూ! ఉన్న మాట నేచెబుతున్నా విను; ఈ కుర్రసన్యాసి షావుకారు నందుడి దగ్గర కనీసం మూడువేలైనా అప్పు పుచ్చుకుని వుంటాడు." అన్నాడు.

వేణీ మరింత ఉత్సాహంతో, "అయితే అసలు విషయం పసిగట్టావన్నమాట!" అన్నాడు.

ఓపికపట్టు నాయనా, ఓపికపట్టు! అప్పుడే ఏమైందీ! ఒకసారి బిడ్డ 'ఉచ్చు'లో పడాలేకాని ... అరే, ఎవరా బయట నిలబడింది? ఓహో, రమేష్ బాబూ! ఇంత రాత్రివేళ వచ్చావేమిటి బాబూ! ఏపనికైనా మేం ఉండనే వుంటిమి గదా, నీకెందుకూ శ్రమా ?

ఈ మాటలను రమేషు లక్ష్యపెట్టలేదు. మరింత ముందుకువచ్చి వేణీ నుద్దేశించి, "అన్నయ్యా, నేను మీ కోసమే వచ్చాను." అన్నాడు రమేష్.

వేణీ సందిగ్ధంలో పడిపోయాడు. ఏంచెప్పడానికీ మాట్లాడానికీ అతనికి నోరు పెగల్లేదు. ఇంతలో గోవిందుడే జోక్యం కల్పించుకుని, వస్తావు నాయనా వస్తావు! అవసర మన్నపుడు వందసార్లయినా రావాలి. అదీగాక యిది నీకేమైనా పరాయిచోటు గనుకనా ? అన్న అంటే తండ్రితో సమానం! అందుకే ఇంత రాత్రి అయినా వేణీ బాబుకు నచ్చచెప్పేందుకే మేమంతా పనిగట్టుకుని యిప్పటిదాకా కూర్చున్నాం. వేణీబాబూ, మీ బాబాయితో ఏంతగాదాలు

జరిగాయో జరిగినయ్. గతం గతః ! ఇంకా ఆ ద్వేషాలను ఎందుకు పెంచుకోవడం ! ఇప్పుడైనా మీ ఉభయసోదరులూ ఐకమత్యంతో మెలిగితే, మీకు సుఖంగా వుంటుంది: మా మనసుకూ ప్రశాంతత లభిస్తుంది. అరే ఎవర్రా అక్కడ ? రమేష్‌బాబు కూర్చునేందుకు చాపగానీ, తివాసీగాని వెయ్యరేమర్రా ! ... కాదులే వేణీబాబూ, నామాట కాదనకు! మీఅమ్మ (పెద్దమ్మ) స్వయంగా. వంటయింటి వ్యవహారాలు చూస్తూన్నప్పుడు యిక నువ్వు తటస్థంగా వుండటం ఏంబావుంటుంది?"

"ఏమిటీ, అమ్మ వెళ్ళిందా ?" అన్నాడు వేణీబాబు ఆశ్చర్యంగా.

వేణీ ఎందుకింత ఆశ్చర్యపడ్డాడో ఆ సంగతి గోవిందుడు బాగానే అర్థంచేసుకుని లోలోపలే సంతోషించాడు కాని ఆ సంతోషాన్ని పైకి కనబడనీయకుండా సహజధోరణిలోనే పెద్దమనిషిలాగా గంభీరంగా "ఆమె కల్పించుకోకపోతే, మహాయజ్ఞంలాంటి తాండ్రీశ్రాద్ధం నెరవేరుతుందనే అనుకుంటున్నావా ?" అని అన్నాడు.

ఈ మాటకు ఎవరూ సమాధానం చెప్పలేదు.

మరో క్షణంతర్వాత గోవిందుడే ప్రారంభించి "నాకు తెలిసినంతలో ఆమెలాంటిమనిషి మరొకరెవరూ యీ గ్రామంలో లేనే లేరు! వేణీబాబూ, నన్ను మూర్ఖుడిగా భావించకు. మీ అమ్మ నిజంగా గ్రామలక్ష్మిలాంటిది! ఓహ్, నిజంగా నాకు అలాంటితల్లే లభిస్తేనా...!" అన్నాడు గోవిందుడు పరవశత్వాన్ని ప్రదర్శిస్తూ.

గోవిందుడు దీర్ఘంగా నిట్టూర్చి వూరుకున్నాడు. మరో క్షణంతర్వాత వేణీ అస్పష్టంగానే "అలాగా!" అని వూరుకున్నాడు. గోవిందుడు ఆ మాట అందకని "అలాగా అని వూరుకున్నంతమాత్రాన అన్నిపనులూ జరగవు వేణీ బాబూ! వెళ్ళాలి; వెళ్ళి ఆ కార్యభారమంతా భరించాలి! శుభస్య శీఘ్రం! సరే, అందరం యిక్కడే వున్నాంగద! ముందుగా ఒక అంచనా ఎందుకు తయారు చేసుకోకూడదు! ఎంతమంది బ్రాహ్మణుల్ని పిలవాలో, ఎట్లా పిలవాలో, రొఖ్ఖం ఎంతకావాలో, ఏమేం సామాగ్రి కావాలో, అంతా లెక్కవేసి చూసుకోకూడదా! ఏం రమేశ్ బాబూ చెప్పవేం? ధర్మాభాయ్, ఏం నువ్వు మాట్లాడవేం?" అన్నాడు గోవిందుడు.

రమేశ్ తన సహజధోరణిలోనే "అన్నయ్యా మీరు నాయందు దయయుంచి ఒక్కసారి యింటికొస్తేనేగానీ..."

వేణీ గంభీరంగానే "అమ్మ వొచ్చిందిగా, యింకేం? ఏం బాబాయ్ అంతేనా?" అన్నాడు.

రమేశ్ గోవిందుడు మాట్లాడే అవకాశం యివ్వలేదు. "నేనేమీ బలవంతంగా యిబ్బంది పెట్టడంలే దన్నయ్యా. మీకు అభ్యంతరం లేకపోతే. మీరు స్వయంగా ఒకసారి అక్కచూసి చెబితే బావుంటుందని అనుకుంటున్నాను" అన్నాడు రమేశ్.

వేణీ ఏమాటా చెప్పనేలేదు. గోవిందుడు ఏం చెప్పేవాడోగానీ, మధ్యలోనే రమేశ్ లేచిబయటికి వెళ్ళిపోయాడు. అతను వెళ్ళినంతదూరం గోవిందుడు మెడ సాగదీసుకుంటూ

చూసి, రమేష్ బాగా దూరం వెళ్ళిపోయిన తరువాత "చూశావా వేణీబాబూ! ఆహ్వానించే విధానం!" అన్నాడు వ్యంగ్యంగా.

వేణీ ఏం ఆలోచిస్తున్నాడో, పరధ్యానంగా వుండి ఆ మాటకు సమాధానం చెప్పలేదు.

రమేషు అక్కణ్ణుంచి బయల్దేరిన తరువాత గోవిందుని మాటలవల్ల అతని మనసంతా అసహ్యంతో నిండిపోయింది. అతను అడ్డుదారినే తిరిగి వేణీఘోషాల్ యింటికి వచ్చాడు.

ఆ సమయంలో చండీమండపంవద్దర వాళ్ళందరూ యింకా ఏమేమి ఆలోచనలతో సతమతమౌతున్నారోగానీ; ఆ విషయాలు అజ్ఞాతంగా విందామన్న ఆసక్తి అసలు కలుగనేలేదు. అతను తిన్నగా యింట్లోకివెళ్ళి "పెద్దమ్మా, పెద్దమ్మా, నిద్రపోతున్నావా?" అని బిగ్గరగానే పిలిచాడు.

పెద్దమ్మ ఆ సమయంలో చీకటివరండాలో నిశ్శబ్దంగానే కూర్చునివుంది. ఇలాంటి సమయంలో రమేషు పిలుపు విని గుర్తించి రవ్వంతఆశ్చర్యపడుతూ "ఎవరూ, రమేషేనా?" అంది.

రమేశ్ మరింత దగ్గరగా వచ్చాడు. పెద్దమ్మ గాభరా పడుతూ,

"వుండు నాయనా వుండు. దీపం తెప్పిస్తాను" అన్నది

"వొద్దుపెద్దమ్మా దీపం వొద్దు; నువ్వు లేవకు" అని యీ చివరగా కూర్చున్నాడు.

"ఏమిటినాయనా యింత రాత్రివేళ వచ్చావు; ఏమైనా ముఖ్యమైన పనా?" అనడగింది ఆదుర్దాగా.

రమేష నెమ్మదిగానే ఆమె నుద్దేశించి "ఏంలేదు పెద్దమ్మా! యిప్పటికీ బ్రాహ్మణులకొ్కానీ యిరుగుపొరుగు వారికిగానీ ఆహ్వానాలు పంపనేలేదు. ఆ సంగతే నిన్ను అడుగుదామని వొచ్చాను" అన్నాడు.

"పెద్దచిక్కే తెచ్చిపెట్టావు నాయనా; సరేగానీ ధర్మదాసు చటర్జీ, గోవిందగంగూలీ వాళ్ళున్నారుగదా; ఏమంటున్నారు ?" అనడిగింది.

రమేశ్ మధ్యలోనే అందుకుని "వాళ్ళసంగతి వొదిలేయ్ పెద్దమ్మా! వాళ్ళు ఏం చెప్పినా చెప్పకపోయినా; ఆ విషయాలు నేను వినదలుచుకోలేను. నువ్వు ఏం చెబుతావూ ఆవిధంగానే చేద్దామన్న వుద్దేశంతో నీదగ్గర కొచ్చాను" అన్నాడు,

రమేషుమాటల్లో విసుగునూ, భావోద్రేకాన్నీ విశ్వేశ్వరి పసిగట్టి ఆశ్చర్యపడింది. ఒక్కక్షణం నిశ్శబ్దంగా వుండి "నాయనా ఆవేళ నువ్వేకదా; అందరికంటే వాళ్ళే నాకు పరమ పూజ్యులనీ ఆత్మీయులని అన్నావు! సరే పోనీయ్; ఎంతైనా మేం ఆడవాళ్ళంకదా!... మాం చేతిలో ఏముందీ? ఇహ యీ ఊరిసంగతి అంటావా, చాలా విచిత్రం. ఈ ఊరే కాదు; ప్రపంచమే అలావుంది. పోనీ ఏదో ఒక గ్రామంలో పరిస్థితు లిట్లా వున్నాయంటే దానికేదో కారణం వుందనుకోవచ్చు. కాని నాకు తెలిసినంతవరకూ యీనాటి అన్ని గ్రామాల్లోనూ పరిస్థితులు యిట్లాగే పరమ అధ్వాన్నంగా తయారైనయ్! ఒకడు మరొకడితో సహకరించడు; వాడి పంక్తిన వీడు భోజనంచెయ్యడు, వీడిపంక్తిన వాడుకూడా

అంతే! ఏవైనా కథాకార్యాలంటూ జరిగేటప్పుడు జరిగే కుతంత్రాలు యిహ చెప్పనేఅక్కర్లేదు. ఈర్ష్యా, అసూయలనే రాక్షసకన్యలు నగ్ననృత్యం చేస్తాయంటే నమ్మా! గ్రామాల్లో అన్నిటికంటె క్లిష్టమైనసమస్య ఏమిటంటే; ఎవర్ని పిలవాలో ఎవర్ని పిలవకూడదో నిర్ణయించడం! ఆ నిర్ణయం చెయ్యగలిగితే ఓ ఘనకార్యం చేసినట్టే! నిజంచెప్పాలంటే; యిలాంటి విషయాల్లో ఎవరిమాట వినాలో, ఎవరి మాట వినకూడదో, ఎవడికి చెప్పాలో, ఎవడికి చెప్పకూడదో కూడా అర్థంకాదు!"

ఈ సంగతులన్నీ విన్నతరువాత రమేశ్‌కు ఏమంత ఆశ్చర్యం కలగలేదు. ఎంచేతనంటే, అతను యీ గ్రామంలో అడుగుపెట్టిన వారం పదిరోజుల్లోనూ, యీవిధమైన కొన్ని అనుభవాలను చవిచూశాడు. ఐనప్పటికీ ఆమె నుద్దేశించి, "మరి యివన్నీ యిట్లా ఎందుకు జరుగుతున్నయ్ పెద్దమ్మా?" అని అడిగాడు.

మరో క్షణంతర్వాత "గ్రామాల్లో కొంతకాలం నివసిస్తే యీ పరిస్థితులు యిట్లా ఎందు కేర్పడుతున్నాయో, నీకే అర్థమౌతుంది. ఒకని ద్వేషమూ, అభియోగమూ ఒక పక్షంగాచూస్తే సహజమనిపిస్తుంది. దాన్నే పరోక్షంగా ఆలోచిస్తే-శుద్ధఅబద్ధమని తేలిపోతుంది! ఇహ దావాలూ-కోర్టులు తప్పుడుసాక్ష్యాలు, స్వార్థప్రయోజనపు ఆలోచనలకు యింక అంతేలేదు! స్వార్థాలు, కుట్రలు, మోసాలతో యీనాటి గ్రామీణసమాజం కుళ్ళి కుమిలిపోతున్నది. దీన్ని సంస్కరించే 'నాథులు' సంస్కరింపబడేరోజు ఏనాడొస్తుందో మనం

వూహించలేం! కాని ఒకటి రెండురోజులు ముందుగానే నేను మీాయింటికి రావడం జరిగినట్లయితే, యింత దండగమారి ఖర్చు, అనవసరపు ఆర్భాటాలూ లేకుండా చూసేదాన్ని! కాని యిప్పుడేం చేసేది? ఇప్పుడే పరిస్థితి యిట్లావుందిగదా; యిక శ్రాద్ధపురోజున ఏంజరుగుతుందో చెప్పలేం" అన్నది విశ్వేశ్వరి.

ఆమాట చెప్పి విశ్వేశ్వరి దీర్ఘంగా నిట్టూర్చింది. కాని ఆ నిట్టూర్పులోని అంతరార్థం ఏమిటో రమేశ్ గుర్తించలేక పోయాడు. ఆమె మాటల్లోని 'నిజానిజాల'యొక్క అంతరార్థం ఏమిటోకూడా అతనికి అర్థంకాలేదు అంచేత ఆమె నుద్దే శించి "అదికాదు పెద్దమ్మా! ఈ స్వార్థాలూ, కుట్రలూ, ద్వేషాలూ నిజమే కావచ్చుగానీ; వీటన్నిటితో నాకేమిటి సంబంధం? నేను ఒకవిధంగా పరదేశిలాంటివాణ్ని! రేపో మాపో వెళ్ళిపోయేవాణ్ణి! అలాంటప్పుడు ఎవరికైనా ఏవిధ మైన యీర్ష్యాద్వేషాలు నామీాద ఎందుకుంటాయి? అసం భవం! అంచేత నా అభిప్రాయం ఏమిటంటే, బ్రాహ్మణు లందరితోపాటు శూద్రులనుకూడా ఆహ్వానిస్తాను, కాని యీ పని చేసేముందు నీ "అనుమతి"మాత్రం కావాలి" అన్నాడు రమేశ్.

విశ్వేశ్వరి ఒక్కక్షణం మౌనంగావుండి "నాయనా రమేషు! ఈ విధమైన 'అనుమతి'మాత్రం నే నివ్వలేను నాయనా! అది నావల్ల కాదు. దానివల్ల చాలా అనర్థా లొస్తాయి...కాని నీ అభిప్రాయం సరైనదే. కాదనను... కాని సమాజం ఎవరినైతే 'బహిష్కరించిందో' వాళ్ళను ఒక్క

సారి అకస్మాత్తుగా మనం ఈ సమాజంలోనికి తీసుకురాలేం. ఒకవేళ మూర్ఖంగా మనం ఆపని చేసినా, దానివల్ల ఏవిధమైన ప్రయోజనమూ లేకపోగా, నామమాత్రంగా మిగిలిన యీ శిష్టసమాజంకూడా మనకు దక్కకుండానే పోతుంది. ఆ తర్వాత మనం ఎందుకూ కాకుండాపోతాం; అటుపైన ఎంత పశ్చాత్తాపపడి ప్రయోజనంలేదు!" అన్నది విశ్వేశ్వరి.

రమేశ్ ఏమాత్రమైనా దూరదృష్టికలవాడైనట్లయితే విశ్వేశ్వరికి తిరిగి యీవిధంగా జవాబు చెప్పివుండేవాడుకాదు ఇంతకుముందు విశ్వేశ్వరి ఎవరినైతే సమాజంలో ముఖ్య వ్యక్తులుగా పేర్కొన్నదో, వాళ్ళతాలూకు అసహ్యకరమైన కుట్రలు రమేశ్ మనసులో యింకా తారట్లాడుతూనే వున్నయ్. అవి జ్ఞాపకం రావడంతోనే అతనిమనస్సు మరింత అసహ్యంతో కంపించిపోయింది. ఐనా తననుతాను సంబాళించుకుని "ఏమిటి పెద్దమ్మా నువ్వనేది? ఏది విశిష్ట సమాజం? ఈ ధర్మదాసూ, ఈ గోవిందుడేనా ఈ గ్రామీణ సమాజం అంటే? ఇలాంటి సమాజం స్థిరంగా వుంటేనేం; శాశ్వతంగా అంతరించిపోతేమాత్రమేం? ఏం పెద్దమ్మా మాట్లాడవేం?" అన్నాడు రమేషు.

రమేషు మనసులోని ఆవేదన ఏమిటో విశ్వేశ్వరి గ్రహించింది. శాంతంగానే "కాదు నాయనా, వాళ్ళుకాదు. మీ అన్నయ్యకూడా ఆ సమాజంలో ఒక ముఖ్యుడే" అన్నది.

రమేశ్ మాట్లాడలేదు. మరోక్షణం తర్వాత నేననేది కేవలం ఈ ధర్మదాసూ, ఈ గోవిందునిగురించే

కాదునాయనా; ఇలాంటివాళ్ళుయింటింటా వున్నారు. అందుకే వాళ్ళను సంప్రదించి, వాళ్ళ సలహాప్రకారమే చెయ్యమంటు న్నాను. అప్పుడే ఏమైందిగనుకా? ఇప్పటికప్పుడే వీళ్ళకు వ్యతిరేకంగా వ్యవహరించడం మొదలుపెడితే-ముందు ముందు చాలా చిక్కులొస్తాయి !" అన్నది విశ్వేశ్వరి.

విశ్వేశ్వరి యీ మాటలు ఎంత దూరదృష్టితో చెప్పిందో; ఆసంగతి రమేష్ అర్థంచేసుకోలేకపోయాడు. మరింత వుద్రేకంతోనే "పెద్దమ్మా! అనేక కారణాలవల్ల యిలాంటి కుట్రలూ, ఆలోచనలూ జరుగుతుంటాయని నువ్వే చెప్పావు; ఆసంగతి నాకు తెలుసు. ఇందులో చాలాభాగం వ్యక్తిగత ద్వేషాలే ప్రధానంగా వుంటాయనికూడా చెబు తూనేవున్నావు. కాని నే ననే దేమిటంటే అసలు ఏది నిజమో అబద్ధమో; అనే ఆలోచనలతోనే నిమిత్తంలేకుండా వ్యవహరిస్తున్న నాకు, యిందులో చిక్కులు ఎందుకు ఏర్పడ తాయంటావు? ఈ సమాజంలో మంచిచెడ్డల తారతమ్యాన్ని గురించి అసలు నేను ఆలోచించనప్పుడు, యీసమయంలో ఒకరిని పిలిచి, మరొకరిని ఆహ్వానించకపోవడం నే నెట్లా చేసేది? అది కేవలం అన్యాయంకదా ?" అనడిగాడు రమేష్.

పెద్దమ్మ చిన్నగా నవ్వి "హరి నీ అసాధ్యంకూలా, నేను నీకు తల్లిలాంటిదాన్ని; పొరుగుదాన్ని! నామాట వినక పోవడంమాత్రం న్యాయమా ?" అనడిగింది.

"మరి నేనేంచేసేది పెద్దమ్మా! అందర్నీ ఆహ్వానించా లనే నిర్ణయించుకున్నాను" అన్నాడు రమేష్.

రమేష్ ధృఢ సంకల్పంతో చెబుతున్న మాటలువిని విశ్వేశ్వరికి కొంచెం కష్టంకలిగింది. అంచేత మరోక్షణంఆగి, "అల్లా నిర్ణయించుకోవడం జరిగిపోయినతర్వాత యిప్పుడు నా అనుమతికోరడం, కేవలం మోసంకదా ?" అన్నది.

పెద్దమ్మ మనస్సులోని కష్టమేమిటో రమేష్ గుర్తించాడు. ఐనా తన నిర్ణయాన్ని ఏమాత్రం మార్చుకోకుండానే శాంతస్వరంతో "నా అభిప్రాయాన్ని మన్నించి, యీ కార్యంలో నువ్వు సహకరిస్తావని, ఆవిధంగా ఆశీర్వదిస్తావనీ ఆశించాను పెద్దమ్మా !" అన్నాడు రమేష్.

మాట మధ్యలోనే విశ్వేశ్వరి అందుకుని "తన కన్న బిడ్డ అభిప్రాయానికి వ్యతిరేకంగా ఏ తల్లిఐనా ఎట్లా వ్యవహరిస్తుందా అనే సంగతికూడా నువ్వు మొదటే ఆలోచిస్తే చాలా బావుండేది !" అన్నది.

ఈ మాటతో రమేష్‌కు బాగానే కష్టం కలిగింది. ఎంచేతనంటే నిన్నటినుంచి పెద్దమ్మ ఎన్ని హితోక్తులు చెప్పినా మనసులో తనపై నిజమైన పుత్రవాత్సల్యంతోనే చెబుతున్నదని విశ్వసించాడు. ఆవిధంగానే ఆమెను కన్నతల్లికంటే ఎక్కువ గౌరవంగా భావించడం మొదలుపెట్టాడు. కాని ఆమెచెప్పిన ఆ చివరిమాట విన్నతరువాత; ఆమెకు తన కొడుకుమీదవున్న నిజమైనప్రేమ ఎంత గాఢమైనదో గుర్తించాడు. ఒక్కక్షణం ఆగి దెబ్బతిన్న ఆత్మాభిమానంతో "అవును పెద్దమ్మా, నిన్నటివరకూ అలాగే అనుకున్నాను.

నే ఒంటరిగానైనా యీ పనులు పూర్తిచేసుకోగలననే అనుకున్నాను. ఇంతలో అకస్మాత్తుగా నువ్వు రావడంతో నాకు మరింత నమ్మకమూ అభిమానమూ కలిగింది. కనీసం నీ సహకారంవుంటే-అన్నిపనులూ పూర్తిచేసుకోగల ననుకున్నాను. అందుకే అన్నయ్యనుకూడా పిలవలేను" అన్నాడు.

గాఢమైన ఆ చీకట్లో రమేష్ ముఖంలో ఆక్షణాన క్రమ్మిన విషాదం విశ్వేశ్వరి మనోనేత్రంతో మాత్రం చూడగలిగింది. కాని నోరు తెరచి ఒక్క మాటకూడా చెప్పలేదు. మరికాస్సేపటికి రమేష్ వెళ్ళడానికి ప్రయత్నించినప్పుడు విశ్వేశ్వరి అతన్నుద్దేశించి,

"ఆగునాయనా! భాండారగృహం తాళాలు నాదగ్గరే వున్నయ్, తీసుకెళ్ళు!" అని అన్నది.

ఇంట్లోనుంచి విశ్వేశ్వరి తాళాలు తీసుకొచ్చి రమేష్ పాదాలదగ్గర "ఖంగు"మన్నట్టు పడేసింది. రమేష్ క్షణకాలం నిశ్చేష్టుడై నిలబడి, ఒక్కసారి దీర్ఘంగా నిట్టూర్చి కాళ్ళ దగ్గరపడ్డ తాళాలు తీసుకుని నెమ్మదిగా అక్కణ్ణుంచి వెళ్ళిపోయాడు. ఇంతకుముందు రమేష్ ఎంతో ఆత్మసంతృప్తితో పొంగిపోయాడు. పెద్దమ్మ తనపక్షాన వున్నదని, యిక ఎవరు సహకరించినా సహకరించకపోయినా, తనకేమీ యిబ్బంది లేదనీ ఆశించాడు, కాని ఒక్క రాత్రయినా గడిచీ గడవక ముందే, తనలో తానే "లేరు, నాకెవరూ లేరు. నే ఒంటరి వాణ్ణి! పెద్దమ్మకూడా నన్ను దిక్కులేనివాణ్ణి చేసింది" అనుకుంటూ ముందుకు సాగిపోయాడు.

# 4

శ్రాద్ధకర్మలు (పిండదానం మొదలైనవి) సమాప్త మైనయ్. ఈవేళ చిట్టచివరి సహపంక్తి భోజనాలు. లోపల పంక్తిభోజనాలకోసరం విస్తళ్ళు వరుస్తున్నారు. రమేషు పీట మీదనుంచి లేచి, అతిథి అభ్యాగతులను పరిచయం చేసు కోడానికి ప్రయత్నిస్తున్నాడు. ఇంతలో యింట్లో లోపల ఏదో గందరగోళంగా మాటలు వినిపిస్తున్నయ్. బాణంలా రివ్వున రమేషు లోపలికి వొచ్చాడు. అప్పటికే కొంతమంది చుట్టూ మూగి ఏమిటో విచిత్రంగా చూస్తున్నారు. వంటగది తలు పుకు ఒకవైపున యిరవై ఐదు యిరవైఆరేళ్ళ విధవయువతి సిగ్గుతో తలవంచుకుని నిలబడివుంది. ఆమెకో పాటే మధ్య వయస్కురాలైన మరొకామె నిలబడివుంది. ఆమె ముఖం కోపంతో కందగడ్డలా మారిపోయింది. కళ్ళు చింతనిప్పుల్లా మండుతున్నయ్. పరాణ్ హల్దార్ తో ఆమెకు యిప్పటివరకూ పెద్ద తగాదా జరిగింది. రమేష్‌ను చూట్టంతోనే ఆమె పెద్ద పెట్టున రోదిస్తూ "ఆఁ రానాయనా. నువ్వే చెప్పు! నువ్వు యీ ప్రాంతంలో ఒక జమిందారువేకదా! నిజం నువ్వు చెప్పు. మా కొంపలో ఎవరూ మగదిక్కు లేకపోబట్టేగదా; అస్త మానం మమ్మల్నే వేధించుకు తింటున్నారు. నిజానికి తప్పంతా నాపిల్ల ఒక్కదానిదేనా ?" అనడిగింది ఆమె.

మరో క్షణం తర్వాత గోవిందుని వేలితో చూపిస్తూ "ఆయన్నే అడగండి; ముఖ్జీగారియింట్లో మహాలక్ష్మి వ్రతం రోజున స్కూలుపేరుమీద పదిరూపాయలు జరిమానా వసూలుచేశారు. ఊరంతా వుమ్మడిగా అమ్మవారిపూజ చేయించేరోజున రెండు మేకపిల్లల ఖరీదు వసూలుచేశారు! ఎన్నడో జరిగిపోయిన ఒక్క విషయాన్ని పట్టుకుని మమ్మల్ని జన్మంతా వేధించుకుతినడం ఏం న్యాయం?" అని అన్నది.

అసలు ఏం జరిగిందో; దాని కథా కమామీషు ఏమిటో రమేష్‌కు ఏమీ అర్థంకాలేదు. అంతవరకూ కూర్చున్నవాడల్లా గోవిందుడు లేచి ఒక్కసారి రమేషును, మరోసారి ఆ ముసలామెను చూశాడు. అట్లా యిద్దరనూ పరకాయించిచూసి "శాంత అత్తయ్యా! ఇహ ఎటుగూడీ నాపేరు ఎత్తావుగనుక, యిక నే చెబుతున్నా విను. యిదుగో రమేష్ బాబూ నువ్వుకూడా శ్రద్ధగా విను! ముఖ్ప్రీతిమాటలు యీ గోవిందుడు ఎప్పుడూ చెప్పలేదు! ఈ సంగతి వూరంతా తెలుసు. అత్తయ్యా; నీ కూతురుకు ప్రాయశ్చిత్తమూ జరిగింది; జరిమానా వసూలు చెయ్యనూ చేశారు. ఈ రెండూ నిజమే! కాని, దైవమందిరాల్లోకీ, వంటగదుల్లోకి నీ కూతురు కాలుపెట్టడం మా కెవరికీ ఎంతమాత్రం యిష్టంలేదు. నీ కూతురు చచ్చినరోజున ఆ శవాన్నిమాత్రం అట్లా వొదిలెయ్యం! నలుగురం భుజాలుకలిపి ఎలాగోఅలా అంత్యక్రియలుమాత్రం జరిపిస్తాం. కాని అంతవరకూ..."

శాంతఅత్తయ్య అరుస్తూ "నీ కూతురు చస్తే; దాని అంత్యక్రియల సంగతేదో అది నువ్వు ఆలోచించుకో! నా

కూతురుసంగతి నీకెందుకు? నీసంగతేదో నువ్వు ఆఘోరించ రాదూ! అది సరేకానీ నాయనా; లోపల తమలపాకులు చుడుతున్న దే- మీా వదిన-అవిడ భాగోతమేమిటి నాయనా? పద్దెనిమిదేళ్లపాటు అంతూ ఆనవాలూ లేకుండాపోయి వొస్తూ వొస్తూ పుట్టెడు రోగాలతో చావుబ్రతుకులతో కొంప జేరిందే... యీా పద్దెనిమిదేళ్లపాటు ఏ కాశీలో ఏ పుణ్యక్షేత్రాలు సేవిస్తూ గడిపింది నాయనా? కదిలిస్తే డొంకంతా కదులుతుంది నాయనా; గొప్పోళ్ళ కుటుంబాల్లో రకరకాల భాగవతాలు ఎవడికి తెలియనివి? పిల్లల్ని మీారేకాదు, మేమూ పదేసి నెలలపాటు మోసి కన్నవాళ్ళమే! ఎందుకూ కప్పెట్టు కోవడం?'' అంది వుద్రేకంతో.

గోవిందునికి యీా మాటలన్నీ వినేసరికి వొళ్ళు తెలియనంత కోపం వొచ్చింది. పిచ్చివానిలాగా వుద్రేకంతో వూగిపోతూ "ఛీ, ఛీ దరిద్రపు ముండా! నీ నాలిక తెగ్గోస్తా'' అన్నాడు గోవిందుడు.

కాని ఆ దరిద్రపు అత్తయ్య అంతమాత్రానికే ఏమీా జంకలేదు. లేకపోగా, మరింత ముందుకు రెండడులు వేసి "ఏం కొడతావా? కొట్టు చూద్దాం! ఈ బ్రాహ్మణి వొంటి మీాద చెయ్యి పడిందీ అంటే-నిన్నే కాదు! ఈ వూరు మొత్తాన్ని ఏంచేస్తానో చూడు! నా కూతురు ఏయింటికైనా ఎందుకు వెళ్ళకూడదో నేనూ చూస్తాను. కాస్త గుమ్మంలో అట్లా పాదం పెట్టిందో లేదో; పరాణ్ హాల్దార్ మనవడు నా కూతుర్ని అవమానిస్తాడా? వాడెంత, వాడి స్థితి ఎంత? వాడి చెల్లెలు సాలెవానితో జరిపిన ప్రణయో

పాఖ్యానంసంగతి ఎవడికి తెలియదు? ఏం నేనేం నిన్న మొన్నటి చంటిదాన్నా? నాకు తెలియదా ఆ సంగతి? ఏం చెవులు నిండాయా? యింకా ఏమన్నా చెప్పమంటావా" అనడిగింది.

రమేష్ నిశ్చేష్టుడై అలాగే నిలబడిపోయాడు. భైరవా చార్యులు గాభరాగా పరుగెత్తుకొచ్చి శాంత చేతులు పట్టు కుని ప్రార్థిస్తున్న ధోరణిలో "చాలు అమ్మా చాలు. ఇంకేమీ అనకు! ఈ మాటలు వినలేక చెవులు చిల్లులు పడి పోతున్నయ్" అని తరుణివిధవ నుద్దేశించి "లే అమ్మా లే! యిల్లా నా వెంటవచ్చి ఈ గదిలో కూర్చోఅమ్మా!" అన్నాడు.

ప్రరాణ్ హాల్దార్ తన మూటాముల్లె సర్దుకుని లేచి నిల బడ్డాడు. నిప్పులుకక్కుతూ "ఈ కొంపలో యీ దరిద్రపు ముండలు వున్నంతసేపూ, నేను పచ్చి మంచినీళ్ళుకూడా ముట్టను... గోవిందా, కాళీచరణ్! యిక మీ సంగతేదో తేల్చండి. మీరు నా మాటవిని నాతోపాటే వొస్తారో, యిక్కడే కూర్చుంటారో తేల్చి చెప్పండి. వేణీఘోషాల్ నాకు మొదటే చెప్పాడు. "మామయ్యా మీరు వెళ్ళవద్దు" అని. అయినా లక్ష్యపెట్టకుండానే వచ్చాను. వచ్చినందుకు మంచి మర్యాదే జరిగింది. ఇక్కడ యిట్లాంటి ఘరానావేశ్య లుంటారనేసంగతి నాకు ఏమాత్రం తెలిసినా నాజాతి భ్రష్టం కాకుండా ముందే జాగ్రత్తపడేవాణ్ణి! ఈ గుమ్మంలో నా నీడ కూడా పడనిచ్చేవాణ్ణి కాదు... కాళీచరణ్, లే నాయనా లే, పోదాం" అన్నాడు హాల్దార్. మామపిలుపు వినికూడా కాళీ

చరణ్ తలవంచుకుని అట్లాగే కూర్చున్నాడు. అతను గోగు నారతాలూకు వ్యాపారం చేస్తుంటాడు. నాలుగైదు ఏళ్ళక్రితం కలకత్తానుంచి ఒక వ్యాపారస్థుడు అతనిదగ్గరకొచ్చి వెళ్తూ వెళ్తూ అతని విధవ చెల్లెల్నికూడా తీసుకుపోయాడు. కాని ఈసంగతి ఎంతోకాలం దాగలేదు. కొంతకాలం అత్తవారింటికి వెళ్ళిందనీ, మరికొంతకాలం తీర్థయాత్రలు సేవిస్తున్నదనీ గుప్పెట్లో దాచిపెట్టారు. ఆ తరువాత అసలుసంగతి అందరికీ తెలియనే తెలిసింది. అంచేత యిప్పుడు తనుకూడా తన మామతో లేచినిలబడితే; యీ సంగతికాస్తా నలుగుర్లో తానూ "కడిగించు"కోవలసి వస్తుందేమోనని అతని భయం. కాని దానివల్ల ఏమిటీ లాభం? గోవిందునిమంట యింకా చల్లారలేదేమో యింకా కోపంగానే "ఎవరెన్ని వాక్కులంటే మాత్రం నాకేమిటి? వేణీఘోషాల్, ప్రరాణ్ హాల్దార్ జాదూ ముఖర్జీగారి అమ్మాయి; వీళ్ళే ఈ ప్రాంతానికి పెద్దలు! వీళ్లు చెప్పిందే, ధర్మం! వాళ్ళమాటను మనం ధిక్కరించకూడదు" అని రమేష్ నుద్దేశించి "రమేష్‌బాబూ, సమాజం బహిష్కరించిన ఆ యిద్దర్నీ అసలు నువ్వెందుకు యింట్లోకి రానిచ్చావు? యీ మాటను నువ్వు సరైన సంజాయిషీ చెప్పేంత వరకూ మేము ఎవ్వరమూకూడా యిన్ని నీళ్ళయినా ముట్టుకోము" అన్నాడు గోవిందుడు.

చూస్తూచూస్తుండగానే పది పదిహేనుమంది విస్తళ్ళ ముందునుంచి లేచి నిలబడ్డారు. వాళ్ళంతా యీవూరివాళ్లే! ఇలాంటి కథాకార్యాలు జరిగేప్పుడు ఎలాంటి కుతంత్రాలు పన్నాలో వాళ్ళకు బాగా తెలుసు. ఆహ్వానితులైన బ్రాహ్మ

ణులమధ్యకూడా ఏవో వాదోపవాదాలు ప్రారంభమైనవి. ఎవ్వరూ మరొకడిమాట వినేస్థితిలో లేదు. అంతా గందరగోళం, అయోమయంగా తయారైంది. భైరవాచార్యులు, దీనూభట్టాచార్య, యిద్దరూకూడా ఎంతో ప్రయాసపడి శాంత అత్తయ్యనూ, ఆమె కూతుర్నీ సమాధానపరచేందుకు ప్రయత్నిస్తున్నారు. ఒక స్థితిలో హాల్దార్ కాళ్ళుపట్టుకుని బ్రతిమాలేందుకుకూడా ఒకరిద్దరు ప్రయత్నించారు. కాని ఆయన ససేమిరా వినలేదు. పరిస్థితి అంతకంతకూ చెయిదాటిపోతున్నది. భోజనాలు ఆగిపోవడంతో,- ఎక్కడి వంటలు అక్కడే వుండిపోయినయ్. సర్వం భ్రష్టమయ్యేస్థితి దాపురిస్తున్నది. కాని రమేశ్‌కు మాత్రం నోటివెంట మాట రావడంలేదు అసలే వుపవాసం; ఆపైన ఈ లంకాకాండ! అతను అట్లాగే కూలబడిపోయి చూస్తూ వూరుకున్నాడు.

'రమేష్' అని ఎవరో గంభీరంగా పిల్చారు అకస్మాత్తుగా! 'ఎవరా' అని ఆశ్చర్యంతో ఆదిక్కుగాచూసేసరికి పెద్దమ్మగారు ముందుకొచ్చి నిలబడింది. ఆవిడ భాండారగృహంనుంచి బయటికొచ్చింది. ఆమె తలమీద చీరచెంగు వున్నప్పటికీ, ముఖంమాత్రం స్పష్టంగా కన్పిస్తూనే వుంది. ఏపిలుపూ లేకుండానే పెద్దమ్మ ఎప్పుడొచ్చిందో అతనికి అసలు తెలియదు. అకస్మాత్తుగా యిప్పుడు చూసేసరికి అతనికి ఆశ్చర్యం కలిగింది. ఆమె తనను పరిత్యజించినదని తాననుకున్నాడేగానీ,- అది నిజంకాదని అనుకోడానికి అతనికి ఎంతోసేపు పట్టలేదు. పెద్దమ్మగారు ఎట్లావుంటుందో ఈనాటికీ ఎరుగని చాలామంది ఎంతో విచిత్రంగా యిప్పుడు

చూడసాగారు. ఘోషాల్ కుటుంబపు గృహలక్ష్మి, విశ్వేశ్వరిని, ఈరోజునమాత్రమే నిజంగా కళ్ళతో వాళ్ళు చూడగలిగారు !

పట్టణాల్లోలాగా పల్లెటూళ్ళల్లో మరింత కఠినమైన ఘోషా పద్ధతి వుండదు. కాని విశ్వేశ్వరి గొప్పయింటి కోడలు కావడంవల్లనైతేనేం; మరే కారణంవల్లనైతేనేం, ఆమె తరుచుగా ఎన్నడూ బయటికి వచ్చేదికాదు. ఇవాళ ఆమె రూపాన్ని చూడ్డంతోనే చాలామందికి ఆశ్చర్యం కలిగింది. ఈనాటివరకూ ఆమెను గురించి వినడమేతప్ప, చూసే భాగ్యం లభించని చాలామంది, కళ్ళు మరింత పెద్దవిచేసి చూడ్డం మొదలెట్టారు వాళ్ళలో చాలామందికి ఆమెను చూడ్డంతోనే నోటివెంట మాటకూడా రాలేదు ! కాని ఇవాళ మాత్రం సహించలేనంతకోపంలోనే అకస్మాత్తుగా ఇట్లా బయటికొచ్చేసింది. నలుగురూ తలెత్తి తనను చూసేసరికి' ఆమె స్థంభాన్ని చాటు చేసుకొని నిలబడింది. స్పష్టమూ' తీవ్రమూ అయిన ఆమె పిలుపుతో రమేష్ విచారం కాస్తా చెదిరిపోయింది. అతను ముందుకొచ్చి నిలబడ్డాడు. ఆమె అక్కడే నిలబడి; రమేష్ నుద్దేశించి; "ఇట్లాంటి బెదరింపులు యిక్కడ బెదరించవద్దని గంగూలీకి నేను చెప్పానని చెప్పు రమేశ్ ! అందర్నీ ఆదరపూర్వకంగానే ఆహ్వానించాననే సంగతి హాల్దార్‌కూ్కడా చెప్పు ! ఆ అమ్మాయిని అవమానించే అధికారం యిక్కడ ఎవరికీ లేదనికూడా చెప్పు ! నా గుమ్మంలో యిల్లాంటి అల్లరీ ఆగం జరగడం నేను ఎంత మాత్రం సహించను ! ఇది కథాకార్యాల సందర్భం. 'ఇలాంటి

సమయాల్లో యిక్కడ జరిగే విషయాలపట్ల యిష్టంలేని వాళ్ళుంటే — నోరెత్తకుండా వెళ్ళిపొమ్మని చెప్పు!" అన్నది విశ్వేశ్వరి.

పెద్దమ్మగారి ఆజ్ఞను అందరూ చెవులురిక్కించి విన్నారు. రమేశ్ నోరువిప్పి చెప్పవలసిన అవసరమేలేదు. ఒకవేళవున్నా అతను చెప్పగలిగే స్థితిలోలేడు. విశ్వేశ్వరి చేసిన ఈశాసనంవల్ల ఎలాంటి ఫలితం కలిగిందో అతనికి తెలియదు. ఈకార్యభారాన్ని, యింటిలోని సాధక బాధకాలను ఆమె స్వయంగా నెత్తిన వేసుకోవడం చూసేసరికి, వర్ణించనలవిగాని ఆనందంతో కళ్ళునీళ్ళతో నిండిపోయినయ్. అతను ఎంతో కష్టంమీద కన్నీళ్ళు ఆపుకుని, మరో గదిలోకి వెళ్ళిపోయాడు. అయినా అతని కళ్ళలోనీరు ఆగలేదు. ఇవాళ రోజంతా యింటా బయటా అతనొక్కడే ఎంతో అవస్థపడిపోయాడు. ఎవరు వచ్చారో, ఎవరు వెళ్ళారో అతనికి తెలియదు. ఎవరు వచ్చినా రాకపోయినా, అసలు పెద్దమ్మ రాలేదే అన్న చింతే మనసులో వుండిపోయింది. కాని, పెద్దమ్మ అవసరమైతే తనంతతానే ముందుకు వస్తుందనీ, — స్తంభించిపోయిన కార్యాన్ని జరిపించగలదనీ, అతను ఎన్నడూ వూహించలేదు.

వెళ్ళిపోవడానికి లేచి నిలబడ్డవాళ్ళంతా తిరిగి ఒక్కొక్కరే యథాస్థానాల్లో కూర్చోడం మొదలుపెట్టారు. కాని, గోవిందుడు, హాల్దార్ మాత్రం, మొండితనంవల్ల అట్లాగే నిలబడ్డారు. ఆ జనంలోనుంచి ఎవరన్నారో తెలియదుగానీ, వాళ్ళనుద్దేశించి, కూర్చోండి బాబాయ్ కూర్చోండి,

ఎందుకూ నిలబడ్డారూ? పదహారేసి పూరీలు, నాలుగు జతల లడ్లూ ఎవరు పెడతారు బాబాయ్." అన్నారు ఎవరో.

పరాణ్ హాల్దార్ అకారణంగానే బయటికి వెళ్ళాడు గాని, గోవిందుడు మాత్రం నిజంగానే కూర్చుండిపోయాడు. "బహుశా అతనికి ఆమాట వినేసరికి నోరువూరివుండవచ్చు. భోజనాల సమయంలో వడ్డన జరిగేప్పుడు పర్యవేక్షణపేరుతో అటూ యిటూ తిరుగుతూ కాలక్షేపం చేశాడే తప్ప, పంక్తిలోమాత్రం కూర్చోలేదు గోవిందుని ప్రవర్తన గమనించిన కొంతమంది, మళ్ళీ ప్రతీకారంగా గోవిందుడు ఏదో ఒక ఉపద్రవం తెచ్చిపెడతాడనే అనుకున్నారుగానీ; భోజనాలు అయిపోయేంతవరకూ ఎలాంటి గొడవా జరగలేదు. ఇక భోజనాల సమయంలో బ్రాహ్మణ దేవతలు ఎన్నెన్ని పిండివంటలు ఏవిధంగా ఆరగించింది, ఎన్నెన్నివంటలు హారతి కర్పూరంలా హరించుకుపోయిందీ; కళ్ళతో చూస్తేనేతప్ప, చెబితే నమ్మడం చాలా కష్టం! అంతేగాక; ప్రతివాడూ తను తిన్నదిగాక, తన తరఫువాళ్ళకోసరం, వచ్చినవాడికీ రానివాడికీకూడా కలిపి, వొంతులువారీగా మూటలు కట్టుకున్నారు! సంధ్యవేళ అయింది. బ్రాహ్మణ భోజనాలు పూర్తిఅయినయ్. రమేష్ వీధివాకిట్లో ఒక చెట్టుక్రింద నీరసంగా నిలబడ్డాడు. సరిగ్గా ఆ సమయానికే దీనూభట్టాచార్య తన పిల్లలతో సహా చాటుచాటుగా బయటికి వస్తున్నాడు. వాళ్ళ చేతుల్లో హల్వా, పూరీ, మిఠాయిల మూటలున్నయ్ వాటిని పట్టుకోడానికే ఆ పిల్లలు అవస్థపడిపోతున్నారు. ఆ పిల్లల్లో అందరికంటే ముందుగా ఖేన్ దీయే రమేష్‌ను

చూసింది. చూడ్డంతోనే అపరాధిలా ఒక్కక్షణం కంపించి ఎండిపోతున్న గొంతుతో "నాన్నా! బాబుగారు అక్కడ నిల బడ్డారు" అంది కంగారుగా.

మిగతావాళ్ళుకూడా గాభరాపడ్డారు. ఆ పిల్ల అన్న ఆ ఒక్కమాటతో రమేష్‌కు అంతా అర్థమైపోయింది. పారి పోయేందుకు తనకు అవకాశమేవుంటే రమేష్ తప్పకుండా అక్కణ్నుంచి పారిపోయివుండేవాడు; కాని అలాంటి అవ కాశం లేకుండా పోయింది. లేని చిరునవ్వు తెచ్చుకుని; "ఖేన్ దీ, ఈ పొట్లాలన్నీ ఎవరికమ్మా?" అనడిగాడు అప్ర యత్నంగానే.

దీనూ స్వయంగా ముందుకొచ్చాడు. ఎందుకంటే చిన్న చిన్న పొట్లాలన్నీ పరికిణీ చెంగులో కట్టుకున్న ఆ పిల్ల ఆమాట కేదైనా వెంటనే చెబుతుందేమోనన్న భయం అత నికి కలిగింది! అంచేత ముందుగానే, "ఆఁ ఏముంది బాబూ! చిన్నపిల్లలుగదా! కాస్త యింటికెళ్ళిన తరువాత, ఏవో తలా నాలుగు తింటారు. కాని రమేష్‌బాబూః పెద్ద యజమానురా లని ఆమెను ఎందుకంటారో యివాళ నాకు బాగా అర్థమైంది" అన్నాడు.

ఆ మాటకు రమేష్ ఏమీ సమాధానం చెప్పలేదు. ఆయన్ను సాగనంపడానికి దీనూతోపాటు కొంతదూరం నడుస్తూ, "దీనూ మహాశయా! మీకు ఈ వూరిసంగతులు బాగా తెలుసుగదా; ప్రతి చిన్న విషయానికీ యింతింత అల్లరీ ఆగం ఎందుకుజరుగుతుందో మీకేమైనా తెలుసా?" అనడిగాడు రమేష్.

దీనూబాబు మరో రెండుసార్లు త్రేన్చి గొంతు సవరించుకుని; "ఏం చెప్పేది రమేష్ బాబూ? ఈ పరిస్థితి యీ ఒక్కవూళ్ళోనే కాదు; దాదాపు అన్ని గ్రామాల్లోనూ యిదే పరిస్థితి. నే నొకసారి మా వియ్యంకుడిగారి వూరు వెళ్ళాను. అక్కడిపరిస్థితి వింటే నువ్వు ఆశ్చర్యంతో కూలబడిపోతావు! బ్రాహ్మణులూ, కాయస్థులూ అందరివీ కలిపి యిరవై కుటుంబా లుంటాయో లేదో; వాళ్ళలోనే నాలుగు ముఠాలున్నయ్! హరనాథ్ విశ్వాస్ తన మేనల్లుణ్ణి జైల్లో పడవేయించిందాకా కన్ను మూయ్యలేదంటే నమ్ము! ఇహ కోర్టు వ్యవహారాల్లాంటివాటిల్లోనైతే చెప్పనే అక్కర్లేదు!... అమ్మా ఖేనదీ; హరిధన్ చేతిలో పొట్లం కాస్త నువ్వు పట్టుకో అమ్మా!"

రమేష్ విస్మయంగా, "దీనూ మహాశయా! దీనికేమీ విరుగుడు లేదా ?" అనడిగాడు.

"దీనికి విరుగుడేముంది నాయనా, కలియుగం! కలియుగ ప్రభావం అన్నిచోట్లా నగ్ననృత్యం చేస్తోంది" అని మరోసారి గట్టిగా త్రేన్చి గొంతు సవరించుకుని, "కాని రమేష్ బాబూ నేను ఒక్క సంగతి చెప్పగలను; నేను పేదబ్రాహ్మణ్ణి; వీధివీధీ గడపగడపా తిరిగి యాచనద్వారా జీవితం వెళ్ళబుచ్చుతున్నవాణ్ణి. అనేక వూళ్ళూ, అనేక యిళ్ళూ చూసినవాణ్ణి. నా కేమనిపిస్తుందంటే, నీలాంటి యువకుల్లోనే యీనాడు కాస్త దయా, అభిమానాలనేవి కనిపిస్తున్నయ్ ఇక వృద్ధులున్నారంటే, వాళ్ళు కేవలం సోమరిపోతులుగానూ, అనేక సందర్భాల్లో తడిబట్ట కట్టుకున్న పులుల్లాగా తయా

రౌతున్నారు. ఎక్కడైనా నిర్జనప్రదేశాల్లో ఒంటరివాడెవడైనా కనిపిస్తే యీ ముసలివాళ్ళు నిజంగానే గొంతునులిమి చంపేస్తారా అనిపిస్తుంది! వీళ్ళనుంచి భగవంతుడు రక్షించాల్సిందే!" అని చెబుతూ ఆ వృద్ధుడు గొంతునులమడం విచిత్రంగా అభినయించి చూపించాడు. ఆ అభినయం చూసేసరికి రమేష్‌కు నిజంగానే నవ్వొచ్చింది. కాని దీనూబాబుకు మాత్రం నవ్వు రాలేదు

"ఏం రమేశ్ బాబూ, నీకు నవ్వొస్తుందికదూ? కాని నేను నిజమే చెబుతున్నాను, ఎందుకంటే అసలు నేనే వృద్ధుణ్ణి ఐపోతున్నానుకదా?...చాలా చీకటి పడుతున్నది, యింకా ఎంతదూరం వొస్తావు, యిక వెనక్కు తిరగరాదూ?"

"ఫర్వాలేదు, పదండి, చెప్పండి" అన్నాడు రమేష్.

"ఇంకా ఏం చెప్పను బాబూ! ఏవూరి పరిస్థితిచూసినా యిట్లాగేవుంది. ఒక్క గోవిందునిసంగతే చూడు, అసలు వాడిసంగతి చెప్పుకుంటేనే, మళ్ళీ మనం ప్రాయశ్చిత్తం చేసుకోవాల్సి వొస్తుంది. శాంత (బ్రాహ్మణి) ఏమాటా అబద్ధం చెప్పదు. అందుకే ఆవిడంటే అందరూ హడిలిచస్తారు! ఇహ వేణీబాబుసంగతి వేరు. ఆయనంటే ధనవంతుడి బిడ్డ, ఏం తక్కువ? అతనికి వ్యతిరేకంగా ఎవడైనా ఎట్లా నిలవగలడు? వేణీ తలచుకుంటే ఏమైనా చెయ్యగలడు!"

రమేష్ మారు మాట్లాడకుండా వృద్ధునితోపాటే నడుస్తున్నాడు. రమేష్‌తో చెబుతూ, "నువ్వు చూస్తావుగా రమేష్‌బాబూ, శాంతి బ్రాహ్మణి, ఎంత అసాధ్యురాలో! గంగూలీ, పరాణ్ హాల్దార్ యిద్దరూ రెండు బండ

ల్లాగా ఆవిడ మనసులో పడ్డారు! ఇక వాళ్ళను ఎంతవరకు సాధించాలో అంతవరకూ సాధించే విడిచిపెడుతుంది. అసలే ఆవిడ పేలాలు అమ్ముకుని బ్రతుకుతుందేమో, ఆ రీత్యా యింటింటికీ వెడుతుంది. అన్నికొంపల్లోని రహస్యాలూ ఆవిడకు బాగానే తెలుసు! ఆవిడను ఎవరైనా పల్లెత్తు మాట అన్నారా, వాళ్ళనేకాదు, వూరంతా నిప్పెట్టి వూరుకుంటుంది, అయినా రమేష్‌బాబూ, మనలోమాట, అనాచారమూ! వ్యభిచారమూ ఏ కొంపలో లేవుగనుక? వేణీబాబు..."

"ఆయనమాట పూర్తికాకముందే మధ్యలోనే అందుకుని "పోనీయండి దీనూమహాశయా! ఆ విషయాలు ఎందుకులెండి!" అనేశాడు మధ్యలోనే భయంతో.

వృద్ధుడు అర్థంచేసుకున్నాడు. చప్పున ధోరణిమార్చి "మీకు చాలా కష్టం కలిగించినట్టున్నాను. క్షమించండి బాబూ, మరేమీ అనుకోకండి! అసలు యీ మాట వేణీబాబు చెవుల్లో ఎవరైనా వూదారంటే, ఆయన నాకొంపకు నిప్పుపెట్టి..."

మధ్యలోనే రమేష్ అందుకుని "మహాశయా! మీ యిల్లు యింకా ఎంతదూరం?" అనడిగాడు.

"లేదుబాబూ ఎంతో దూరంలేదు. ఆ వంతెన దగ్గరే! ఆ కనుపించే కుటీరం మాదే నాయనా! ఎప్పుడేనా తమకు వీలుంటే..."

"తప్పకుండా వొస్తాను" అన్నాడు రమేశ్.

రమేశ్ యిక వెనక్కు తిరగడానికి సిద్ధపడి "రేపు వుదయం మనం ఎటుగూడీ కలుసుకుంటాం అనుగోంపి. ఐనా

ఆ తర్వాత కూడా మీరు తప్పకుండా దర్శనం యిస్తూ వుండాలి” అన్నాడు.

“దీర్ఘాయుష్మాన్‌భవ!” అని వృద్ధుడు హృదయ పూర్వకంగా రమేష్‌ను దీవించి, పిల్లలతో ముందుకు సాగి పోయాడు.

# 5

ఈ గ్రామానికంతటికీ ఒకేఒక్క చిల్లరకొట్టు వుంది. దాని యజమానిపేరు మధుపాల్; అతని దుకాణం నదికివెళ్లే బజారులో వుంది. పది పన్నెండురోజులు అయినప్పటికీ మధుపాల్ తన డబ్బుకోసరం, రమేష్ దగ్గరకు రానేలేదు! ఆ సంగతే రమేష్‌కు గుర్తొచ్చి ఒకరోజు వుదయాన్నే ఆ దుకాణందగ్గరకు వెళ్ళాడు, రమేష్‌ను చూడ్డంతోనే మధుపాల్ ఎంతో ఆదరంగా అతన్ని ఆహ్వానించి, కూర్చొనేందుకు మంచిచోటు చూపించాడు. చినబాబుగారు ఎందుకొచ్చారో-ఆ సంగతి తెలియడంతోనే మధుపాల్ ఆశ్చర్యపడి అలాగే కూర్చుండిపోయాడు. ఎందుచేతనంటే, అప్పు పుచ్చుకున్నవాడు స్వయంగావచ్చి బాకీ చెల్లించడం అనేది అతని జీవితంలో వినలేదు; చూడలేదు! ఆతర్వాత కులాసాగా చాలాచాలా మాట్లాడుకున్నారు.

ఏదో సందర్భంలో మాట్లాడుతూ "బాబూ! పావలా, బేడా అప్పులు యివ్వకనూ తప్పదు. అట్లా యిచ్చుకుంటూ పోతే కాతాదార్ల దగ్గరే రమారమి డెబ్బై ఎనభై రూపాయలదాకా దిగబడిపోతుంది! అడిగినప్పుడు యిడిగో, అదిగో అంటూ కాలం జరుపుకొస్తారు. ఇట్లాంటి పరిస్థితుల్లో యింక దుకాణం నడిచే దెట్లా బాబూ! యిదీ పరిస్థితి" అని మధు చెబుతూ; అరె ఎవరూ ఆ వచ్చేదీ, జెనర్జీ బాబేనా? ఓహో, ఏం మహాశయూ ఎప్పుడూ రావడం?" అని పరామర్శ చేశాడు మధు.

జెనర్జీ బాబుకు ఒక చేతిలో లోటా, మరో చేతిలో నాలుగు చేపల్ని తామరాకులో కట్టిన పొట్లం వుంది. జంధ్యం చెవికి తగిలించుకున్నాడు. కాళ్ళ పాదాలనిండా బురదవుంది. జెనర్జీ బాబు దీర్ఘంగా నిట్టూర్చి "రాత్రే వూరినుంచి వొచ్చాను మధూ! రాత్రే! ఏదీ కాస్త పుగాకు వుందేమో చూడు?" అన్నాడు.

చేతిలో లోటా అరుగుమీద పెట్టి చేతిలో చేపల పొట్లాన్నికూడా దాని ప్రక్కనే పెట్టాడు. మధు నుద్దేశించి "ఆ చేపలవాడి అహంభావం చూశావా మధూ? గతంలో కాస్త బాకీవున్నానేమో, దానికోసరం నలుగురిలోనూ నన్ను చెయ్యిపట్టుకు నిలవేశాడు! డబ్బుకోసరం! ఛీ ఛీ! ఎంతకాలం బ్రతుకుతాడులే, నాలాంటి బ్రాహ్మణ్ణి వుసురుపెట్టి! సర్వ నాశనమైపోద్దూ!" అన్నాడు జెనర్జీ.

మధు ఆశ్చర్యపడి "ఏమిటీ డబ్బుకోసరం మిమ్మల్ని నడివీధిలో నిలబెట్టాడా? నిజమా?" అనడిగాడు.

కుపితుడైన జెనర్జీ నాలుగువైపులా మళ్ళీ ఓసారి చూసి "అవును మధూ, కేవలం మూడు పైసలకోసరం! అందుకని బహిరంగంగా నడివీధిలో చెయ్యిపట్టుకు నిలవే శాడు. ఎవరన్నా చూస్తున్నారేమో అని, నాలుగువైపులా చూశానుగానీ, ఎవరూ చూడ్డంలేదు. బ్రతుకుజీవుడా అను కున్నాను. ఆఁ అసలు యింతకీ నేనైనా అటు వెళ్ళేవాణ్ణి కాదు!...ప్రొద్దున్నే కాస్త అట్లా నదిదగ్గరకువెళ్ళి దంత ధావనం పూర్తిచేసుకున్నాను. వాస్తూవాస్తూ ఒక్కసారి అట్లా బజారునుంచి చూసివద్దామని వెళ్ళాను, యింతలోనే గంపనిండా మాంసం పట్టించుకువచ్చి కూర్చున్నాడు. గంప దగ్గరకు వెళ్ళానోలేదో, ఆకులు మూతవేసేసి 'ఏంలేదు ఏం లేదు' అనేశాడు! ఆకులు తొలగించి చూద్దుగదా; గంప నిండా మాంసంవుంది. పైగా వాడంటాడూ 'యిదివరకే రెండుపైసలు బాకీ, యిప్పుడు మళ్ళీనా ?' అన్నాడు. చూశావా మధూ, ముష్టి మూడుపైసలకోసరం వూరు వొదిలి పెట్టి పారిపోతానుటయ్యా ? ఏం మధు చెప్పవేం !" అనడి గాడు జెనర్జీ.

"ఛ ఛ అట్లా ఎందుకవుతుంది? మొత్తానికి భలేవాడే" అని మధు కాస్త సమర్థించాడు.

అకస్మాత్తుగా జెనర్జీదృష్టి రమేష్‌పైన పడింది. ఆశ్చ ర్యంగా అతన్ని చూస్తూ "మధూ, ఈ బాబుగారెవరు ?" అనడిగాడు.

మధు సగర్వంగా; "వీరు చినబాబుగారి వారసులు. మనకు పదిరూపాయలు బాకీవుంటే యివ్వడానికి వొచ్చారు!" అని చెప్పాడు.

బెనర్జీ తన చేపలగొడవకాస్తా మరిచిపోయి, "ఓ, రమేష్‌బాబా! దీర్ఘాయుష్మాన్‌భవ!" అని, మరో క్షణం తర్వాత "బాబూ, నేను వూరినుంచి వచ్చీరావడంతో నే అన్ని సంగతులూ విన్నాను. ఓహోహో, తండ్రిశ్రాద్ధాన్ని ఎవ్వరూ జరపనంత ఘనంగా జరిపారటగదూ! సమయానికి లేకపోయాను! వెధవలుచెప్పిన మాటలునమ్మి, కలకత్తా నౌకరీకోసరం వెళ్లానుబాబూ! ఛ ఛ ఛా, అసలు ఆ నగరాల్లో మనుషులు బతుకుతారా అని సందేహం!" అన్నాడు బెనర్జీ అసహ్యంతో.

రమేష్ ఆయన ముఖాకృతిని చూస్తూ అలాగే కూర్చున్నాడు.

ఆ దుకాణం దగ్గర యింకా నలుగురైదుగురు, బెనర్జీ బాబు చెప్పే కలకత్తా కథను వినడానికి ఎంతో ఆత్రుత పడుతున్నారు. మధు హుక్కా చిలుం సరిచేసి, బెనర్జీ బాబుకు అందించి; "అయితే మరి నౌకరీ ఏమైనా దొరికిందా బాబూ?" అనడిగాడు.

"నౌకరీలేదూ, ఏం లేదు: నేనేమన్నా శ్రద్ధగా వ్రాయడం చదవడంనేర్చుకున్నాను గనుకనా? పోనీ ఒకవేళ ఏదోఒక నౌకరీ దొరికినా; అసలు అక్కడ బ్రతికే దెట్లాగా అని! ఎంత దుమ్మో, అంత బురద! కాలు బయటపెడితే

బట్ళ్ళు, గుర్రాలూ! వాటిని ఎట్లాగో తప్పుకుని కొంపకు చేర డమే. ఏరోజు కారోజు మహాప్రమాదం!"

మధు కలకత్తా అసలు చూళ్ళేదు. కాకపోతే యీ మధ్యకాలంలో ఒక్కసారిమాత్రం 'మేదినీపూర్' వెళ్ళి వచ్చాడు. అంచేత అతనికి ఎంతో ఆశ్చర్యంకలిగి "ఏమిటీ నువ్వుచెప్పేది నిజమా జెనర్జీబాబూ?" అనడిగాడు మధు.

జెనర్జీబాబు నవ్వాడు. "నా మాటమీద నమ్మకం లేకపోతే, పోనీ రమేష్‌బాబును అడుగు! వొద్దు మధు వొద్దు; కూడులేకపోతే పోనీగానీ, పరాయి-చోటుకు పోవడంమాత్రం వొద్దు. చెబితే నమ్మవుగాని మధు, అక్కడ కరివేపాకూ, పోటకూరకాడలు, చింతపండూ, చివరకు ఉసిరికాయలు కూడా డబ్బుపెట్టి కొనుక్కోవలసిందే! ఏం, అట్లా అన్నీ కొనుక్కొనితిని బ్రతగ్గలవా? ఒక్కనెల అక్కడున్నానోలేదో నేనుచూడు, జబ్బుపడ్డ ఎలుకలాగా ఎట్లా ఐపోయానో? రాత్రింబగళ్ళు కడుపులో ఒకటే నొప్పి, గుండెల్లో మంట! ఇహ అంతరాత్మ సరేసరి! యింకా కొన్నాళ్ళు అట్లాగే గడిచినట్లయితే ప్రాణాలే దక్కేవికావనుకో! వొద్దుబాబూ, ఆ నగరాలూ, వాటి ప్రసక్తేవొద్దు. ఈ వూళ్ళోనే పడివుంటాను. చేసుకోగలిగితే పట్టెడు మెతుకులు సంపాదించుకుంటాను; చేసుకోలేకపోతే పిల్లల్ని వెంటబెట్టుకుని ముష్టెత్తుకుంటాను. బ్రాహ్మణపుటక పుట్టి యాచించడం తప్పేంకాదుగా? ఆ బస్తీలో అట్లా చావడంకంటే యిదే నయం!" అన్నాడు బెనర్జీ.

అతను చెప్పిన కథంతా వినేసరికి వాళ్ళందరూ ఆశ్చర్య పడ్డారు. బెనర్జీలేచి, ఆ దగ్గర్లోనేవున్న ఆవనూనె డబ్బాదగ్గరకు వెళ్ళాడు డబ్బావొంచి; దాదాపు ఒక చటాకునూనె చేతిలో వొంపుకుని, అందులో సగం రెండో చేతిలో పోసుకున్నాడు. సగంనూనెవరకు చెవుల్లో పోసుకుని, మిగతానూనె తలమీద రుద్దుకుంటూ, "చాలా ప్రొద్దెక్కింది. కాస్త అట్లా నదిలో ఒక్క మునుగు మునిగి వెళ్తాను. మధూ, ఒక్క పైసా పుప్పుయివ్వు. డబ్బు సాయంత్రం యిస్తాను" అన్నాడు బెనర్జీ.

"మళ్ళీ సాయంత్రమేనా ?" అన్నాడు మధు. డబ్బుకు సంబంధించినంతవరకు, ప్రొద్దున సాయంత్రం, యివాళా రేపూ అనడం అందరికీ మామూలే! కాని యీ మాటలతో మధు బాగా విసిగిపోయాడు. కాని వ్యాపారంలో అప్పుయివ్వక తప్పడంలేదు. బెనర్జీ మెడచాచి మధును చూస్తూ "యింత లోనే నీకేం పుట్టింది మళ్ళీ! బాకీవుంటే మెళ్లో తాడువేసి వసూలుచేస్తావుగదా" అంటూనే బెనర్జీ లేచి, స్వయంగా పుప్పుపెట్టిదగ్గరకు పోయి, రమారమి అర్థశేరుపుప్పు వొళ్లో పోసుకున్నాడు. ఆ తర్వాత లోటా, చేపలపొట్లంకూడా తీసుకుని, రమేషు నుద్దేశించి "పోదాంపద రమేషుబాబూ, నీకూ వెళ్లేదారి యిదేగదా? కబుర్లు చెప్పుకుంటూపోదాం" అన్నాడు బెనర్జీబాబు.

"సరే పదండి" అని రమేషుకూడా లేచాడు. ప్రక్కనే మధు నిలబడివున్నాడు. అసహాయంగా బెనర్జీను చూస్తూ "బాబూ! నువ్వు మైదాపిండి పట్టుకెళ్ళి అప్పుడే ఒకయుగం

గడిచిపోయిం దనుకుంటాను. దానితాలూకూ యివ్వనేలేదు" అనడిగాడు మధు.

బెనర్జీబాబుకు వొళ్ళు మండినంత కోపం వొచ్చింది. "అవునోయ్ మధూ! బాకీవున్నమాట నిజమే; కాదని ఎవడన్నాడు? రెండుసార్లుగా చెల్లిస్తానని యిదివరకే చెప్పానా? నీకేం కళ్ళు లేవూ? ఐనుగురు పిల్లాజెల్లా గలవాణ్నే; ఈ సంసారం ఎట్లా యీదుకొస్తున్నానో నీకు కనిపించడంలా? అసలే నేను కలకత్తాపోయి పకీపరకా తగలేసుకొచ్చానా; యింతలోనే పాతబాకీకోసరం తగాదాకు సిద్ధమయ్యావా?... చూశావా రమేషుబాబూ! వీళ్ళ వ్యవహారం... యిదీవరస!"

మధు దీనంగా చూస్తూ "అదికాదు బెనర్జీబాబూ, చాలారోజులైందని మళ్ళీ జ్ఞాపకం..." అంటూ నసిగాడు.

"అవును. అయినమాట నిజమే! అందుకని అందరూ నీలాగే డబ్బుకోసరం నన్ను పీక్కుతింటుంటే, యిహ నేను ఈ వూళ్ళో వుండాలా, విడిచిపెట్టి పోవాలా?" అనడిగాడు బెనర్జీబాబు.

బెనర్జీ కోపంతో వూగిపోతూ, అట్లాగే యింటిముఖం పట్టాడు.

రమేషు తిరిగి యింటికొచ్చేసరికి వరండాలో ఎవరో ఒక సజ్జనుడు కూర్చునివున్నాడు. రమేషును చూడ్డంతోనే ఆయన చేతిలోని హుక్కా ప్రక్కనేపెట్టి రమేషుకు నమస్కరించి, "నా పేరు వనమాలి; మీ తాలూకు స్కూలుకు హెడ్మాస్టరును" అని చెప్పాడు. మరో క్షణంతర్వాత

"మిమ్మల్ని కలుసుకోడానికి యింతకుపూర్వం రెండుసార్లు వచ్చాను, కాని మీ దర్శనం కాలేదు" అన్నాడు.

రమేషు ఆయనను ఎంతో మర్యాదగా కుర్చీమీద కూర్చోమని చెప్పాడు. కాని ఆయన కూర్చోలేదు; నిలబడే "ఫరవాలేదు; నేను మీ నౌకర్ని" అన్నాడు.

ఆయన వయసులో నిజానికి పెద్దవాడే; అదీగాక స్కూలులో అధ్యాపకుడు కూడాను. అయినప్పటికీ ఆయన అతి వినయప్రవర్తన చూసేసరికి, రమేషుకు కొంత నిరుత్సాహాభావమే కలిగింది. ఎంత చెప్పినా ఆయన వినిపించుకోలేదు. అట్లా నిలబడే అన్ని విషయాలూ చెప్పడం ప్రారంభించాడు.

ఈ ప్రాంతంలోని స్కూళ్ళలో యిది చాలా సాధారణమైన స్కూలు. ఘోషాల్, ముఖర్జీబాబుల సదుద్దేశ్యం వల్లనే యిది స్థాపించడం జరిగింది. ముప్ఫయి నలభైమంది విద్యార్థులు వుంటారు. యిందులో కొందరు రమారమి మూడుమైళ్ళ దూరంనుంచికూడా నడిచి వొస్తుంటారు. నామమాత్రంగా ప్రభుత్వసహాయం లభిస్తుంది. చిన్నతనంలో రమేషుకూడా యీ బడిలో కొన్నాళ్ళు చదివాడు; అంచేతనే అతనికి అన్ని సంగతులూ బాగా గుర్తొచ్చినయ్.

ఈ సంగతులు ఉపాధ్యాయుడు చెపుతూ; స్కూలు పైకప్పు భాగంలోని రెల్లుగడ్డి అంతా పాడైపోయిందనీ; యీ సంవత్సరం జాగ్రత్తపడి సరిగ్గా కప్పించకపోతే, వచ్చే వర్షాకాలంలో స్కూలు ఎందుకూ పనికిరాదనీ చెప్పాడు. పోనీ యీ మరమ్మతులు కొద్దిరోజులు వాయిదా వేసుకుని కాలం గడపగలిగినా; మరో కఠినమైన సమస్య వుంది. యీ స్కూలు

లోని ఉపాధ్యాయులకు గత రెండుమూడు నెలలుగా జీతాలు యివ్వలేదు. ఎంతకాలం యీ విధంగా జరిగేట్టు? అనడిగాడు ఆయన.

స్కూలుతాలూకు ఆ దుర్దశనంతటినీ రమేషు సావధానంగా విన్నాడు; విని ఏమైనా చేద్దామన్న అభిప్రాయం కలిగింది. ఆయనను వెంటబెట్టుకుని లోపలిగదిలోకి తీసుకెళ్ళి మరింత తాపీగా అనేక విషయాలు తెలుసుకున్నాడు.

ఈ స్కూలులో ప్రధానోపాధ్యాయునితోపాటు మరో ముగ్గురు అధ్యాపకులున్నారు. ఈ నలుగురూ ఏడాదిపొడుగునా నడుములు విరగ్గొట్టుకుంటే ఇద్దరు పిల్లలుమాత్రం మైనర్ పరీక్షలో వుత్తీర్ణులవుతారు! ఆ విధంగా ఉత్తీర్ణులయిన వాళ్ళపేర్లు ఆయన కంఠస్థమే; అంచేత ఆ పేర్లన్నీ రమేష్‌కు వినిపించాడు. పిల్లలు చెల్లించే ఫీజుద్వారా కొంతడబ్బు వసూలవుతుంది. ఆ డబ్బు ప్రాథమికోపాధ్యాయులు యిద్దరికిమాత్రం జీతానికి సరిపోతుంది. ఇక ప్రభుత్వ సహాయంద్వారా లభించే దానితో మరొక వుపాధ్యాయునికి భుక్తి గడుస్తుంది. ఇక మిగిలిన ఒక్క వుపాధ్యాయుని జీతమే, వూళ్ళోవాళ్ళద్వారా బయటి ఊళ్ళవారిద్వారానూ చందాలరూపంలో సేకరించాలి. ఈ సేకరణకూడా వుపాధ్యాయుల బాధ్యతేగనుక; అప్పుడప్పుడు ఈ వూళ్ళన్నీ గాలిస్తే, అంతా కలిపి ఏడున్నర మాత్రం వసూలవుతుంది!

ఈ సంగతులన్నీ వినేసరికి రమేష్‌కు ఎంతో ఆశ్చర్యం కలిగింది. ఐదారు గ్రామాలను కలిపి యిదొక్కటే స్కూలు.

ఇంతమంది వుపాధ్యాయులు 'భిక్ష' అడిగితే, అంతా కలిపి ఏడున్నర రూపాయలా?

"మీ జీతమెంత ?" అనడిగాడు రమేష్.

"రశీదుమీద 26 రూ. అని వుంటుంది. కాని నిజానికి నాకు ముట్టేది పదమూడు రూపాయల పదిహేను అణాలు" అన్నాడు ఆయన.

కాని ఈ సంగతి రమేష్కు అర్థంకాలేదు; ఆయన ముఖం చూస్తూ కూర్చున్నాడు.

రమేష్కు విడమరిచి చెబుతూ "అవునండీ, నిజమే; ప్రభుత్వ ఆజ్ఞకదా! రశీదుమాత్రం అంతకే వ్రాయాలి! మిగిలింది అంతా సబ్ యిన్స్పెక్టరు చూసుకుంటాడు! ఆయనకు గనుక ఆగ్రహంవొస్తే ప్రభుత్వ సహాయంకాస్తా ఆగిపోతుంది. ఈ సంగతి స్కూల్లో ప్రతి పిల్లవాడికీ తెలుసు, కావాలంటే మీరు ఎవరైనా అడిగి తెలుసుకోవచ్చు."

మరో క్షణంతర్వాత "ఇట్లాంటి విషయాలన్నీ పిల్లలకు తెలియడంవల్ల మీమీద గౌరవం తగ్గిపోవడంలేదా ?" అనడిగాడు రమేష్.

హెడ్మాస్టరు సిగ్గుపడుతూ "కాని ఏంచేస్తాం రమేష్ బాబూ! ఈ సగంజీతం యివ్వడానికూడా వేణీబాబుకు కష్టంగానే వుంటుంది" అన్నాడు.

"ఏం ఆయనేనా ఈ స్కూలుకు దిక్కు ?" అనడిగాడు రమేష్

హెడ్మాస్టరు సందిగ్ధంలో పడ్డాడు. కాని నిజంచెప్పక తప్పలేదు.

మరో క్షణంతర్వాత, నెమ్మదిగా "వేణీబాబు యీ స్కూలుకు సెక్రటరీయేగానీ, ఒక్క దమ్మిడీకూడా ఖర్చు పెట్టడు. ఆ జాదూ ముఖర్జీగారి అమ్మాయేగనుక దయతల చక పోయినట్లయితే; యీ స్కూలు ఎప్పుడో మూతబడి వుండేది. ఈ సంవత్సరంకూడా ఆ అమ్మగారే కప్పు బాగు చేయిస్తామని మాటయిచ్చారు. కాని ఏ కారణం చేతనో వారు ఆ ప్రసక్తినే వొదులుకున్నారు."

రమపేరు వినగానే రమేష్‌కు మళ్ళీ ఆసక్తి కలిగింది.

ఆ తరువాత యింకా అనేక విషయాలు మాట్లాడి, చివరలో "రమ తమ్ముడుకూడా యిప్పుడు ఆ స్కూల్లోనే చదువుతున్నాడు కదూ ?" అనడిగాడు.

"అవును యతీన్ కదూ; చదువుతున్నాడు అన్నాడు ఆయన.

"సరే, మీస్కూలు వేళైనట్లుంది. మీరు వెళ్ళండి. రేపు నేను స్వయంగా స్కూలుకొస్తాను" అన్నాడు రమేషు.

"మీ దయ" అని హెడ్మాస్టరు రమేషుకు నమస్క రించాడు. ఎంతో వినయ విధేయతతో ఆయన వంగి, విద్యా వంతుడు, ధనవంతుడైన ఈ బ్రాహ్మణయువకుని పాదధూళి తీసుకుని వెళ్ళిపోయాడు.

# 6

విశ్వేశ్వరి ఆనాడు అకస్మాత్తుగా నలుగురిలోనూ నిల బడి ఆమె యిచ్చిన ఆదేశాలు, వాటి తీక్షణతనుగురించి అప్పటికప్పుడే ఆ చుట్టుప్రక్కల పదిగ్రామాల్లోనూ ఎంతో విచిత్రంగా చెప్పుకున్నారు. వేణీబాబు ముఖాముఖిగా యితరు లను కటువుగా నిందించడం చేతగాని మనిషి. అది అతని స్వభావం! అందువల్లనే వేణీ ఆనాడు రమ మేనత్తను పిలిపిం చాడు. ప్రాచీనకాలంలో తక్షకుడు (సర్పరాజు) కాటువేసి నంతమాత్రాన మహావృక్షాలే భస్మమైపోయేవట! కాని ఆ నాడు వేణీబాబు మేనత్త వెళ్ళగ్రక్కిన విషానికి విశ్వేశ్వరి అప్పటికప్పుడే భస్మమై వుండవలసింది, కాని అలా జరగలేదు. జరక్కపోవడానికి ఒకవిధంగా రెండు కారణాలు వుండివుండ వచ్చు. ఒకటి; విశ్వేశ్వరి రక్తమాంసాల ముద్దమాత్రమేగాని వృక్షంలాంటి కఠినమైన శరీరం కాకపోవడం; రెండవది, అది కేవలం సత్యకాలపునాటి మాటేగాని, ఈనాడు అది నిజం అని నమ్మలేకపోవడం! ఈ కలియుగంలో ఆ తక్షకునివిషం ఏమంత ప్రమాదకరమైంది కాకపోవచ్చు; ఎందువల్లనంటే అంతకంటే ప్రమాదకరమైన విషాలు ఈనాటి మానవ సమా జంలో వుండడమే!

ఆనాడు విశ్వేశ్వరి తనకు జరిగిన అవమానాన్ని, తిట్లనూ, తిరస్కారాన్ని అన్నిటినీ భూమాతలాగా దిగ మ్రింగి వూరుకుంది. ఎందుచేతనంటే తనకొడుకే తనకి అవ మానాన్ని చేయించాడు. అతనేవెళ్ళి అన్ని సంగతులూ మేన త్తకు చెప్పివుంటాడు. ఈ మాటలో విశ్వేశ్వరికి ఏమీ అను మానం లేదు. కాని తనకు జరిగిన అవమానంవల్ల కోపంతో ఆనాడు ఏ ఒక్కమాటైనా తానూ తొందరపడి అన్నట్లయితే ఆమె (శాంతి అత్తయ్య) ఆ ఉద్రేకంలో తన కొడుకు 'బండారం' కూడా బయటపెట్టే వుండేది? దానితో అప్పటి వరకూ కాస్త గుట్టుగావున్న 'వ్యవహారం' కాస్తా రమేష్ కూడా తేటతెల్లమై వుండేది! ఈ భయంకరమైన సిగ్గువల్లనే విశ్వేశ్వరి ఆనాడు అంతపెద్ద వాగ్వాదాలు జరిగినా, వాటన్నిటినీ వింటూ భూమాతలాగా సహించి వూరుకుంది

కాని సాధారణంగా పల్లెటూళ్ళలో ఏ రహస్యమూ ఎక్కువ కాలందాగదు. అసలే తనపట్ల పెద్దమ్మకు మనసులో చాలా అభిమానమూ, అప్యాయత వున్నదనే సంగతి చాలా మందికి తెలుసు. ఇందువల్ల తల్లీ-కొడుకుల మధ్య అప్పు డప్పుడు అభిప్రాయ భేదాలొస్తుంటాయనికూడా కొంతమందికి తెలుసు! కాని ఎన్ని అభిప్రాయ భేదాలొచ్చినా, స్వంతతల్లిని అవమానించడానికి కొడుకు ఇతరులను వినియోగిస్తాడనేసంగతే రమేష్ ఆలోచనకుకూడా తోచలేదు. అది అతనికి ఎన్నడూ తోచని విషయం. ఆ సంగతి తెలిసిన మొదటిసారి రమేశ్ పూర్తిగ ఆశ్చర్యపడ్డాడు. కోపంతో కళ్ళు చింతనిప్పుల్లా అయినయ్. వెంటనేపోయి వేణీని పట్టుకుని చావచితకగొడ

దామన్నంత కోపం వచ్చింది. పదిమందిలోనూ పట్టుకొని సిగ్గుతో తలవంచుకునేలాగా చివాట్లు పెట్టాలనిపించింది. స్వంత తల్లిని యితరులద్వారా అవమానించడానికి సిద్ధపడ్డ కొడుకును, ఎంత తీవ్రంగా భంగపరచినా తప్పు లేదనిపించింది. కాని... రమేశ్ వెళ్ళలేకపోయాడు. దూరదృష్టితో ఆలోచిస్తే యిదేమంత మంచి పనిగా తోచలేదు. తాను తొందర పడటంవల్ల పెద్దమ్మకు జరిగిన అవమానం; తన జోక్యంవల్ల మరింత పెరగడమేతప్ప; మరొకటి కాదనిపించింది. ఆనాడు దీనూబాబుద్వారానూ, మొన్నీమధ్య హెడ్మాస్టరుద్వారాను రమను గురించి కొన్ని సంగతులు విన్నాడు. విన్న తరువాత, రమను గురించి అతనికి మరింత సదభిప్రాయం ఏర్పడింది. కాని కొన్ని సమయాల్లో అజ్ఞానమూ, క్షుద్రమూ అయిన సంగతులు తెలిసినప్పుడు, అతని మనసెంతో బాధపడేది. ఊరు పూరంతా అంధకారంలో మునిగిపోతున్నట్టుతోచేది. కాని కాంతి అనేది ఏకొంచంఐనా వుంటే; అది పెద్దమ్మ అంత రాత్మలో మాత్రమే అతనికి గోచరించేది. ఇలాంటి స్థితిలో ముఖర్జీ వంశియుల ప్రాంగణంలో కూడా లీలా మాత్రంగా కొంత కాంతి కనిపిస్తుండేది. ఆ కాంతి తుచ్ఛమూ, అల్పమూ ఐనదేఐనా, రమేశ్ మనసుకు కొంత ఆహ్లాదం కలిగిస్తూండేది! కాని యివాళ ఈ సంగతి తెలిసినప్పట్నుంచి, రమపట్ల అమిత అసహ్యమూ, విరక్తీ కలిగింది. వేణీతోకలిసి రమ, ఆమె మేనత్త అందరూ ఏకమై ఈనాడు పెద్దమ్మను అవమానించారు. ఈవిషయంలో అతనికేమీ అనుమానం కలగడంలేదు. కాని దీనివల్ల ఫలితం ఏమిటి? ఒకవైపు రమ, ఆమెమేనత్త;

వాళ్ళకు వ్యతిరేకంగా ఈ వైపున తను! ఏం చెయ్యగలడు? ఇహపోతే వేణీబాబు! అతన్ని దండించడంగాని, అవమానించడంగాని సాధ్యంగా కనిపించడంలేదు!

ఈ మధ్యలో మరో సంఘటన జరిగింది. ముఖర్జీ-ఘోషాల్ వంశస్థుల మధ్య యిప్పటికే కొంత సమిష్టి స్థిరాస్థి వుంది. ఈనాటికీ విభాగాలు చెయ్యడం జరగనేలేదు. ఆచార్యులవారి యింటి వెనుక భాగంలోవున్న చెరువు ఈ సమిష్టి ఆస్థిలో ఒక భాగం. ఒకప్పుడు ఆ చెరువు చాలా విశాలమైనదే! కాని అతీగతీ పట్టించుకునే వాళ్ళు లేక పోవడంవల్ల క్రమంగా శిధిలమైపోతూ ప్రస్తుతం, గుంటలాగా తయారైంది. అందులో అసలు పెద్దపెద్ద చేపలు వుండనే వుండవు. వుండేవల్లా చిన్నవీ చితకవీనూ, అవైనా వాటంతట అవిపుట్టే చిన్నరకం జెల్లలూ, బురదమట్టలూను! భైరవుడు రొప్పుతూరొప్పుతూ రుగెత్తుకొచ్చాడు. బయట చండీమండపం దగ్గరగదిలో కూర్చుని గుమాస్తా గోపాల్ సర్కార్ ఖాతాలేవో వ్రాసుకుంటున్నాడు. అతన్నుద్దేశించి, "సర్కార్ మహాశయా! మీ మనుషుల్ని ఎవర్నైనా పంపించండి, చెరువులో చేపలు పడుతున్నారు!" అన్నాడు భైరవుడు రొప్పుతూనే!

గుమాస్తా తలెత్తి అతన్నిచూసి, కలంపుల్ల చెవికి ఆనించుకొని, "ఎవరూపట్టేది ?" అనడిగాడు విచిత్రంగా.

ఇంకెవరూ, వేణీబాబు నౌకర్లు నిలబడి వున్నారు. ముఖర్జీగారి కుటుంబంతాలూకు కుంటినౌకరుకూడా వున్నాడు. ఇక లేనిదల్లా మీ తాలూకూ మనిషే! త్వరగా ఎవర్నైనా పంపరాదూ!" అన్నాడు భైరవుడు.

గోపాల్ సర్కార్ స్థిమితంగానే కూర్చొని; "అయినా మా బాబుగారు మాంసం గీంసం తినడే!" అన్నాడు.

"తినకపోతే తినకపోవచ్చు, కాని వాటా వాళ్ళదే గదా! తిననంతమాత్రాన వాటాతాలూకు ఆస్థి వొదులు కుంటారా?" అన్నాడు భైరవుడు. "ఎంతైనా మేంసాకర్లం మాకైతే కావల్సిందే! కాని చిన్నబాబుగారు బ్రతికున్నంత వరకు యిట్లాంటి విషయాల్లో ఆయన కాస్త జాగ్రత్తగానే వుంటాడు. అదీగాక యిట్లాంటి వాటిల్లో రమేశ్‌బాబు అభి ప్రాయాలు మరోవిధంగా వుంటయ్."

భైరవుడు ఆశ్చర్యపడ్డాడు. ఈ సంగతి గుమాస్తా పసి గట్టి, చిత్రంగా నవ్వుతూ, సగంవ్యంగ్యంగానూ, సగంశ్లేష గానూ భైరవునుద్దేశించి; "ఆచార్య మహాశయా! ఏమిటి దంతా? వెధవది ఒకటిరెండు చేపలకోసరం-అవీ మట్టిగుడిసల కోసరం మా చినబాబుగారు కయ్యానికిరావాలా? ఆవేళ ఏం జరిగిందో తెలుసా? బజారుకు ఉత్తరంగావున్న చింతచెట్టు కొట్టి వాళ్ళిద్దరూ సమంగా రెండువాటాలు వేసుకుని పట్టుకొని పోయారు.న్యాయంగాఐతే మాచినబాబుగారికేఅందులోవాటా రావాలి. కాని వాటాకాముగదా; కనీసం చింతపుల్ల అయినా యివ్వలేదు. నేను ఆదుర్దాగా పరుగెత్తుకుంటూ వచ్చి చిన బాబుగారికి ఈ సంగతి చెప్పాను. ఆ సమయాన ఆయన ఏదో పుస్తకం చదువుకుంటున్నారు. నా మాటవిని ఒక్కక్షణం పుస్తకంమూసి, నా ముఖంచూసి; తిరిగి నవ్వుకుంటూ పుస్తకం చదవడంలో పడిపోయారు. నేను సహించలేక మళ్ళీ ప్రయత్నించి: ఏంబాబూ? ఏమంటారూ?" అనడిగాను.

ఆ మాటకు అసలు సమాధానమే లేదు.

మళ్ళీ మళ్ళీ అడగ్గా ఆయన పుస్తకంమూసి ప్రక్కన పెట్టుకుని దీర్ఘంగా ఆవులించి బధ్ధకంగా వొళ్ళు విరుచుకున్నారు. మరో నిమిషం తర్వాత; "చింతచెట్టా? కొట్టుకుపోయూరా? పోతే యింక చింతచెట్లు లేవా?" అని విచిత్రంగా అడిగారు.

"లేకేం, చాలా వున్నయ్. కాని న్యాయంగా మనకు రావలసిన వాటాను వొదులుకోవడం ఏమంత మంచిపని కనుకా? అసలు ఎవడు వొదులుకొంటాడు?" అనడిగాను.

రమేష్‌బాబు మరి కాస్సేపాగి "నువ్వు చెప్పేది నిజమే గాని, చింతపుల్లలకోసరం తగాదాకు వెళ్ళమంటావా?" అనడిగాడు.

భైరవాచార్యులు ఆశ్చర్యపడి "ఏమిటీ; నిజంగా అలా అన్నాడా?" అనడిగాడు.

గోపాల్ నవ్వి నెత్తికొట్టుకుంటూ "అవునవును. సరిగ్గా ఆయన ఆ మాటే అన్నారు. నేను ఆవేళే అనుకున్నాను ఆచార్య మహాశయా; ఈ యింటి లక్ష్మీదేవి ఆ తారిణీ ఘోషాల్‌తోనే పోయిందని" అన్నాడు.

భైరవుడు మరికొంచెంసేపు ఆగి; "కాని ఆ చెరువు సరిగ్గా మాయింటి వెనకనేవుంది. పోని నేవెళ్ళి ఒక్కసారి చెప్పిరానా?" అనడిగాడు.

"ఆఁహాఁ! పోయిరండి! నాకేం అభ్యంతరం! రాత్రిం బగళ్ళు పుస్తకాలతో మునిగితేలేవాళ్ళు యీ జమిందారీ ఆస్తుల్ని ఏం రక్షించుకోగలరు? ఆ జాదూ ముఖర్జీగారి

కూతురు-ఆడది-ఆమెనుగురించి వింటుంటే ఎంతో చిత్రంగా వుంటుంది. ఒకసారి ఆవిడ ఏంచేసిందో తెలుసా? నెలకు 'యింత' అని డబ్బిస్తాను; యీ జమిందారీ ఆస్థిఅంతా తనకు అప్పగించమని గోవిందగంగూలీతో కబురుపంపించింది! ఆచార్య మహాశయా! యింతకంటే సిగ్గుమాలినమాట మరొకటుంటుందా ?'' అనడిగాడు గోపాల్.

అంతరాత్మలోని దుఃఖంవల్ల గుమాస్తా ముఖం నల్లబడిపోయింది. అతను తలవంచుకుని చెవినుంచి కలం తీసికొని తిరిగి తన కాతా రాసుకునేపనిలో నిమగ్నుడయ్యాడు.

వరండాలో ఆడవాళ్ళెవరూ లేరు. నాలుగు గుమ్మాల తలుపులూ తీసేవున్నయ్. భైరవుడు లోపలికొచ్చాడు. రమేష్ విరిగిన పడక్కుర్చీలో పడుకునివున్నాడు. భైరవుడు మొదట కర్తవ్యపాలనను గురించీ, స్వీయసంపత్తి రక్షణనుగురించి కొంచెంగా ఉపోద్ఘాతం చెప్పి చివరకు అసలు విషయాని కొచ్చాడు, అసలుసంగతి తెలిసేసరికి రమేష్‌కు ఒళ్ళు తెలియనంత కోపం వొచ్చింది. తుపాకి గుండుదెబ్బతగిలి నిద్ర పోతున్న పులి గర్జించినట్టు అరుస్తూ రోజురోజుకూ, ఒక్కోకొత్తఎత్తు వేస్తున్నారన్నమాట! భజవా! అరే ఓ భజవా! ఎక్కడికెళ్ళావురా ?'' అని బిగ్గరగా అరిచాడు రమేష్. రమేషుని యీ ఉగ్రరూపం చూసేసరికి భైరవాచార్యులు హడిలిపోయాడు. యజమాని ఎవరి ఎత్తుగడను చూసి మండిపోతున్నాడో అతనికి అర్థంకాలేదు.

భజవా రమేష్ నౌకరు; గోరఖ్‌పూర్ జిల్లావాడు. అత్యంత బలవంతుడు, విశ్వాసం కలిగినవాడు; పైగా

వస్తాడు! స్వయంగా పాకశాస్త్రం నేర్చుకుని, రమేష్ వాడి కూడా అది నేర్పాడు. యజమాని మాట వినిపించటం తోనే భజరా లోపల్నుంచి బయటికొచ్చాడు. రమేష్ అతన్ని కఠినంగా శాసిస్తూ "పో వెళ్ళు; వెళ్ళి ఆ చేపలన్నీ లాక్కురా! ఎవడన్న అడ్డగిస్తే వాడి పిలకపట్టుకుని యిలా యీడ్చుకురా! అట్లా యీడ్చుకురాలేకపోతే-కనీసం పళ్ళు అయినా వూడగొట్టిరా!" అన్నాడు.

భజవాకు కావలసిందికూడా యిలాంటి ఆజ్ఞ లే! వెంటనే లోపలికి వెళ్ళి తన లాఠీని తెచ్చుకున్నాడు. ఎన్నో సేర్ల నూనెలో నానినాని ఆ లాఠీ ఎంతో నునుపుతేలింది. ఆ లాఠీకర్ర రూపమూ రంగూ చూసేసరికి భైరవాచార్యులుకు రోమరోమాలూ నిక్కబొడుచుకున్నయ్. భైరవుడు కేవలం బెంగాలీ మట్టిరకం మనిషి! బెంగాల్లోని సర్వసాధారణమైన అల్లరీ-ఆగం, తిట్లూ-తిరస్కారాలూ, నానా చెత్తా చెదారం చూసి అతనేమీ భయపడలేదుగానీ, మహా భయంకరమైన యీ భీమకాయుణ్ణి చూసేసరికి అతని కాళ్ళు నిజంగానే చల్ల బడుతున్నయ్. మనసులోనే భగవంతుణ్ణి వుద్దేశించి "మహా నుభావా! ఈ రాక్షసుణ్ణికూడా నువ్వే సృష్టించావా?" అను కున్నాడు. భజవా పల్లెత్తి పలకలేదు. యజమాని ఆజ్ఞ లభిం చడంతోనే తనవొంచి నమస్కరించాడు. వెంటనే లోపలికి పోయి చావదేలిన లాఠీ పట్టుకొచ్చాడు! అది చూసేసరికి భైరవునికి గొంతు తడి ఆరిపోతున్నది. ఏ కుక్క మొరగదో- అది నిజంగానే కరుస్తుందన్న సామెత ఆక్షణాన అతనికి గుర్తొ చ్చింది. భైరవుడు రమేషుకు నిజమైన శ్రేయోభిలాషి. అం

చేతనే సూచనప్రాయంగా చెప్పిపోదామని వచ్చాడేగాని; యిది యిట్లా పరిణమిస్తుందని అతను అనుకోలేదు. ఏదో మాటమాత్రంగా అడిగితే ఏవో రెండుమూడు చేపలు యీ వాటాకు రావలసే వుంటయ్. కావాలంటే ఆ అడిగేదేదో- తనే స్వయంగా రమేషుపక్షాన అడగగలడు కూడాను. కాని యిదేం ఖర్మ; అసలు వాటాకోసరం మాట అడగనూలేదు; వాళ్ళు కాదని అననూలేదు. యజమానికి కోపం రావడం; నౌకరుకు ఆజ్ఞాపించడం; వాడు యింతలావు లాఠీకర్ర భుజాన పెట్టుకొని సిద్ధమవ్వడం; అంతా నిమిషాల్లో జరిగిపోయింది. భైరవుడు నిజంగా పేదవాడు. మల్లయుద్ధాల్లో పాల్గొనేంత శక్తిసామర్థ్యాలు అతనికి లేవు; అసలు సంకల్పమే లేదు. లాఠీకర్ర తీసుకుని వెళ్ళిపోవడానికి సిద్ధంగావున్న భజవాను చూడ్డంతోనే భైరవుడు, రమేషు రెండుచేతులూ పట్టుకుని భోరునఏడుస్తూ "త్రాహిమాం రమేషుబాబూ, త్రాహిమాం అరే ఆగరా భజవా, ఆగు; వెళ్ళకు. నేను పేదవాణ్ణి; అన్యాయంగా నేను యీ వుచ్చులో యిరుక్కుపోగలను" అంటూ ఏడుస్తున్నాడు. రమేషు భైరవుని పట్టు విడిపించుకున్నాడు. అతనికి ఆశ్చర్యం కలిగింది.

భజవా నిశ్చేష్టుడై అలాగే దగ్గరకొచ్చాడు. భైరవుడు గద్గదస్వరంతో "యీమాట దాగదు రమేషుబాబూ! వేణీబాబుకు తెలుస్తుంది. ఆయనకు కోపం వొచ్చిందంటే నేను సర్వభ్రష్టుణ్ణి ఐపోతాను. నా యిల్లువాకిలికి నిప్పుపెట్టిస్తాడు. బ్రహ్మాది దేవతలుకూడా నన్ను రక్షించలేరు రమేషుబాబూ!" అని అన్నాడు.

రమేశ్ తలవంచుకుని అలాగే కూర్చొన్నాడు. భైర వుని ఈ గందరగోళం ఏడుపులు వినబడేసరికి గుమాస్తా గోపాల్ సర్కార్ ఖాతా పుస్తకాలు అక్కడే వొదిలిపెట్టి లోపలికి గాభరాగా పరుగెత్తుకొచ్చాడు. పరిస్థితిని అర్థం చేసుకుని, వినయస్వరంతో రమేశ్ నుద్దేశించి, "భైరవా చార్యులు చెప్పేది నిజమే బాబూ!" అని అన్నాడు.

గుమాస్తా మాటలకుకూడా రమేష్ ఏమీసమాధానం చెప్పలేదు. భజవాను తన పనిమీద తాను వెళ్ళిపొమ్మని రమేశ్ చేత్తోనే ఆజ్ఞాపించి, తను లోపలికి వెళ్ళిపోయాడు. రమేల్ హృదయవీణా తంత్రులు ఈనాడు ఏ దుఃఖగీతాన్ని ఆలాపిస్తున్నాయో, ఆ ఆలాపనలో భైరవుని ప్రాణాలు ఎట్లా అల్లాడిపోతున్నాయో, ఆ సంగతి సర్వాంతర్యామి ఐన భగ వంతునికే తెలుసు!

# 7

"జతీన్; యింకా ఆటలాడుతున్నావుట్రా; స్కూలు కెళ్ళవూ?"

"మా బడికి యివాళా రేపూ శెలవే అక్కా"

ఈ మాట వినేసరికి పిన్నికి మరింత కోపం వొచ్చింది. అసలే వికృతంగావున్న ముఖాన్ని మరింత వికృతంగా

మార్చుకుని; "ఓరి నీస్కూలు తగలబడా! నెలకు పదిహేను రోజులు శెలవులేనట్టా?" అని రమ వేపుతిరిగి, "రమా, నువ్వొకదానివి తయారయ్యావు; యిలాంటి దిక్కుమాలిన స్కూలు కోసరం డబ్బు తగలెయ్యడానికి. నేనేగనుక అయితే యింత నిప్పుపెట్టి వుండేదాన్ని!" అని అనేసి ఆ తరువాత మామూలుగా తనపనిలో నిమగ్నమైపోయింది.

పిన్ని సాధారణంగా అబద్ధాలకోరు అనే అందరూ అనుకుంటారుగానీ; ఒక్కోసారి ఆమె తనకు తెలియకుండా తానే నిజాన్ని చెప్పేస్తుంటుంది. అట్లా చెప్పడమేగాదు, మరొకసారి నిజంగా చేసి మరీ వూరుకుంటుంది!

రమ తమ్ముణ్ణి మరింత దగ్గరగా లాక్కొని మరింత అప్యాయంగా; "అరే జతీన్, మీకు యిప్పుడు శెలవెందుకు యిచ్చారురా?" అనడిగింది.

జతీన్ అక్కకు మరింత దగ్గరగా ఆనుకుని; మా స్కూలుకు పైకప్పు భాగం మళ్ళీ కొత్తగా వేస్తున్నారు, ఆతరువాత వెల్లవేయిస్తారట! అక్కా, ఎన్ని పుస్తకాలొచ్చాయనుకున్నా? అన్నీ కొత్తవే! నాలుగైదు కుర్చీలుకూడాను. అలమారాకూడా తెచ్చారు. గోడగడియారం కూడా వుంది. అబ్బ యిప్పుడెంత బావుంటుందనుకుంటున్నా! పోనీ నువ్వొకసారి మా స్కూలుకు చూడ్డానికి రారాదూ?"

రమకు ఎంతో ఆశ్చర్యం కలిగింది. జతీన్ చెప్పిన మాటల్లో ఏదీ నిజం కాదనుకొని, ఏంరోయ్, నువ్వూ పెద్ద బడాయికోరు వైపోతున్నావే!" అన్నది. "కాదక్కా, ఒట్టు నితోడు, నేను నిజమే చెబుతున్నాను. రమేష్‌బాబు వొచ్చా

డుగదా, ఆయనే యివన్నీ తెప్పించాడు.'' అన్నాడు జతీన్. ఆ తరువాత యింకా జతీన్ ఏదో చెప్పబోతున్నాడు. ఇంతలో ఎదురుగా పిన్ని రావడంచూసి. చప్పున జతీన్‌ను వెంటబెట్టు కుని రమ గదిలోనికి వెళ్ళిపోయింది. తమ్ముణ్ణి, మరింతగా లాలించి ముద్దుపెట్టుకుని, స్కూలుకు సంబంధించిన యింకా అనేక సంగతులు చెప్పించుకున్నది. ప్రత్యేకించి రమేశ్ స్కూలు అభివృద్ధికోసరం చేసిన పనులన్నిటినీ తరచితరచి అడిగింది. రమేశ్ రోజూ గంటా రెండుగంటలపాటు పిల్లలకు చదువు చెప్పడానికి కూడా వొస్తుంటాడట. అన్నీ విని "అయితే ఆయన నిన్ను చాలా అభిమానంగా చూస్తాడు గదూ?'' అనడిగింది రమ అకస్మాత్తుగా.

'ఊ' నన్నట్టు జతీన్ సగర్వంగా తలూపాడు.

"ఆయన్ను నువ్వు ఏమని పిలుస్తుంటావు?'' అనడిగింది రమ.

ఈ ప్రశ్నకు జతీన్ సమాధానం చెప్పలేక పోయాడు. ఎందుచేతనంటే జతీన్‌కు ఆయనతో అంత సన్నిహితత్వం యింకా ఏర్పడలేదు. రమేశ్ బాబు స్కూలుకు వచ్చినప్పుడల్లా హెడ్మాస్టరు అంతటివాడే లేచి నిలబడి ఆయన్ను ఎంతో గౌరవంగా చూస్తాడు. పిల్లలదృష్టిలో హెడ్మాస్టరే ఎంతో 'గొప్ప' మనిషి. అలాంటి గొప్పవాడే, రమేశ్‌ను గౌరవిస్తున్నాడంటే, ఈయన యింకా గొప్పవాడై వుండాలి. అలాంటి ఆయన్ను ఏదో విధంగా పిలవడం దేవుడెరుగు, అసలు ఆయనకేసి చూడ్డానికే పిల్లలు ఎంతో భయపడతారు. కాని పాపం జతీన్ ఈ విషయాన్ని అక్కముందు అంగీకరించడానికి చాలా

బాధపడిపోయాడు ! కాని ఉపాధ్యాయులందరూ రమేశ్‌ను 'చినబాబు' గారు అనే పిలుస్తుంటారు. ఆ సంగతి జతీన్‌కు బాగాగుర్తు. దాన్ని దృష్టిలో పెట్టుకుని తన తెలివి అంతా వుపయోగించి, "మేము ఆయన్ను 'చినబాబుగారూ ?' అంటాం" అన్నాడు. కాని రమ జతీన్ ఆలోచనను పసిగట్టింది. వాణ్ణి తన గుండెలకు హత్తుకుని "ఛ, ఛడవా! చినబాబేమిటీ; నీమొహం! ఆయన నీకు సోదరుని లాంటివాడు. వేణీబాబును నువ్వు పెద్దన్నయ్యా అని పిలవడంలా, అలాగే ఆయన్ను కూడా చిన్నన్నయ్యా అని పిలవచ్చు,"

జతీన్ పూర్తిగ ఆశ్చర్యపడి, అక్క కళ్ళల్లోకి సూటిగా చూస్తూ, "ఏమిటీ, ఆయన నాకు చిన్నన్నయ్య లాంటివాడా? నిజమా అక్కా ?" అనడిగాడు.

"అవునురా, నిజమే" అంది రమ.

ఆ తరువాత మరొక్క నిమిషంకూడా వాణ్ణి పట్టుకోవడం కష్టమైపోయింది రమకు. ఈ క్షణాన తెలిసిన ఈ విచిత్రమైన కబురు తన స్నేహితులందరికీ చెప్పేస్తేనేగాని, వాడికి తెల్లవా రేట్టు కనబడలేదు. స్కూలుకు శెలవే అయినా, ఆదగ్గర్లో వున్న యిద్దరు ముగ్గురు స్నేహితులకైనా కనీసం ఈ మాట చెప్పుకోవాలని మహా ఆరాట పడిపోతున్నాడు అందుచేత అక్క కౌగిల్లోంచి విడిపోయి, "నేను బయటకు వెడతాను పోనియ్యక్కా!" అనడిగాడు.

"ఇప్పుడెక్కడికి వెడతావురా ?" అనడిగిందేగాని, రమ వాణ్ణి వదల్లేదు. ఇక గత్యంతరం లేక జతీన్ అక్క

ప్రక్కనే కూలబడి ఒక్క క్షణం మెదలకుండా కూర్చున్నాడు. మరోక్షణం తర్వాత అకస్మాత్తుగానే "అయితే మరి; ఆయన యింత కాలం ఎక్కడున్నాడూ?" అనడిగాడు.

రమ మామూలు ధోరణిలోనే "ఆయన యింతకాలం విదేశాల్లో చదువుతున్నారు. నువ్వుకూడా పెద్దవాడివయ్యాక అట్లాగే విదేశాలకుపోయి చదవాలి. కాని నన్ను విడిచిపెట్టి నువ్వు వుండగలవట్రా?" అనడిగింది రమ. అట్లా అడుగుతూనే తరుణవయస్కురాలైన రమ తమ్ముణ్ణి మరోసారి గుండెలకు గాఢంగా హత్తుకుంది. జతీన్ యింకా పసివాడే; అయినప్పటికీ అక్క కంఠస్వరంలో అకస్మాత్తుగా వినిపిస్తున్న యీ మాధుర్యానికి ఆశ్చర్యపడి అక్కను విచిత్రంగా చూశాడు. రమ తన తమ్ముణ్ణి ప్రాణంకంటే ఎక్కువగా ప్రేమిస్తున్నది. అయినప్పటికీ అక్క ప్రవర్తన యివాళ అతని కెంతో ఆశ్చర్యం కలిగించింది. ఆమెలో కలిగిన యీనాటి భావోద్వేగాన్ని అతను యింతకుముందెన్నడూ చూడలేదు.

"అయితే చిన్నన్నయ్య చదువు అయిపోయినట్టేనా?" అనడిగాడు జతీన్.

రమ యింతకుపూర్వంలాగానే కోమలస్వరంతో "అవును నాయనా; ఆయన చదువు పూర్తిఅయినట్టే." అన్నది.

"నీకెలా తెలుసు?" అనడిగాడు మళ్ళీ జతీన్.

సమాధానంగా రమ దీర్ఘంగా నిట్టూర్చి, తలపంకించింది. కారణమేమిటంటే యీ విషయాన్ని గురించి రమకు గానీ, గ్రామస్థులలో ఏ ఒక్కరికిగానీ అసలుసంగతి ఏమీ తెలియదు. రమ అంచనా నిజమూకావచ్చు, కాకపోవచ్చు.

కాని, యితరుల శ్రేయస్సుకోసరం ప్రయత్నించే వ్యక్తి స్వయంగా మూర్ఖుడువవుండడని రమ అంతఃకరణ చెబుతోంది. అందుచేతనే ఆమె అట్లా వూహించి చెప్పింది.

కాని యీ విషయాన్నిగురించి జతీన్ మళ్ళీ ప్రశ్నించలేదు. కాని యింతలోనే అతని మెదడులో మరో ప్రశ్న తయారైంది. ఆ ప్రశ్న అక్కను అడక్కుండా వుండలేకపోయాడు. "అయితే అక్కా! మరి పెద్దన్నయ్యలాగా, ఆయన మనింటికి రోజూ రాడెందుకని ?" అనడిగాడు

యీ ప్రశ్న ఆమె హృదయంలో శూలంలా గ్రుచ్చుకుందేమో, ఒక్కసారి కంపించినట్లయింది. ఐనప్పటికీ ముఖంలోని చిరునవ్వులో ఏ మాత్రం మార్పు రాకుండానే "నువ్వెళ్ళి పిలుచుకురాలేవా ?" అనడిగింది.

"ఎందుకు పిలుచుకురాలేనూ? యిప్పుడే వెళ్తాను" అని వెళ్ళడానికి వెంటనే లేచి నిల్చున్నాడు జతీన్.

చప్పున వాణ్ని తన బాహువులమధ్య బంధించి, భయపెడుతూ "జాగ్రత్త జతీన్; అలాంటిపని ఎప్పుడూ చెయ్యకే. తెలిసిందా ?" అనడిగింది.

అక్కగుండెలకు హత్తుకుని వుండడంవల్ల జతీన్ ఆమె హృదయస్పందనాన్ని ఎంతో స్పష్టంగా వినగలిగాడు. ఇంతకుపూర్వం ఎన్నడూకనగని విచిత్రానభూతి అతనికి కలిగింది. అక్క మనసులోని యదార్థ భావావేదన ఏమిటో అతనికి స్పష్టంగా తెలియక ఆమె ముఖాన్ని తదేకంగా చూస్తూ కూర్చుండిపోయాడు. సరిగ్గా యీ సమయానికే పిన్నిపిలుపు తీక్షణంగా వినిపించింది. రమ వెంటనే జతీన్‌ను తన బాహు

వుల మధ్యనుంచి విడిచిపుచ్చి దూరంగా కూర్చుంది. మరు క్షణంలోనే పిన్ని ఎదురుగావచ్చి "అహఁ ఇంకా యిక్కడే వున్నావూ; స్నానానికి వెళ్ళావనుకున్నాను. యివాళ ఏకాదశి గదా, యిక స్నానం చెయ్యవాఏం? కాస్త తలకు నూనె అంటుకోరాదూ? ముఖంచూడు ఎట్లా నల్లబడిపోయిందో."

రమ బలవంతంగా నవ్వి, "పిన్నీ నువ్వు వెళ్ళు; నేను స్నానంచేసి వస్తాను" అని అన్నది.

"సరే వెళ్ళువెళ్ళు...ఇదో చూడూ, వేణీ చేపలు పట్టడానికి వచ్చాడు: కాస్త అదికూడా చూడు" అని పుర మాయించింది.

చేపలమాట వినపడగానే జతీన్ పరుగెత్తాడు. పిన్ని అటు వెళ్ళగానే రమ కొంగుతో ఒక్కసారి ముఖాన్ని తుడుచుకుని నెమ్మదిగా యింట్లోనుంచి బయటికొచ్చింది. బయట వరండాఅంతా కోలాహలంగా వుంది. మొత్తానికి చాలా పెద్దపెద్దచేపలే దొరికినయ్. వీటిని పంచడానికి వేణీ స్వయంగా హాజరయ్యాడు. ఇరుగుపొరుగు పిల్లలుకూడా బాగానే గుంపుగా చేరారేమో, కాస్త సందడిగానేవుంది.

ఖంగుఖంగుమని దగ్గు వినిపించింది. చేతికర్ర ఆధారంతో ధర్మదాసుకూడా అక్కడ హాజరయ్యాడు. వస్తూనే "చేపలు ఏమన్నా దొరికాయా, లేదా వేణీబాబూ?" అనడిగాడు.

"ఆఁ ఏమున్నయ్; అన్నీ రొయ్యలూ, బురదమట్టలూను" అన్నాడు వేణీ కృత్రిమ అసంతృప్తిని నటిస్తూ!

బెస్తవాణ్ణి వుద్దేశించి "యింకా చూస్తావేంరా; మొత్తం రెండువాటాలుగా పంచు" అన్నాడు వేణీబాబు.

బెస్తవాడు చేపల పంపకం ప్రారంభించాడు.

"ఏం చేస్తున్నారు రమా? చాలా రోజులైంది వచ్చి, ఎట్లావున్నావో చూసిపోదామని వొస్తున్నా" అంటూ గోవింద గంగూలీకూడా అక్కడ ప్రత్యక్షమయ్యాడు

"రండి రండి" అని ముఖం తిప్పుకుని నవ్వుతూ రమ ఆయన్ను ఆహ్వానించింది

"ఈ గుంపులంతా ఎందుకురా ?" అంటూ గంగూలీ మరింత ముందుకొచ్చి, "ఒహో పెద్దపెద్దచేపలే పడ్డాయి- వల పెద్దచెరువులో వేశారాఏం ?" అన్నాడు ఆశ్చర్యంగా.

ఈ ప్రశ్నలకు ఎవరూ సమాధానం చెప్పలేదు. చేపల పంపకంమీదే దృష్టినిలిపి వేణీ అటువేపే చూస్తున్నాడు. మరి కాస్సేపటికి పంపకంకూడా పూర్తిఅయింది. వేణీ తనవంతు చేపలన్నిటినీ గంపలోనికి ఎత్తించి 'ఇక యింటికిపద' అన్నట్టు సంజ్ఞచేశాడు. ఇక రమ వాటాతాలూకు చేపలుమాత్రమే అక్కడున్నయ్. నిజానికి ముఖర్జీ (రమ) గారి యింటికి అన్ని చేపలు నిజంగా అనవసరమే! అంచేత అక్కడ అప్పటికి చేరిన పెద్దమనుషులు తలాకొద్దీ తీసుకున్నారు. ఇక మిగిలిన చేపలను గంపనుఎత్తే సమయానికి ఒక విచిత్ర సంఘటన జరిగింది. రమేష్‌ఘోషాల్ నౌకరు; భీమకాయుడు, యింతలావుపాటి లాఠీకర్ర చేతబుచ్చుకుని అకస్మాత్తుగా అక్కడ ప్రత్యక్ష మయ్యాడు. వాడు ఆ రూపంలో సాక్షాత్తూ యమధర్మ రాజులాగానే వున్నాడు. వాణ్ణి ఒక్కసారిచూస్తే చాలు,

జన్మంతా ఎవరూ మర్చిపోలేరు. వాణ్ని వూళ్ళో ప్రతి పిల్ల వాడూ బాగానే గుర్తు పెట్టుకుంటాడు. అంతేకాక, అతన్ని గురించి చిత్ర విచిత్రమైన విషయాలు కూడా చెప్పుకుంటారు. ఇంత గుంపులో వాడు రమను ఎట్లా గుర్తించాడోగాని, అంత దూరంనుంచే వంగి, రమకు నమస్కారం చేశాడు. ఆ తర్వాత "అమ్మా! అని సంభోధిస్తూ వాడు మరింత దగ్గరగా వచ్చాడు. వాడి ముఖాకృతి ఎలా వున్నప్పటికీ, కంఠస్వరం మాత్రం చాలా కటువుగావుంది. ఐనా ఆ స్వరం తోనే హిందీ మిశ్రిత బెంగాలీ భాషలో రమ నుద్దేశించి, "నేను రమేష్‌బాబుగారి నౌకర్ని. మూడు భాగాల్లో ఒక భాగం చేపలు మాకురావాలి. అవి తీసుకుపోవడానికే వచ్చాను." అన్నాడు. ఈ మాటలకు రమ వెంటనే సమాధానం చెప్పలేక పోయింది. బహుశా నిజంగా ఆశ్చర్యపడి వుండవచ్చు, లేక ఏ సమాధానమూ చెప్పడానికి ఆమెకు ఆలోచన కలిగివుండకపోవచ్చు. భజువా తలత్రిప్పి వేణీబాబు నౌకరునుద్దేశించి, "ఓయ్, నువ్వొకదలకు!" అని గట్టిగా అరిచాడు. వేణీ నౌకరు భయంతో నాలుగడుగులు వెనక్కు వేశాడు. క్షణకాలం నిశ్శబ్దం ఆవరించింది. అప్పుడు వేణీ సాహసించి, ఎక్కడైతే అప్పటికి నిలబడ్డాడో, అక్కణ్నుంచే భజువానుద్దేశించి, "వాటా? దేనిలో వాటా?" అని అడిగాడు విచిత్రంగా.

భజువా చప్పున వంగి వేణీకికూడా నమస్కారంచేసి, వినయంగా, "బాబూ నేను మిమ్మల్ని అడగడంలేదు!" అన్నాడు.

వరండాలో అల్లంతదూరాన నిలబడిన పిన్ని అక్క-ణ్ణుంచే గడబిడా అరుస్తూ; "కాకపోతే మా తలలు పగలకొట్టడానికి వొచ్చావుట్రా?" అనడిగింది.

భజువా కాస్సేపటివరకూ ఆవిడ ముఖంవేపు చూసి; ఆతర్వాత చాలా భయంకరంగా నవ్వాడు. ఆ నవ్వుతో ఆ ప్రాంతమంతా ఒక్క-సారి దద్దరిల్లినట్లయింది. భజువా నవ్వు ఆపుకుని, కొంచెంగా వినయాన్ని ప్రదర్శిస్తూ రమ నుద్దేశించి "అమ్మా, ఏమంటారు?" అనడిగాడు.

వాడి వినయపూరితమైన అభ్యర్థనకు అడుగున ఏదో భయంకరమైన ఆజకూడా యిమిడి వుంటుందని గ్రహించడానికి రమకు ఎంతోసేపు పట్టలేదు. దానితో ఆమెకు చాలా విరక్తి కలిగినట్లయింది విసుగ్గానే, ఇంతకీ మీ యజమాని అనేదేమిటీ?" అనడిగింది.

రమకు కలిగిన ఈ చికాకును భజువాకూడా తేలిగ్గానే పసిగట్టాడు. తన శక్తికొద్దీ ప్రయత్నించి తన గొంతును సాధ్యమైనంత వినయపూర్వకంగా మార్చి, తిరిగి మొదట చెప్పిన మాటనే వల్లించాడు.

కాని యిప్పుడు ప్రయోజనం ఏమిటి? అసలు చేపలన్నీ యింతకు ముందే పంపకం జరిగినయ్ అందులో కొన్ని వాళ్ళూ వీళ్ళూకూడా తీసుకుపోయారు. వీటన్నిటికంటే మరో గట్టిచిక్కును రమ ఎదుర్కో-నవలసి వచ్చింది. ఇంతమంది జనం మధ్య తను రమేష్‌పట్ల ఏ కొంచెం లోబడినట్టు వ్యవహరించినా, లోకులు తనను చాలా హీనదృష్టితో చూస్తారు. ఆ బాధను తను భరించలేదు. అందుచేత మనసు

లో లేని కఠినత్వాన్ని ప్రదర్శిస్తూ; "మీ యజమానికి ఇందులో వాటాగీటా ఏమీ లేదు అని చెప్పు! కావాలంటే ఆయన యిష్టమొచ్చినట్లు చేసుకోమను!" అని అన్నది.

"సరేనమ్మా! అట్లాగే!" అని భజువా మళ్ళీ ఆమెకు వంగి నమస్కారం చేశాడు. ఆతర్వాత వేణీ నాకన్న 'యిక పో' అన్నట్లు సంజ్ఞచేసి; తనుకూడా వెళ్ళడానికి వెనక్కు తిరిగాడు, కాని అంతలోనే మళ్ళీ వెనక్కు తిరిగి, రమ నుద్దేశించి, రసవిహీనమైన తన భాషకూ, స్వరానికీ ఆమెను క్షమాపణ చెప్పి, "అమ్మా! మా బాబుగారు ఎవరి మాటలోవిని; ఈ చేపల వాటాకోసం నన్ను పంపించారు. కాని, మా బాబుగారుగానీ - కనీసం నేనుగానీ చేపలు మాంసం తినేవాళ్ళం కాదమ్మా. కానీ..." అని ఒకక్షణం ఆగి తన గుండెలమీద సగర్వంగా కొట్టుకుంటూ, "బాబుగారి మాట కోసరం, అవసరమైతే నా ప్రాణాలను ఆ చెరువు ఒడ్డునే పెట్టేవాణ్ని! ఏం లాభం! ఆ రాముడే అడ్డుకున్నాడు, మా బాబుగారి కోపంకాస్తా తగ్గిపోయింది. ఆయన నన్ను పిలిచి; "భజువా అసలు మనకు అందులో వాటావుందో లేదో కనుక్కురారా!" అని చెప్పారు! అన్నాడు

ఆతర్వాత మరింత వినయంగా లాంఛనసహా మళ్ళీ రెండు చేతులూ జోడించి, రమకు నమస్కరించి; "ఇతరులు ఎన్ని అన్నప్పటికీ అమ్మగారు మాత్రం అబద్ధం చెప్పరని, యితరుల సొత్తుకోసరం చెయ్యిచాపరని మా అయ్యగారే చెప్పారు." అని అంటూనే ఆ గుంపులోనుంచి భజువా బయటికి వెళ్ళిపోయాడు.

వాడు అటు వెళ్ళీవెళ్ళగానే వేణీ కడబట్టిపోయిన ప్రాణాన్ని బిగపట్టుకుంటూ, "ఆఁ అఘోరించాడు! ఆస్థి కాపాడుకునే లక్షణాలేనా యివి? మీ అందరిముందూ ఇప్పుడే చెబుతున్నాగదా, ఇవాల్టినుంచి వాడికి ఈ చెరువులో చిల్లి గవ్వకూడా యివ్వను... వింటున్నావా రమా!" అని అకారణంగానే వికృతంగా నవ్వాడు.

రమ అతను చెప్పిన మాటలు ఒక్కటీ వినలేదు. "అమ్మగారు అబద్ధం చెప్పరనీ, యితరుల ఆస్తికోసరం చెయ్యి చాపరని" భజువా అన్నమాటలే ఆమె మనసులో ప్రతిధ్వనిస్తున్నాయ్. తరుణ వయస్కురాలైన రమ ముఖం ఆక్షణాన మరింత సౌందర్యంతో భాసించి నప్పటికీ - మరుక్షణంలోనే తెల్లగా పాలిపోయినట్లుయింది. శుష్కశ్వేత వదనాన్ని యితరులకు చూపిస్తూ అట్లా నిలబడటం ఆమెకు ఎంతో కష్టమనిపించింది. చీరెకొంగును ముఖంమీదికి మరింత ముందుకు లాక్కుని గిరుక్కున తిరిగి యింట్లోకి వెళ్ళిపోయింది.

# 8

"పెద్దమ్మా"

"ఎవరూ? రమేషా! రా నాయనా, లోపలికిరా!" అంటూనే విశ్వేశ్వరి అతనికోసరం ఆసనాన్ని ఏర్పాటు చేసింది. ఇంట్లోకి అడుగుపెట్టగానే రమేష్‌కు ఆశ్చర్యం

కలిగింది. పెద్దమ్మ ప్రక్కనే మరొక ఆమె ఎవరో కూర్చు న్నారు. ఆమె ముఖం స్పష్టంగా కనిపించకపోయినా, ఆమె రమ అయివుంటుందని అతను వూహించాడు. కాని మరుక్షణం లోనే ఆమెపట్ల ఏహ్యాభావం కలిగింది. ఎందుచేతనంటే; ఈమె పేణీ యిద్దరూకూడా పిన్నిని శిఖండిగా పెట్టుకుని పెద్దమ్మను అప్పుడప్పుడు అవమానిస్తూనేవుంటారు. ఇనప్పటికి సిగ్గూలజ్జా లేకుండా మళ్ళీ యిట్లా దగ్గరగా చేయకూవుంటారు కూడాను. అందుకే అతనికి ఏహ్యాభావం గలిగింది.

ఇప్పుడు అకస్మాత్తుగా రమేష్ రావడంతో రమ చిక్కులో పడ్డట్లయింది. ఆమె కేవలం యీవూరి పిల్లేతప్ప మరొకటికాదు. ఇనప్పటికీ ఆమెకూ రమేష్‌కూ మధ్య అనిర్వ చనీయమైన బాంధవ్యం ఒకటుంది. ఏమీ ఎరుగనిదానిలా ముఖం కప్పుకున్నా తప్పే; పూర్తిగా ఎరిగినదానిలా కప్పు కోకపోయినా తప్పే! ఏం చేసినా తన అంతరాత్మకు శాంతి లేదు. ఆనాడు చేపలకోసరం జరిగిన గలాభాసంగతి వేరు. ఈ కారణాలవల్ల రమ సాధ్యమైనంతవరకు విశ్వేశ్వరిని చాటుచేసుకుని కూర్చుంది. రమేష్‌మాత్రం రెండోసారి ఆమె కేసి అసలు చూడనేలేదు.

పెద్దమ్మ కుర్చీ వేసింది; తను నిరభ్యంతరంగా "పెద్దమ్మా!" అంటూ కూర్చున్నాడు; అంతే!

"మిట్టమధ్యాహ్నం వేళ వొచ్చావేం నాయనా?" అనడిగింది విశ్వేశ్వరి.

"ఇలాంటి సమయంలోనే నీకు కాస్త తీరిగ్గా వుంటుందని, నీతో తాపీగా మాట్లాడే అవకాశం వుంటుందని వచ్చాను!" అన్నాడు రమేష్.

ప్రత్యుత్తరంగా పెద్దమ్మ నవ్వి వూరుకుంది.

రమేష్‌కూడా అట్లాగే స్వల్పంగా నవ్వుతూ "చాలా కాలం క్రితం నా చిన్నతనంలో ఒకనాడు నీతో చెప్పిపోవడానికి యిట్లాగే వచ్చాను. ఇప్పుడుకూడా అట్లాగే నీతో చెప్పి వెళ్ళిపోద్దామని వచ్చాను. కాని బహుశా నేను నిన్ను చూడగలగడం యిదే చివరిసారి అనుకుంటాను" అన్నాడు. రమేష్ నవ్వుతూనే అన్నప్పటికీ అతని స్వరంలో మాత్రం అనిర్వచనీయమైన వేదన స్పష్టంగానే వినిపించింది. ఆ గొంతువిని యిద్దరూ ఆశ్చర్యపడ్డారు. "ఛి-ఛీ అవేం మాటలు నాయనా!" అన్నది విశ్వేశ్వరి. ఆమె కళ్ళల్లో ఆ క్షణాన నీరు నిండింది.

రమేష్ కేవలం నవ్వి వూరుకున్నాడు.

విశ్వేశ్వరి మరింత ఆదరంగా "నీ ఆరోగ్యం బావున్నట్టేనా?" అనడిగింది.

రమేషు తన విశాలమైన వక్షస్థలాన్ని, బలిష్ఠమైన భుజాల్ని మరోసారి అనవసరంగానే చూసుకుని, "నా ఆరోగ్యం బాగానేవుంది పెద్దమ్మా! ఈ పశ్చిమప్రాంతపు తిండి తినీతినీ కాస్త బలంవొచ్చినట్టేవుంది. కాని యీ ప్రాంతంలో యిక క్షణంకూడా వుండటానికి అంతరాత్మ అంగీకరించడం లేదు" అన్నాడు.

శరీర ఆరోగ్యాన్నిగురించి విన్నతరువాత విశ్వేశ్వరి మనసు కుదుటపడ్డట్లయింది. చిన్నగా నవ్వుతూ "నాయనా యిది నీ జన్మస్థలంగదా, యిక్కడ వుండడానికే నీ మనసు అంగీకరించడంలేదా ?" అనడిగింది.

రమేషు తల అడ్డంగా తిప్పుతూ "అన్ని సంగతులూ నాచేతనే ఎందుకు చెప్పిస్తావు పెద్దమ్మా; నీకు తెలియదూ?" అన్నాడు.

ఒక్కక్షణం విశ్వేశ్వరి మెదలకుండా వూరుకుని "అన్ని సంగతులూ నాకుమాత్రం ఏంతెలుసు? ఐనా స్వంతవూరు వొదిలిపెట్టి పోయినంతమాత్రాన సుఖం లభిస్తుందన్న నమ్మకం ఏమిటీ ?" అంది విశ్వేశ్వరి.

"ఎందుకు లభించదు? అయినా నాకుమాత్రం యిక్కడ ఎవరున్నారు ?"

"ఎవరూ లేరా? అందుకని పారిపోతావా? ఈ ప్రాంతపు తిండివల్ల ఎంతో కొంత బలం వచ్చిందంటున్నావే; అది పారిపోవడానికేనా ?"

రమేషు మాట్లాడలేదు. అతని మనసులో యీ వూరినిగురించి యింత విరక్తి పుట్టడానికి ఒక కారణంవుంది. ఈ వూరినుంచి స్టేషన్కు వెళ్లేందుకు ఒక రోడ్డువుంది. అది కాస్తా పది పన్నెండేళ్ళక్రితం వర్షాకాలపు వరదలకు కొట్టుకు పోయింది. అప్పుడు ఏర్పడ్డ గోతులు క్రమంగా పెరిగి పెద్దవై అన్ని కాలాల్లోనూ నీళ్ళు నిలిచి ప్రయాణాలకు ఎంతో బాధా కరంగా పరిణమించినయ్. గ్రామస్థులు అలాగే కాలం గడిపే స్తున్నారు. సరిగ్గా వర్షాకాలం వచ్చిందంటే యిక ఆ రోడ్డు

మీాద ప్రయాణంసంగతి చెప్పనే అవసరంలేదు. మొలలోతు నీళ్ళల్లో బట్టలు పైకి ఎగబట్టుకుని యీావైపునుంచి ఆవైపుకు పోవాల్సిందేతప్ప, మరో మార్గంలేదు. కొన్నికొన్ని సమయాల్లో తాత్కాలికంగా వెదురుగడలతో వంతెనగా ఏర్పాటు చేసుకోవడం; మరోసారి తాటిబద్దల సాయంతోనూ ప్రయాణాలు కొనసాగిస్తుంటారు. ఈ విధంగా అవస్థలు పడుతున్నారేతప్ప ఆ రోడ్డు మరమ్మత్తు చేసుకుందామన్న ప్రయత్నమే వాళ్ళలో కనిపించడంలేదు. మరమ్మత్తులకు ఎంతో కొంత ఖర్చుఅవుతుంది కనుక, ఆ డబ్బును చందాలరూపంలో వసూలుచేద్దామని రమేషు ప్రయత్నించాడు. వారం పది రోజులు దీనికోసరం ప్రయత్నిస్తే పట్టుమని పదిఅణాలుకూడా వసూలుకాలేదు. కాకపోతే పోని, అది అంతటితో ముగిసినా అతను బాధపడేవాడు కాదు. కాని యీా విషయాన్ని ఆధారం చేసుకుని యివాళ వుదయం చిల్లరకొట్టుదగ్గర జరిగిన సంభాషణ స్వయంగా విన్నాడు. ఈ విషయాన్ని వాళ్ళు ఎంతో హేళనగా వ్యాఖ్యానిస్తూ "ఎవ్వడూ ఒక్క దమ్మిడీ కూడా చందా యివ్వకండి. ఆయన యిదేమన్నా పరోపకార బుద్ధితో చేద్దామనుకుంటున్నాడా? ఆయనకున్న స్వార్థం ఆయన కుంది. ఇంచక్కా చెప్పులేసుకుని షోగ్గా తిరగాలని ఆయనే వుబలాటపడుతున్నప్పుడు ఆ మరమ్మతు ఖర్చులేవో ఆయనే పెట్టుకుంటాడు. మనకెందుకూ ?" అన్నాడు ఎవడో.

అయినా మరమ్మతులతో పనిలేకుండానే పని జరిగి పోతున్నపుడు యింక యీా ఖర్చులెందుకూ! అంతగా ఆయ

నకు కోపంవొస్తే అసలు మనం స్టేషన్ కేపోవద్దు!" అన్నాడు మరొకడు.

"వుండండి, కాస్త ఆగండి. ఛటర్జీమహాశయుడు అన్నట్టు రమేశ్ నెత్తిన చెయ్యిపెట్టి శీతలాపూయీ యిల్లు కాస్త సరిచెయ్యాలి! ఒకటి నాలుగుసార్లు 'బాబూ, బాబూ' అంటేచాలు. వాడే ఉబ్బిపోతాడు?" అన్నాడు మరొకడు ఎవడో!

ఈ మాట చెవినపడ్డ దగ్గర్నుంచీ అతనికెంతో అసహ్యమూ, విరక్తీ కలిగింది. వూరు వూరంతా ఒకదారీ, తనొక్కడూ ఒకదారీ ఐపోయినట్లయింది.

పెద్దమ్మకూడా తనకు తెలియకుండానే ఆ గాయం మీదే మరోదెబ్బ కొట్టింది. మరోక్షణం తర్వాత, "మరి ఆ వంతెన ఏదో మరమ్మత్తు చేయిస్తానంటివిగదా, దాని సంగతేమైందీ?" అనడిగింది.

"లేదు, ఆపని పూర్తికాలేదు." అన్నాడు రమేష్ విరక్తిగా. "ఎవ్వడూ చిల్లిగవ్వకూడా యివ్వడానికి యిష్టపడటం లేదు.

విశ్వేశ్వరి నవ్వుతూనే; ఇతరులు యిస్తేనేం యివ్వకపోతేనేం? మీనాన్న చాలా ఆస్థి ఇచ్చిపోయాడుగదా, పోని ఏదో పంకో ఖర్చు పెడితేనేం?"

ఈ మాట అగ్నిలో ఆజ్యం పోసినట్టు అయింది. రమేశ్ మండిపోతూ; "ఏం, నే నెందుకు ఖర్చు పెట్టాలీ? తెలిసీ తెలియక వూళ్ళోవాళ్ళ బడి కోసరం యిప్పటికి నేను పెట్టిన ఖర్చే అనవసరమను కుంటున్నాను. వూరివాళ్ళకు ఏమాత్రం

బాధ్యతలు లేనప్పుడు నేను మాత్రం ఇవన్నీ నెత్తిన ఎందుకు వేసుకోవాలి?" రమను చూస్తూ... "వీళ్ళకు ఏ కొంచెమైనా సాయంచేస్తే, మూర్ఖుడుగా భావిస్తారు. వాళ్ళ శ్రేయస్సును కోరితే స్వార్థం అంటారు! ఇహ క్షమించడం మహాపాపం! క్షమిస్తే పిరికిపంద అంటారు!" ఈ మాటలు విని విశ్వేశ్వరి పగలబడి నవ్వింది; కాని రమ ముఖం మాత్రం కందిపోయింది.

రమేష్ కుపితుడై, "నవ్వుతున్నావా పెద్దమ్మా!" అన్నాడు.

"నవ్వక ఏంచేసేది నాయనా!" అని విశ్వేశ్వరి దీర్ఘంగా నిట్టూర్చి; "పైగా నువ్వు మళ్ళీ అందరికీ కావాలి! కాని రమేష్‌బాబూ ఒక్క సంగతి చెప్పనా?... అనవసరంగా కోపం తెచ్చుకుని జన్మభూమిని పరిత్యజించడం మంచిదా? పోనీ నువ్వు నిజంచెప్పు, నీకోపం ఎవరిమీద?" అని మరో క్షణం ఆగి తనలోతాను అనుకుంటున్నట్టుగా, "ఓహో! నిజంగా ఈ గ్రామీణులు, ఎంత అమాయకులు ఎంత దుర్బలులు, ఎంత దుఃఖితులోగదా! వీళ్ళనుచూసి జాలిపడడానికి బదులు కోపగించు కుంటున్నావా? తప్పు నాయనా! భగవంతుడు నీకు ఈ సమాజంలో కావాలనే జీవితాన్నిచ్చాడు. వీళ్ళల్లో పుట్టినవాడివి, వీళ్ళతో నే జీవించడంకూడా నేర్చుకో!" అంది విశ్వేశ్వరి.

"కాని వీళ్ళకు నా అవసరంలేదు పెద్దమ్మా! ఆ సంగతి నువ్వు పట్టించుకోవడంలేదు! అన్నాడు రమేష్.

"అదే నువ్వు అర్థం చేసుకోవాలి నాయనా! వాళ్ళను నువ్వు కోపగించు కున్నందువల్ల వాళ్ళు నీకు అర్థంకారు!

అజ్ఞానులు, అమాయకులైన ప్రజలపట్ల నువ్వు విరక్తిని ప్రదర్శిస్తే దానివల్ల ప్రయోజనం శూన్యం. నేను కేవలం ఈ వూరి ప్రజల సంగతే చెప్పడంలేదు; దాదాపు అన్ని గ్రామాల పరిస్థితులూ అట్లాగే వున్నాయ్." మరోక్షణం తర్వాత రమనుద్దేశించి; "రమా! ఏమిటి తలవొంచుకు కూర్చోవడం? అవును నాయనా రమేష్‌బాబూ, నాకు తెలియక అడుగుతాను; మీ యిద్దరి మధ్యా మాట్లాడుకోవడం అంటూ ఇక వుండదా ఏం? మీ ఉభయ పక్షాల్లోనూ ఏదో గతంలో పెద్దవాళ్ళు తగాదాలు పడ్డారని; ఆ ద్వేషాల అసూయలకూ మీరూ వారసులు కావాలా? తప్పు నాయనా, జరిగిందేదో జరిగిపోయింది. కనీసం మీతరంలోనైనా కలిసి మెలిసి వుండడం నేర్చుకోండి!" అంది విశ్వేశ్వరి.

రమ సిగ్గుతో తలను మరింత క్రిందికి వాల్చుకుని, నెమ్మదిగా, "నా మనసులో అలాంటి దురభిప్రాయాలేవీ లేవు పెద్దమ్మా... ఆయనే..." అని ఆగిపోయింది.

కాని రమేష్ మాత్రం ఉద్రేకపూరితంగానే "పెద్దమ్మా మా ఇద్దరి మధ్యా నువ్వు జోక్యం కలిగించుకోకు. అది నాకిష్టమైన విషయం కాదు" అన్నాడు అకస్మాత్తుగా. "ఇదివరకు ఓసారి వీళ్ళ పిన్నిచేతనేగా నిన్ను అవమానించింది. మళ్ళీ యివ్వాళ యింటికిపోగానే వాళ్ళ పిన్నిని నీమీాదకు పంపకం చేస్తుంది. ఈ సంగతి తెలిసిందంటే ఆవిడ నిన్ను నిలువునా చీల్చుకు తినగలదు!" అన్నాడు రమేష్. ఆ మాట అనేసి తిరిగి జవాబు కూడా వినకుండానే బయటికి వెళ్ళిపోయాడు. వెంటనే విశ్వేశ్వరి అతన్నుద్దేశించి; "వెళ్ళకు

నాయనా రమేశ్, నామాట ఒక్కటే వినిపో!" అని గట్టిగానే అరిచి చెప్పింది. రమేశ్ గుమ్మందాటుతూ, "అహంభావంతో నిన్ను సైతం ధిక్కరించే వాళ్ళను నువ్వు సమర్థించకు." అన్నాడు.

విశ్వేశ్వరి పిలుస్తూనే వున్నప్పటికీ రమేశ్ వెళ్ళిపోయాడు. ఆమాట రమకు చాలా బాధ కలిగించింది. కొన్ని క్షణాలవరకు అసహాయంగా విశ్వేశ్వరి ముఖం చూస్తూ కూర్చుంది లోపల దుఃఖం పరువళ్ళు త్రొక్కుతున్నది. ఇహ భరించలేక బిగ్గరగానే ఏడుస్తూ, పెద్దమ్మా, అందరూ నాకీ కళంకాన్ని ఎందుకు అంటగడతారో నాకు తెలియదు. పిన్ని చేసే అర్థరహితమైన పనులన్నిటికీ నేనా బాధ్యురాలిని?"

విశ్వేశ్వరి కమలాలవంటి కోమలమైన రమ చేతుల్ని తన చేతుల్లోనికి తీసుకొని ఓదారుస్తూ; "నిజమే తల్లీ ఆ మాట నిజమే! కాని, మీ పిన్ని చేతల్ని నువ్వు సమర్థించక పోయినా; దాని తాలూకు బాధ్యత మాత్రం ఎంతో కొంత నీకూ వుంటుంది." అన్నది.

రమ తన చీరె చెంగుతో కళ్ళు తుడుచుకుని, "లేదు పెద్దమ్మా, అసలు నాకు ఏమీ తెలియదు. అకారణంగానే ఆయన నా మీద ఈ అపవాదు వేసిపోయారు!" అన్నది.

విశ్వేశ్వరి ఇక ఈ విషయాన్ని గురించి చర్చించలేదు. ఆ తరువాత సాధారణమైన ధోరణిలోనే మాట్లాడుతూ, "రమా, ఒక్క సంగతి చెబుతావిను; అందరూ యదార్థాన్ని గుర్తించలేరు. నిజానికి రమేష్ నిన్ను అవమానించాలన్న ఉద్దేశ్యంతో మాత్రం ఆ మాట అనలేదు. నాకా నమ్మకం

వుంది. అంతేగాక అతనికి నువ్వంటే ఎంతో అభిమానమూ, ఆపేక్షా, నమ్మకమూ వుంది. ఈ సంగతి గోపాల్‌సర్కార్ ద్వారా నేను తెలుసుకున్నాను. ఆరోజున చింతచెట్లు కొట్టించి నువ్వూ, వేణీ యిద్దరూ రెండువాటాలుగా పంచుకున్నపుడు, రమేష్ చెప్పిందుమాటలు వినికూడా అతనేమీ తొందరపడలేదు. సరిగదా అతను మరింత నిశ్చింతగా, "రమ వున్నంతవరకూ నా వాటాతాలూకు ఏ ఆస్తీ ఎక్కడికీ పోదు. నాకు రావలసినంతవరకూ ఆమే నాకు అప్పగిస్తుంది! రమ ఎన్నడూ యితరుల ఆస్తికి చెయ్యిచాపదు!" అని అన్నాడట. నిజంగా నీమీద అతనికా నమ్మకమూ, విశ్వాసమూ లేకపోతే ఆ మాట అనగలిగేవాడా? మీ రెండు కుటుంబాల మధ్యా అంత తీవ్రమైన స్పర్థలు ఏర్పడినప్పటికీకూడా, ఆయన మనసులో నీమీద ఆ నమ్మకం వున్నదంటే... అదేమంత స్వల్పవిషయమా? ఒకవేళ ఆమాటే నిజం కాకపోయినట్లయితే, ఆనాడే చేపల్లో తన వాటాకోసరం..."

మాట సగంలోనే ఆపి విశ్వేశ్వరి స్తంభించిపోయింది. కొద్ది క్షణాలవరకూ సిగ్గుతో పాలిపోయిన రమ ముఖాన్ని చూస్తూ, ఆ తర్వాత రమ నుద్దేశించి "ఒక్క మాటచెప్పనా! ఆస్తిపాస్తులు సంరక్షించుకోవడం గొప్పసంగతేకాని, అంతకంటే గొప్పసంగతి మరొకటుంది. అది రమేష్ జీవితరక్షణ! ఆ జీవితాన్ని రక్షించుకోవడం యితరులకంటే నీకు చాలా ముఖ్యం! ఇతరుల మాటల్లోనూ భ్రమలోనూపడి ఏ క్షణానైనా మీరు ఆ ప్రాణిని పోగొట్టుకున్నారో... ఆ తర్వాత మీ దుఃఖానికి అంతమే వుండదు. నలుగురూ నాలుగు

వైపులా కమ్ముకుని ఆ ప్రాణిని హింసించి అంతం చేసుకుంటే దానివల్ల కలిగే అనర్థాలకు మీరే బాధ్యులవుతారు. ఆ జీవితం అంతరించిపోవడంవల్ల మీకూ దేశానికికూడా తీరని నష్టమే అవుతుంది; యిది నిజం!" అన్నది విశ్వేశ్వరి దృఢంగా.

రమ స్థిరంగా, శాంతంగా, అచంచలంగా కూర్చుని విశ్వేశ్వరి చెప్పిన అన్నిమాటలూ శ్రద్ధగా విన్నది. ఒక్క మాటకుకూడా ఎదురు చెప్పలేదు. ఆ తర్వాత విశ్వేశ్వరి కూడా అధికంగా ఏమీ చెప్పలేదు. మరి కాస్సేపటికి రమ నెమ్మదిగా "చాలా వేళ అయినట్లుంది, యికనే వెళ్ళనా?" అనడిగింది.

విశ్వేశ్వరి పాదధూళి రమ తన తలపై అద్దుకుని నెమ్మదిగా వెళ్ళిపోయింది.

# 9

రమేషుకు ఎంత కోపంగా వున్నా, యింటికి చేరడం తోనే క్రమంగా ఆ కోపంఅంతా చల్లారిపోయింది. తనలో తానే ఆలోచించుకోవడం ప్రారంభించాడు ఇంత స్వల్పమైన స్పష్టమైన విషయాన్నికూడా నే నెందుకు అర్థంచేసుకోలేక పోతున్నాను? అసలు నేను ఎవరిమీద కోపగించుకుంటు న్నాను? తనచుట్టూవున్న సమాజం నిజానికి ఎలాం

టిది! అజ్ఞానంవల్ల తమ శ్రేయస్సును తామే గుర్తించలేని మూఢసమాజం! అక్షరజ్ఞానం లేని సమాజం! పొరుగువాడి దౌర్భాగ్యమే తన భాగ్యంగా భావించే సమాజం! తమ శ్రేయస్సు కోరేవాళ్ళను శంకించే ప్రవృత్తి గలవాళ్ళు. ఇలాంటి అజానులూ మూఢులను ద్వేషించడం నిజానికి ఎంత మూర్ఖత్వం? ఎంత విచిత్రమైన భ్రమ. తను చదువుకునే రోజుల్లో గ్రామీణ జీవితాన్నిగురించి ఎన్నెన్ని పుస్తకాలు చదివాడు; ఎన్నెన్ని విచిత్రమైన కలలుకన్నాడు! అవన్నీ కేవలం మిథ్యేనా! అవన్నీ నిజమైనా కాకపోయినా; తన హిందూజాతిలో ఒక విశిష్టమైన శాంతిప్రియత్వం వున్నదనే విషయంమాత్రం నిజం. అది కేవలం గ్రామీణుల్లోనూ, గ్రామీణజీవితంలోనే లభ్యమౌతోందికాని, పట్టణాల్లో మాత్రం పూజ్యం. ఉన్నంతలో తృప్తిగా జీవితాన్ని గడపడం యితరుల కష్టసుఖాల్లో పాలు పంచుకోవాలన్న సహృదయత్వం, గ్రామీణ ప్రజాహృదయాల్లోనే తప్ప అన్యత్ర దుర్లభం! విశిష్టమైన హిందూజాతిలో యిలాంటి సద్గుణాలన్నీ నిక్షిప్తమై వున్నాయనీ; అది కేవలం గ్రామీణజీవితంలోనే లభ్యమౌతుందనీ యింతకాలంగా భావిస్తూవొచ్చాడు...కాని ఓహో, అదంతా ఎంత విచిత్రమైన భ్రమ. సిద్ధాంతవిషయాలు చదివి అర్థంచేసుకోడానికీ, వాస్తవిక జీవితాన్ని ప్రత్యక్షంగా అనుభవించడానికీ ఎంత వ్యత్యాసం వుంది! ఈనాటి గ్రామీణ జీవితంలోని యింత అసంబద్ధము, అనూహ్యము ఐనటువంటి విషయాలు ఎందుకూ పనికిమాలిన పట్టణాల్లోకూడా బహుశా కనిపించవేమో! పొరుగువాడి సుఖశాంతులనుచూసి

యింత అసహనాన్ని పట్టణాల్లో తనెక్కడా చూడలేదు. యాదృచ్ఛికంగా నగరజీవితంలో ఎక్కడైనా ఏదైనా అసంబద్ధమూ, హేయమూ ఐన దృశ్యాలు కనిపించినప్పుడల్లా, తన జన్మభూమీ, గ్రామీణజీవితమూ జ్ఞప్తికొచ్చేవి. నగరాల్లోని హేయమైన జీవితం గ్రామీణ ప్రాంతాల్లో వుండదనీ ఎంతో ప్రశాంతంగా నిర్మలంగా జీవించవచ్చనీ కలలుగనేవాడు! గ్రామీణజీవితంలో ఏది లభించినా లభించకపోయినా సమాదరణీయమైన ధర్మమూ, సత్యమూ పిలసిల్లుతుంటుందని విశ్వసించేవాడు. కాని...ఓరి భగవంతుడా!...'సత్యం' కాదు గదా, కనీసం దాని తాలూకు 'శవం' ఐనా యీనాటి గ్రామీణ జీవితంలో కనిపించడంలేదు. "సత్యం" అంతరించి యీ నిర్జీవ మానవసమాజం శవప్రాయంగానే జీవిస్తున్నది! శవప్రాయమైన సత్యాన్నే పట్టుకు వ్రేళ్ళాడుతున్నది. ఆ శవం వాళ్ళను మరింత అధోగతికే ఈడ్చుకుపోతున్నది. అన్నిటికంటే విచిత్రమైనదీ, విషాదకరమైన సంగతేమిటంటే యింత అధోగతి పాలైపోతున్న వీళ్ళు...నగరవాసులను జాతి భ్రష్టలనీ, ధర్మభ్రష్టలనీ నిందించడం!

ఇంట్లోకి అడుగుపెట్టడంతోనే వరండాలో ఆ చివరగా ఒకామె ఒక పిల్లవాణ్ణి దగ్గరపెట్టుకుని కూర్చునివుంది. యిద మాని రావడంతోనే ఆమె లేచి నిలబడింది ఆవిడ కాస్త మధ్యవయస్కురాలే! ఆ పిల్లవాడికి పది పన్నెండేళ్ళుంటాయేమో! అంతగా స్పష్టమైన పరిచయం లేకపోయినా; ఆ పిల్లవాడి దీనవదనాన్ని చూసేసరికి రమేష్‌కు ఎందుకో చెప్పలేనంత దుఃఖం కలిగింది. గుమాస్తా గోపాల్‌సర్కార్ వరం

డాకు ఆ చివరగా కూర్చుని ఏదో వ్రాసుకుంటున్నాడు. యజమానిని చూడడంతోనే లేచివచ్చి "బాబూ! వీళ్ళు యీ వూరివాళ్ళే! ఊరికి దక్షిణపు వేపున వుంటున్నారు. ఈ పిల్లవాడు ద్వారకా ఠాగూర్ కొడుకు. భిక్షకోసరం మీ దగ్గరకు వొచ్చాడు" అని చెప్పాడు.

భిక్ష మాట వినపడేసరికి రమేషుకు కాస్త చిరాకు కలిగింది. కాస్త చిరాగ్గానే "ఏం నేను అందరికీ దానాలు చెయ్యడానికే యింటికొచ్చానా, ఏం! వూళ్ళో యింకెవరూ లేరూ?" అని అన్నాడు.

గోపాల్‌సర్కార్ మరింత వినయంగా "ఆ మాట నిజమే బాబూ! కాని, యాచకులను వొట్టిచేతుల్తో త్రిప్పి పంపడం యీ యింటి సంప్రదాయం కాదు! అంచేత ఎవరికైనా ఏ కష్టమొచ్చినా యీ గుమ్మంముందు కొస్తుంటారు" అన్నాడు

మరో క్షణంతర్వాత పిల్లవాణ్ణిచూస్తూ ప్రౌఢయువతినుద్దేశించి "చూడు కామినితల్లీ: నే నొక్క సంగతి చెబుతాను వీళ్ళు ఏమంత తక్కువ తిన్నవాళ్ళేమీ కాదు. ఆయన బతికివుండగా ప్రాయశ్చిత్తం చేసుకోనేలేదు. ఇవాళ శవం యింటిముందు పడివుండేసరికి, డబ్బుకోసరం యింటింటికీ పరుగులు పెడతారు...నాకు తెలియక అడుగుతాను...అసలు యింట్లో చెంబూ గిన్నెకూడా లేవాఏం?" అనడిగాడు గోపాల్ సర్కార్.

కామినీతల్లి కులానికి గొల్లది. ఈ పిల్లవాడికి పొరుగు ఆవిడ! ఆవిడ తల అడ్డంగా తిప్పి పెదవి విరుస్తూ "నా మాట

మీద నమ్మకం లేకపోతే...పోనీ మీరే ఒకసారి వచ్చి చూడండి, ఇట్లో చెంబూ-గిన్నీ ఏదైనావుంటే మా నాన్నను వొదిలిపెట్టి యింత దూరంవచ్చే పనేముంటుంది? చూడకపోయినా అసలుసంగతి అందరికీ తెలుసు! పోయిన ఆరు నెలల్నుంచి, మా సంపాదనంతా వీళ్ళ కుటుంబం పోషించడానికే సరిపోయింది పొరుగువాళ్ళు; బ్రాహ్మణ జాతి...చూస్తూచూస్తూ బ్రాహ్మణబిడ్డలు ఆకలితో అలమటిస్తుంటే, ఎట్లా వూరుకోగలం?" అని చెప్పింది.

ఈ మాటల ఆధారంతో రమేషు పరిస్థితిని క్షుణ్ణంగా వూహించాడు. ఇంతలో గోపాల్‌సర్కార్ కల్పించుకుని, "చినబాబూ! ద్వారకా చక్రవర్తి గత ఆరుమాసాలనుంచీ మంచాన పడేవున్నాడు. అందులోనూ వుబ్బసపు రోగం. ఇవాళ వుదయమే చచ్చిపోయాడు. అతను ప్రాయశ్చిత్తం చేసుకోలేదు. అంచేత శవాన్ని ముట్టుకోడానికి ఎవరూ ముందుకు రావడంలేదు. వెంటనే ప్రాయశ్చిత్తం జరిగితేనేతప్ప, అంత్యక్రియలు జరపడానికి అవకాశంలేదు. కామినీతల్లే పోయిన ఆరునెలల్నుంచీ తనదగ్గరున్న చివరిపైసాతోసహా ఆ కుటుంబంకోసరం ఖర్చుపెట్టింది. ఇప్పుడు ఆమెదగ్గరకూడా ఏమీ డబ్బులేదు. అంచేతనే వాళ్ళ పిల్లవాణ్ణి వెంటబెట్టుకుని మీ దగ్గరకు తీసుకొచ్చింది" అని వివరించి చెప్పాడు.

రమేషు కాస్సేపు నిశ్శబ్దంగా వుండి "ఇప్పుడు సుమారు రెండుగంట లయిందనుకుంటాను. శవానికి ప్రాయశ్చిత్తం జరక్కపోతే...అది అలాగే వుండిపోతుందా?" అనడిగాడు.

గుమాస్తా నవ్వి "మరి గత్యంతరం ఏముంది బాబూ? జరగవలసింది శాస్త్రానుసారంగా జరగవలసిం గదా! ఇందులో గ్రామస్థుల దోషం ఏముంది? శవం యింట్లోవున్నా ఎక్కడున్నా జరగవలసిన పని జరగవలసిందేగదా! అందుకే భిక్షకోసరం బయల్దేరారు...సరే కానీ...కామినీతల్లీ, మీరు సరాసరి యిక్కడికే వొచ్చారా, యింకెక్కడికైనా వెళ్లారా?" అనడిగాడు గోపాల్ సర్కార్.

కుర్రవాడు పిడికిలి విప్పి అరచేతిలో ఒక పావలా బిళ్ళను, మరోనాలుగు పైసలును చూపెట్టాడు.

"పావలా బిళ్ళ ముఖర్జీగారి ఇంట్లో యిచ్చారు. మిగిలిన నాలుగుపైసలు హాల్దారుబాబు యిచ్చారు. ఇంకా కనీసం రెండుబావలా ఐనా వుంటేగాని పనులు జరగవు" అని చెప్పింది కామినీ తల్లి. "చినబాబుగారు దయతలిస్తే..."అని అంటుండగానే మధ్యలోనే రమేష్ అందుకొని, "సరే అబ్బాయ్; తిన్నగా నువ్వు యింటికి వెళ్ళిపో! యింకెక్కడికీ వెళ్ళకు. మిగతా ఏర్పాట్లన్నీ నేచూస్తాను." అని చెప్పాడు. వాళ్ళి ద్దర్నీ పంపించి వ్యథిత హృదయంలో గుమాస్తా నుద్దేశించి "సర్కార్ మహాశయా! ఈ వూళ్లో ఇలాంటి పేదవాళ్ళు యింకెంతమంది వుంటారో మీకు తెలుసా?" అనడిగాడు రమేష్.

ఇంకా రెండుమూడు కుటుంబాలు మాత్రమే వుంటాయండి! కాని వాళ్ళకూ ఒకప్పుడు తినడానికి యింత తిండి గింజల ఆధారం అంటూ వుండేదే! కాని ఒకచెట్టును గురించి ద్వారకా చక్రవర్తికీ; సనాతన హాజరాకు మధ్య రమారమి

ఐదేళ్ళపాటు ఒక దావా జరిగింది. ఆ దావాలో యిద్దరూ చప్పగా చల్లారిపోయారు; సర్వభ్రష్టులై పోయారు." అని గోపాల్ సర్కార్ గొంతు సవరించుకుని, "ఆ వ్యవహారం అసలు అంతవరకూ పెరిగేదేకాదు; కాని ఒకవైపున మీఅన్న గారూ, మరోవైపున గోవిందగంగూలీ చేరి ఆ రెండు కొంపల్నీ అట్లా భ్రష్టం చేశారు" అన్నాడు.

"ఆ తరువాత ఏమైంది?" అనడిగాడు రమేష్.

ఆ తరువాత పెదబాబుగారు 'ఉచ్చు' లో వాళ్ళిద్దరూ యిరుక్కుపోయారు. క్రిందటి సంవత్సరమే చక్రవడ్డీలతో సహా లెక్కలుచూసి వాళ్ళిద్దరి ఆస్తి ఆయనే భుక్తం చేసుకున్నాడు. కాని కామినీ తల్లి నిజంగా రైతు కుటుంబపు బిడ్డ. అలాంటి విషమ పరిస్థితిలో ఆమె చూపిన ఉదారత ఎవ్వరూ మరిచి పోలేరు. ఈ విషయంలో ఆమెకు సాటిగా మరొకరిని మనం ఈ వూళ్లో చూడలేం." అన్నాడు గుమాస్తా.

రమేష్ దీర్ఘంగా నిట్టూర్చాడు. శవానికి అంత్య క్రియల ఏర్పాట్లు జరిపేందుకు గోపాల్ సర్కార్‌ను పంపించాడు. రమేశ్ తనలోతాను అనుకుంటున్నట్లుగా; "పెద్దమ్మా! ఇదిగో ఈ నాటినుంచే నీ ఆదేశాలను శిరసావహిస్తున్నాను. ఇక్కడ చావడానికైనా నాకిష్టమేగానీ, ఈ నిర్భాగ్యపు గ్రామాన్ని మాత్రం విడిచి ఎక్కడికీ వెళ్ళను" అని అనుకున్నాడు.

# 10

మూడు మాసాల తరువాత—

ఒక రోజు తెల్లవారుఝామున తారకేశ్వర్‌లోని చెరువు మెట్లమీద రమేష్‌కు ఎవరో ఒక తరుణి ఎదురు పడింది. ఆమెను చూసిన క్షణంలో రమేష్ పూర్తిగ ఆశ్చర్య పడ్డాడు. అతనికి ఎంత ఆశ్చర్యం కలిగిందంటే— ఆ క్షణాన అతను వివేకాన్ని పోగొట్టుకుని అసభ్య వ్యక్తిలాగా ఆమె ముఖాన్ని తదేకంగా చూస్తూ నిలబడ్డాడేగాని; ప్రక్కకు తప్పుకుని దారియివ్వాలన్న ఆలోచనే అతనికి కలగలేదు. తరుణి వయస్సు రమారమి ఇరవై ఏళ్ళ కంటే ఎక్కువ వుండదు. స్నానంచేసి మెట్లమీదనుంచి పైకి వస్తున్నది. రమేషును చూడ్డంతోనే చప్పున చంకలోని నీళ్ళబిందె మెట్టు మీద పెట్టి తన రెండు చేతుల్తోనూ వక్షస్థలాన్ని దాచిపెట్టు కోడానికి ప్రయత్నించింది. తడిబట్టలతో వున్న ఆమె ఎంత ప్రయత్నించిన తన సహజ సౌందర్యాన్ని దాచిపుచ్చలేక పోతున్నది. అలాగే తలవంచుకు నిలబడి మధుర స్వరంతో, "అరె! మీరెప్పుడొచ్చారు?" అనడిగింది.

రమేషు మరింత ఆశ్చర్యపడ్డాడు. అతను మళ్ళీ జాగ్ర దావస్థలోనికొచ్చి; దారి తప్పుకొని, "మీరు నన్ను ఎరుగుదురా?" అన్నాడు.

"అవును! మీరు తారకేశ్వర్ ఎప్పుడొచ్చారు?" అంది రమణి.

"ఇవాళే వచ్చాను. మా మామగారి యింటి దగ్గర్నుంచి కొంతమంది ఆడవాళ్ళు ఇక్కడకు రావలసివుంది. కాని వాళ్ళెవరూ యిక్కడ కనిపించడం లేదు!"

"ఈ వూళ్లో ఎక్కడున్నారు మీరు?" అనడిగింది రమణి.

"ఎక్కడో ఒకచోట. ఇదివరకు నేనెప్పుడూ ఈ ప్రాంతాలకు రాలేదు. కాని వాళ్ళకోసరం ఎదురుచూస్తూ ఈ రోజంతా ఏదో విధంగా గడపవలసిందే! ఎక్కడో ఒకచోట ఆశ్రయం సంపాదించుకోవాలి" అన్నాడు రమేషు.

"మీ వెంట నౌకర్లుకూడా వున్నారు కదూ?"

"లేదు. నేను ఒంటరిగానే వచ్చాను."

"మంచిదే!" అని రమణి నవ్వింది. ఆమె తలపైకెత్తి రమేషు ముఖం చూసేసరికి యిద్దరి చూపులు క్షణం కాలం కలిసిపోయినయ్. రమణి మళ్ళీ తలవంచుకుని ఏమాలోచించుకున్నదోగాని, "అయితే నావెంట రండి" అని అన్నది.

నీళ్ళ బిందె మళ్ళీ భుజాన పెట్టుకుని రమణి ముందు నడవడం ప్రారంభించింది.

రమేషు సందిగ్ధంలో పడ్డాడు. "ఫర్వాలేదు. నేను ఎటో ఒకవైపు వెళ్ళగలను. మనం కలుసుకోవడమే గనుక జరక్కపోతే; బహుశా మీరు నన్ను ఆహ్వానించి వుండరు. మిమ్మల్ని ఎక్కడచూశానో బొత్తిగా జ్ఞాపకం రావడంలేదు.

ఇంతకీ మీ పేరేమిటో-కాస్త పరిచేయంచేస్తే..." అన్నాడు రమేష్.

అయితే, యిట్లా ఈ గుడి బయట కూర్చుని వుండండి. నేను పూజ ముగించుకొస్తాను. వెళ్ళే దారిలో నా గురించి మీకు వివరంగా చెప్తాను" అని రమణి గుడి లోపలికి వెళ్ళి పోయింది. రమేషు ముగ్ధదృష్టితో అలాగే చూస్తూ నిలబడి పోయాడు. జాజ్వల్యమానంగా ప్రకాశిస్తున్న ఆమె యౌవన సౌందర్యాన్ని ఆ తడిబట్టలు ఎంతమాత్రమూ దాచిపెట్టలేక పోతున్నాయ్. ఆమె ముఖమూ, శరీరంలోని వొంపులూ. ఆ నడకతీరూ, తానెక్కడో చూసినట్లు లీలా మాత్రంగా జ్ఞప్తికొస్తున్నప్పటికీ అతను స్పష్టంగా గుర్తించలేక పోతు న్నాడు. రమారమి అరగంట తర్వాత ఆమె పూజ ముగించు కుని బయటికొచ్చింది. మరొక పర్యాయం రమేషు ఆమెను స్పష్టంగా చూశాడు. అయినా గుర్తురాలేదు. ఆమె వెంట నడుస్తూ "మీతోపాటు మీ కుటుంబీకులు కూడా వున్నారను కుంటాను?" అన్నాడు రమేషు.

"లేదు! పనిమనిషివుంది గానీ, అది యింటిదగ్గర పనులే చూస్తుంటుంది. నేను తరుచుగా ఒంటరిగానే ఇక్కడికి వస్తుంటాను."

"అయితేమరి నన్నెందుకు వెంట తీసుకెడుతున్నారు?" అనడిగాడు రమేషు.

రమణి కొంతదూరం జవాబు చెప్పకుంటానే నడిచి; "మరి నేను కల్పించుకోకపోతే మీ మంచిచెడ్డలు ఎవరు చూస్తారు; నేను రమను!" అన్నది.

♦ ♦ ♦

రమ ఎదురుగా కూర్చుని రమేషుకు భోజనం వడ్డించింది. ఆ తరువాత అతను విశ్రాంతి తీసుకునేందుకు జంపఖానా పరచింది. ఆ తరువాత ఆమె రెండో భాగంలోనికి వెళ్ళిపోయింది. జంఖానామీద పడుకుని కళ్ళు మూసుకున్నాడు. అతని ఆలోచనల్లో గత ఇరవై మూడేళ్ళ జీవితానికీ ఈనాటి అనుభవానికీ ఎంతో వ్యత్యాసం వున్నట్లు కనిపించింది. చిన్నప్పట్నుంచీ కూడా అతను యితర ప్రాంతాల్లోనే కాలం గడిపాడు. అన్నం తినడం అనేది యింతకాలమూ ఏదో అకలి తీర్చుకోడానికే తిన్నట్టుగా వుండేది తప్ప, అంతకంటే మధురమైన భావన ఆ ఘటనలో యిమిడివున్నదనే సంగతి అతనికి ఈనాటికీ తెలియదు. సరిగ్గా అలాంటి విచిత్రమైన అనుభూతే యీవేళ భోజనం చేస్తున్నప్పుడు కలిగింది. అందువల్ల అతనికి లభించిన ఆనందం యింతింతని చెప్పడానికి వీల్లేదు. రమేషు భోజనం కోసరమని రమ ప్రత్యేక పదార్థాలేమీ చెయ్యలేకపోయింది. సాధారణమైన వంటకాలే తయారుచేసింది. అట్లా తయారు చేస్తున్నప్పుడు ఆమె మనసులో అనేక సంశయాలు చెలరేగినయ్. ఈ విషయం రమేషు ముఖతః విన్నప్పుడు లోకులు ఎన్నిరకాలుగా వ్యాఖ్యానాలు చేస్తారోగదా! ఛీ ఛీ పాడులోకం, పాడుమనుషులూను! వీళ్ళను గురించి తను ఆవేదన పడినందువల్ల ఏమిటీ ప్రయోజనం? చివరకు ఈ విధమైన సంశయాలను అధిగమించి స్థిర సంకల్పంతోనే భోజన సమయంలో రమేషుకు ఎదురుగా కూర్చుని ఏమేమికావాలో శ్రద్ధగా చూసింది. నిజంగా ఆమె అలా కూర్చోకపోతే

మాత్రం ఏం ? కాని భోజనానికి వడ్డించిన వంటకాలలో ఏదీ అంత సంతృప్తికరంగా లేదు ఆ అసంతృప్తి నివారణ కోసం రమే రమ ఎదురుగా కూర్చుంది. నిర్విఘ్నంగా రమేష్ భోజనం చేశాడు. అందువల్ల భోజనం చేసినవాడు పొందిన సంతృప్తికంటే అనేక రెట్లు వడ్డించిన వాళ్ళు సంతృప్తి పడ్డారు. ఈ సంగతి అందరికీ తెలియక పోయినా, అన్నిటినీ గమనించే ఆ దయామయునికి మాత్రం తప్పక తెలుసు!

రమేషుకు పగటిపూట నిద్ర అలవాటు లేదు. అతను విశ్రాంతి తీసుకునే గదికి ఎదురుగా చిన్న అడివివుంది. ఆ గది లోంచి చూస్తే సుదూరంగా నీలిమేఘాలతో నిండిన మధ్యాహ్న ఆకాశం స్పష్టంగా కనిపిస్తుంది. అర్ధనిమీలిత నేత్రాలతో ఆ దృశ్యాన్ని చూస్తున్నాడు రమేష్. వాళ్ళ తాత గారింటి నుంచి బంధువులు వొస్తారో, రారో, ఆ సంగతి భగవంతునికే తెలుసుగాని, తనకుమాత్రం యిప్పుడు ఏలోటూ లేదు. అకస్మాత్తుగా రమ కంఠస్వరం వినిపించింది ఆమె గదిబయట నిలబడి; "మీకు అభ్యంతరం లేకపోతే మీరు ఇక్కడే వుండవచ్చు!" అని అన్నది.

రమేష్ జపఖానామీద లేచి కూర్చుని; "అసలు ఈ ఇల్లు ఎవరిదో వాళ్ళను ఇంతవరకూ కలుసుకోవడమే జరగలేదు. ఇంటి యజమాని అంగీకారం లేకుండా ఎవరైనా ఎట్లా వుండగలరు ?" అని అన్నాడు రమేష్.

రమ బయటనుంచే, "ఇంటి యజమానికి యిష్టమే!... ఈ ఇల్లు నాదే!" అంది రమ.

రమేషు ఆశ్చర్యపడి; "ఇక్కడా? తారకేశ్వర్‌లోనా? ఈ వూళ్ళో నీకు ఇల్లెందుకూ?" అనడిగాడు.

"ఈ ప్రాంతం నాకు చాలా యిష్టం. చాలాసార్లు ఇక్కడికి వొస్తూనే వుంటాను. ఇప్పుడంటే జనం ఎక్కువగా లేని మాట నిజమేగానీ, ఒక్కోసారి ఇసుకవేస్తే రాలనంత మంది జనం వస్తుంటారు." అంది రమ.

"అంత మహాజనంలో, ఉత్సవాల్లో అవస్థపడి అసలు రాకపోదేనేం?" అనడిగాడు రమేష్.

రమ వొస్తున్న నవ్వునాపుకుంది. మళ్ళీ రమేషు కల్పించుకుని, "తారకేశ్వరుడంటే మీకు చాలా భక్తి అనుకుంటాను." అన్నాడు.

"అంత భక్తివున్నా లేకపోయినా, ప్రాణం వున్నంతవరకూ భక్తీ-ముక్తి కోసరం తపనా తప్పదుగదా!" అంది రమ.

ఆతరువాత రమేషు మరేమీ అడగలేదు. రమ అక్కడే ఒక పీటమీద కూర్చుని, కథాక్రమాన్ని మార్చి; "ఐతే రాత్రిపూట మీరు ఏమేమి వంటకాలు తింటారు?" అనడిగింది.

రమేషు నవ్వుతూ, "ఏదివుంటే అదే! ప్రత్యేక నియమాలంటూ ఏమీలేవు. ఆమాటకొస్తే ఒక్కోసారి, పిలిచి పెట్టేంతవరకూ నాకు భోజనం సంగతే గుర్తుండదు. అంచేత నే వంటవాడికి ఏది యిష్టమో; అదే నాతిండి!"

"అంత వైరాగ్యం ఎందుకూ?" అనడిగింది రమ. ఈమాటలో అర్థాంతర వ్యంగ్యమూ, సరళ పరిహాసమూ దాగి

వున్నప్పటికీ—ఆ విషయాన్ని రమేషు గుర్తించలేక పోయాడు. ముక్తసరిగా జవాబుచెబుతూ; "వైరాగ్యంకాదు, నిర్లక్ష్యం!" అన్నాడు

"కాని నేను చూస్తున్నానుగదా; ఇతరుల విషయాల్లో మీరు ఎంతమాత్రమూ నిర్లక్ష్యంగా వ్యవహరించారు."

"దానిక్కారణం వుంది. ఇతరుల విషయాల్లో నిర్లక్ష్యంగా వ్యవహరిస్తే పరంలో భగవంతునిముందు సంజాయిషీ చెప్పుకోవాల్సి వొస్తుంది. స్వవిషయాల్లో కూడా ఒక్కోసారి చెప్పుకోవాల్సి వొస్తుందిగానీ, మొదటి దానంత అధికంగా కాదనుకుంటాను."

రమ కాస్సేపాగి, "మీరు ధనవంతులు గనుక పరోపకారం చేయడానికి సిద్ధపడుతున్నారు. మరి; లేనివాళ్ళ సంగతి ?"

"ఆ సంగతి నాకు తెలియదు. వాళ్ళ సంగతి వేరు. డబ్బు కలిగివుండడమూ; దానం చెయ్యాలని అనుకోవడమూ ఈ రెండింటికీ ఎక్కడా హద్దుఅనేది లేదు రమా! డబ్బు వుండడమూ లేకపోవడమూ అనేది మన చేతుల్లోని పనికాదు. అది ఇహపరాల భారం వహించేవాడి పని!"

మరి కాస్సేపటివరకూ రమ వూరుకుని, "అది నిజమే కావచ్చుగానీ, మీరు అప్పుడే పరలోకాలను గురించి యోచించేటంత. యోగ్యవయస్కులు కాలేదు. కాకపోతే మీరు నాకంటే మూడేళ్ళే పెద్దవాళ్ళు !" అంది రమ.

రమేషు నవ్వి; "ఆమాటకొస్తే నువ్వు అసలే అయోగ్యురాలవను కుంటాను ! భగవంతుని దయవల్ల నువ్వు చిరం

జీవివి కావాలనే కోరుకుంటాను కాని నా జీవితంలో యిదే చివరి రోజుకాదని నేను ధైర్యంతో చెప్పలేను.'' ఈమాటలలో ఎప్పదునైన బాణం యిమిడివుందో, అది తన పనిని నెరవేర్చిందనే అనుకోవచ్చు. మరి కాస్సేపాగి రమ అకస్మాత్తుగానే "మీరు సంధ్యావందనం చెయ్యగా నేనెప్పుడూ చూళ్ళేదు. ఇక దైవమందిరాల్లో ఏముందో ఏమిలేదో కూడా మీరు చూడలేదు సరేసరి. కాని భోజనం చేసేముందైనా నోరు శుభ్రం చేసుకోవడంకూడా మరిచిపోయారా?'' అనడిగింది

రమేష్ లోలోపలే నవ్వుకుంటూ, "లేదు రమా, నేను మర్చిపోలేదు. ఒకవేళ మర్చిపోయినా నష్టమేమిటి? అయినా నువ్వీ విషయాలన్నీ ఎందుకు అడుగుతున్నట్టు?'' అన్నాడు రమేష్.

"ఎందుకంటే, పరలోకాన్ని గురించి మీరు ప్రబలంగా ఆలోచిస్తున్నారు గనుక'' అన్నది రమ.

రమేషు ఆ మాటకు జవాబు చెప్పలేదు. ఇద్దరూ కాస్సేపటివరకూ మాట్లాడలేదు. ఆతరువాత రమే నెమ్మదిగా, "చూడండి, యింతకు ముందు మీరు నన్ను చిరకాలం జీవించమని దీవించారే అది కేవలం అభిశాపంలాంటిది. ఎంచేతనంటే హిందూ కుటుంబంలో 'విధవ' చిరకాలం జీవించాలని ఎవరూ కోరరు! నేను చావడానికి సిద్ధంగానే వున్నాను అని చెప్పడం నిజం కాకపోయినప్పటికీ; యింకా ఎంతో కాలం జీవిస్తానన్న నమ్మకం నాకేలేదు. కాని ఈ విషయంలో నాకాభయంలేదు. బలవంతంగా నా విషయాలన్నీ మీకు వినిపించడం ఒకరకంగా నామూర్ఖత్వమే అవుతుంది. చివరి

సారిగా మీకు ఒక్కమాటే చెబుతున్నాను; ఇతరుల కోసరం మీరు మీ సర్వస్వాన్నీ అర్పించేందు సిద్ధపడేనాను, నేను చెప్పిన మాటకూడా గుర్తుంచుకోండి." అంది రమ.

రమేషు దీర్ఘంగా నిట్టూర్చి ఆమెలాగానే నెమ్మదిగా, "నేను బాగా ఆలోచించే ఈ మాట చెబుతున్నాను. నువ్వు నా గురించి చెప్పిన మాట మాత్రం అన్నివిధాలా నిజంకాదు. నిజానికి నేను నీకేమీకాను రమా! సరికదా నీ జీవిత పథానికి అడ్డంగాపడ్డ పెద్ద శిలలాంటివాణ్ణి! ఐనప్పటికీ కేవలం పొరుగు దానివిగా, ఆత్మబంధువుగా, ఈనాడు నీ సాన్నిధ్యంలో నేను పొందిన అపూర్వ అనుభవాన్ని ఎన్నటూ మర్చిపోలేను. ఇంతకు ముందే ఒంటరిగా కూర్చుని ఇదే ఆలోచిస్తున్నాను. సుదీర్ఘమైన నా గతజీవితాన్ని దాని ప్రవాహగతిని ఈ వేళ నువ్వు పూర్తిగా మార్చివేశావు. నా గతజీవితంలో ఎన్నడూ కూడా యింతతృప్తిగా భోజనం చేసి ఎరుగను. ఎవ్వరూ నన్నీ విధంగా తినిపించలేరు! ఈ వేళ నీ సాన్నిధ్యంలో భోజనం చేస్తూ నేనొక గొప్ప అనుభవాన్ని పొందాను. భోజనం కేవలం జిహ్వాచాపల్యానికే కాదనీ; ఏదో పదిముద్దలు గొంతులో పడేసుగోవడం కాదనీ, వీటన్నిటినీ మించిన దివ్యమైన అనుభూతి అని యివాళే తెలుసుకున్నాను." అన్నాడు రమేష్.

ఈ మాటలువిని రమ అణువణువునా సంతోషంతో పులకించిపోయింది. అయినప్పటికీ ఆ సంతోషాన్ని బహిర్గతం కానీయకుండానే, "అవును, అది నిజమే కావచ్చుకానీ; ఈ సంగతి మర్చిపోవడానికి కూడా ఆట్టే వ్యవధి పట్టదను

ఉంటాను." అని అన్నది. ఒకవేళ ఈనాటి భోజనం సంగతి మీ కెప్పుడైనా జ్ఞాపకంవొస్తే; - ది కేవలం యింటు హీనత వల్లకూడా మీ జాపకం వుండవచ్చు" అని అన్నది రమ.

రమేష్ జవాబు చెప్పలేదు.

"తిరిగి స్వగ్రామం వెళ్ళిన తరువాత ఈ విషయాన్ని గురించి హేళనగ వ్యాఖ్యానం చెయ్యకుండా వుంటే - అదే నా అదృష్టంగా భావించగలను." అన్నది రమ.

రమేష్ మరొకసారి దీర్ఘంగా నిట్టూర్చి "కాదు రమా! అలాంటి పని ఎన్నడూ చెయ్యను. హేళనగా వ్యాఖ్యానమూ చెయ్యను, ప్రశంసల వర్షమూ కురిపించను. ఈ ఒక్కరోజు నా జీవిత కాలంలో నిందలకూ - ప్రశంసలకూ అతీతమైన దివ్యానుభూతి; యిది నిజం" అన్నాడు రమేష్.

రమ కొన్నిక్షణాలు నిశ్శబ్దంగా కూర్చుని ఆ తర్వాత లేచి తన గదిలోనికి వెళ్ళిపోయింది. ఆగదిలోని ఏకాంత ప్రశాంతతలో ఆమె కళ్ళనుండి బరువైన అశ్రుబిందువులు జారిపడినయ్.

# 11

రెండు మూడు రోజుల్నుంచి కుండపోతగా వర్షం కురిసి కాస్త ఈవేళే తగ్గింది. ఆకాశం కొంచెం నిర్మలంగావుంది. చండీ మండపంలో గోపాల్ సర్కార్ దగ్గర కూర్చుని రమేశ్

తన జమీందారీకి సంబంధించిన కాగితాలేవో చూస్తున్నాడు. అంతలో అకస్మాత్తుగా రమారమి ఇరవైమంది రైతులు భోరున ఏడుస్తూ అక్కడికి వొచ్చి; "రక్షించు చినబాబూ. రక్షించు తమరు ఈసారి దయతలచకపోతే పిల్లలతో సహా ముష్టె త్తుక్కోవడం తప్ప మాకు గత్యంతరం లేదు." అని ఏడుస్తూ చెప్పారు.

రమేశ్ ఒక్కక్షణం ఆగి, "అసలేం జరిగింది; కాస్త వివరంగా చెప్పండి." అనడిగాడు.

"రమారమి వందెకరాల భూమి నీటిలో మునిగి పోయింది బాబూ! వెంటనే నీళ్ళుపోయే దారిలేకపోతే ఈఏడు పంటంతా అధ్వాన్నమై పోతుంది. తినడానికి ఒక్కముద్ద కూడా మాకు దొరకదు" అన్నారు రైతులు.

రమేశ్‌కు యిందులో చిక్కేమిటో అర్థంకాలేదు, అంచేత గోపాల్ స్వయంగా రైతుల్ని కొన్ని విషయాలు అడిగి తెలుసుకుని రమేశ్‌కు వివరించి చెప్పాడు. సారాంశమేమిటంటే ఇప్పుడు నీళ్ళలో మునిగివున్న ఈ వందె కరాల భూమే ఈ గ్రామీణులకు జీవనాధారం! ఈగ్రామంలో బిచా - బిక్కీ రైతులందరికీ ఏకొంచెమైనా భూమివుంటే—అది ఈ వందెకరాల్లోనే వుంది. ఈ భూమికి తూర్పువైపున ప్రభుత్వపు వంతెన వుంది. పశ్చిమ, ఉత్తరదిశలలో మెరకమీద పల్లెలున్నయ్. ఇక కేవలం దక్షిణ దిశలోనే ఒకతూమువుంది. దాని ద్వారానే ఇక నీరు పోయేదారి. ఐతే ఆదారిమీద సర్వాధికారం ఘోషాల్, ముఖర్జీల కుటుంబాలకే వుంది. ఆ తూము ముందు చిన్న చెరువులాంటిది వుంది. సంవత్సరా

నికి రమారమి ఐదారువందల రూపాయల చేపలు ఈ చెరువులో దొరుకుతవి. అంచేత జమీందారు వేణీబాబు ఈచెరువుకు కట్టుదిట్టమైన కాపలా ఏర్పాటు చేస్తుంటాడు. రైతులు ఈ వేళ ఉదయంనుంచీ వేణీబాబు కాళ్ళా వేళ్ళాపడి ఏడ్చి అలసిపోయారు. ఐనప్పటికి పెదబాబుగారికి ఏమాత్రం జాలి కలగలేదు. అంచేత గత్యంతరంలేక చినబాబుగారి దగ్గర కొచ్చారు. ఇహ ఆతరువాత రమేశ్ విన లేకపోయాడు.

రమేష్ రివ్వుల బాణంలా వేణీ దగ్గరకు వెళ్ళాడు. అప్పటికి సంధ్యవేళ అయింది. వేణీబాబు మోచేతిక్రింద దిండుపెట్టుకుని కూర్చొని యింకా హుక్కా పీలుస్తూనే వున్నాడు. ఆయనకు దగ్గరలోనే హాల్దార్ కూర్చొని వున్నాడు. బహుశా వాళ్ళుకూడా ఈ విషయాన్ని గురించే మాట్లాడు కుంటున్నారేమో! రమేశ్ ముక్కుసూటిగా అసలు విషయాన్ని ప్రస్తావిస్తూ "చెరువుకట్ట తెగ్గొట్టవలసిందే! లేకపోతే లాభంలేదు!" అన్నాడు.

వేణీ తన చేతిలోని హుక్కా హాల్దార్‌కు అందించి సరిగ్గా కూర్చుని, "ఏ చెరువు కట్టా?" అనడిగాడు విచిత్రంగా.

రమేశ్ మరింత కోపంతో, "అన్నయ్యా! ఉన్నదొకటే చెరువుకట్ట! దాన్ని తెగ్గొట్టనివ్వకపోతే పంటంతా ధ్వంసమైపోతుంది. నీళ్ళు పోయేదారివ్వండి." అనడిగాడు.

"ఆ నీళ్ళతోపాటే అయిదారు వందల రూపాయల చేపలుకూడా పోతయ్! ఆ సంగతి తెలుసా నీకు? ఆ డబ్బు ఎవరిస్తారు? నువ్వా, ఆ రైతులా?" అనడిగాడు వేణీ.

రమేశ్ తనను తాను సంబాళించుకుని, "రైతులు కేవలం పేదవాళ్ళు! ఇకపోతే నే నెందుకివ్వాలి?" అనడిగాడు.

"ఐతే ఆ నష్టం మేమెందుకు భరించాలి? అనడిగాడు వేణీ మరోక్షణం తర్వాత హాల్దార్ నుద్దేశించి, "చూశావా బాబాయ్! ఇట్లా అయితే మనం ఆస్తులు రక్షించుకోగలమా?" అన్నాడు. మరోక్షణం తరువాత "వింటున్నావా రమేష్! ఆ వెధవలు ప్రొద్దుట్నుంచీ యిక్కడే పడిపడిచారు. నాకంతా తెలుసు రమేష్... నాకు తెలియక అడుగుతాను; నీవాకిట్లో నాకు ఎవరూ లేరు? వాడి కాళ్ళకు మంచి చెప్పలేవీ లేవ్వా? వెళ్ళు నాయనా వెళ్ళు! వాటిని ఏర్పాటు చెయ్! నీళ్ళు వాటంతటవే పోతయ్!" ఈ మాటలు అని వేణీబాబు హాల్దార్‌తో కలిసి 'హీ హీ హీ' అని నవ్వడం ప్రారంభించాడు. ఆ విధంగా నవ్వడంలో వాళ్ళు తమ ప్రజ్ఞఅంతా చూపెట్టుకున్నారు. ఇదంతా చూసి రమేష్ సహించలేక పోతున్నాడు. ఐనప్పటికీ పొంగివస్తున్న పౌరుషాన్ని దిగమ్రింగుకుని మరింత వినయంగా, "కొంచెం శాంతంగా ఆలోచించు అన్నయ్యా! మనకొచ్చే నష్టంకోసరం పేదవాళ్ళ సంసారాలను గంగపాలు చేస్తామా? దానివల్ల వాళ్ళకు రమారమి ఆరేడువేలు నష్టం అవుతుంది." అన్నాడు.

వేణీ చేత్తో విచిత్రంగా అభినయిస్తూ, "వాస్తే వాస్తుంది. వాళ్ళకు ఐదువేలు పోతేనేం, యాభై వేలు పోతేనేం? వాళ్ళందర్నీ అడిగినా పట్టుమని పదిదమ్మిడీలు దొరకవు:

అలాంటి వెధవలకోసరం నాఆదాయాన్ని గంగపాలు చేసుకో మంటావా?" అనడిగాడు.

రమేశ్ చివరిసారిగా ప్రయత్నిస్తూ, "మరి వాళ్ళందరూ సంవత్సరం పొడుగునా ఏం తిని బ్రతుకుతారు?" అనడిగాడు.

ఇదేదో పరిహాసపూరితమైన సంభాషణలాగా వేణీ బాబు పొట్ట చెక్కలయ్యేలాగా నవ్వుతూ, "ఏం తింటారా? చూద్దువుగాని! ఆ విధవలు మళ్ళీ నాదగ్గరకే రారూ? భూములు తనఖా పెట్టుకుంటారు, అప్పులు తెచ్చుకుంటారు, తింటారు! ఇది నిజమో కాదో నువ్వే చూస్తువుందు!... నే చెబుతున్నాగా... కాస్త శాంతంగా నువ్వుకూడా ఆలో చించు... మన తాత ముత్తాతలు కూడా యిట్లాగే ఆస్తులు సంపాదించి జమీందారీలు నిలబెట్టారు. ఎక్కడన్నా కాస్తా కూస్తా యింకా మిగిలివుంటే ఏదో విధంగా మనం భుక్తం చేసుకోవాలి! లేకపోతే మన పిల్లలేం తింటారు! రైతులు ఏం తింటారు? ఎట్లా తింటారు అనడుగుతావేం! మరేం ఫర్వాలేదు. అప్పు తెచ్చుకుంటారు, తాకట్లు పెట్టుకుంటారు. ఆ నీచజాతివాళ్ళకు అది మామూలే!" అన్నాడు వేణీబాబు.

సిగ్గూ, అవమానమూ, క్రోధంతో రమేష్ ముఖం కందగడ్డలాగా మారిపోయింది. అయినప్పటికీ తన కంఠస్వరంలో ఏమాత్రం కాఠిన్యం వినిపించకుండానే "మీరు అంతకఠినంగా వ్యవహరిస్తున్నప్పుడు అధికంగా వాద ప్రతివాదాలు పెట్టుకో వడం అసంగతమైన విషయం. నేను రమ దగ్గరకు వెడుతు న్నాను. ఆమె అభిప్రాయం కూడా తెలిస్తే... యిక ఈవిష

యంలో మిమ్మల్ని గురించి ఆలోచించవలసిన అవసరం లేదు.”
అన్నాడు రమేశ్.

వేణీబాబు ముఖం ఎర్రబడింది. “సరే పో! వెళ్ళి
ఆమె అభిప్రాయం కూడా విను. కాని నే చెప్పినదానికి
ఏమాత్రం భిన్నంగా వుండదని మాత్రం గుర్తుంచుకో!
తమ్ముడూ ఆవిడను మామూలు ఆడది అని మాత్రం భావిం
చకు! ఆవిడ కళ్ళల్లో దుమ్ము జల్లడం నువ్వనుకున్నంత తేలిక
కాదు. ఆవిడముందు నువ్వొట్టి మైనర్ కుర్రాడివే! మా
నాన్ననే ముప్పతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ళు తాగిం
చింది! నువ్వెంత? నీ అస్తిత్వమెంత!... ఏం హోల్దార్
బాబాయ్ నిజమేనా?” అన్నాడు వేణీ.

బాబాయి యిష్టాయిష్టాను గురించి అసలు రమేశ్ పట్టించు
కోలేదు. ఇంత అవమానకరమైన ఈ స్థితిలో ఇహ వాళ్ళతో
మాట్లాడడం అనవసరమనిపించింది. రమేశ్ అక్కణ్ణుంచి
తిన్నగా రమ దగ్గరకు వెళ్ళాడు.

రమ పెరట్లో తులసికోట దగ్గర సంధ్యాదీపం వెలిగించి
చివరిసారిగా నమస్కరించి కళ్ళు తెరిచేసరికి ఎదురుగా రమేశ్
కనిపించాడు. ఆమె ఆశ్చర్యపడింది చీరెచెంగు తలమీదుగా
కంఠానికి చుట్టుకుని నమస్కరిస్తూ కళ్ళు తెరిచేసరికి, సరిగ్గా
రమేశ్ కూడా నమస్కారం పెట్టి తలఎత్తినట్టుగా వుంది. క్రోధా
వేశాల కారణంగా రమేషుకు ఆనాడు పిన్ని పెట్టిన నిషేధాజ్ఞ
కూడా ఆ క్షణాన గుర్తుకురాలేదు అంచేతనే సరాసరి
పెరట్లోకి వచ్చేశాడు. రమను ఆస్థితిలో చూసి ఒక్కక్షణం
ఆగిపోయాడు. రమారమి నెలరోజుల తర్వాత యివాళే మళ్ళీ

ఒకరినొకరు కలుసుకున్నారు! "నీకు అన్ని విషయాలూ తెలిసే వుంటాయనుకుంటాను. నీటి దాని విషయంలో నీఅభిప్రాయం కోసరం వొచ్చాను." అన్నాడు రమేశ్.

రమ ఆశ్చర్యం తొలిగిపోయింది. చీరెచెంగు తల మీదికి సరిగ్గా తీసుకుంటూ "ఇదెట్లా వీలవుతుంది? అదీగాక ఈ విషయంలో వేణీబాబు ఏమంత అనుకూలంగా లేడు." అంది రమ.

"లేనిమాట నిజమే! ఆయన వొక్కడూ వ్యతిరేకించినందువల్ల ప్రయోజనంలేని మాటకూడా నిజమే!"

రమకాస్త ఆలోచించి, "నీళ్ళు పోవలసిందే, కాని చేపలు పోకుండా మీ రేమైనా ఏర్పాట్లు చెయ్యగలరా?" అనడిగింది రమ.

"అంత ప్రవాహ వేగంలో ఏర్పాట్లు ఎట్లా చెయ్యగలం? ఈ సంవత్సరం ఏదో విధంగా అనష్టాన్ని భరించవలసిందే! లేకపోతే రైతులు అన్యాయంగా భ్రష్టులైపోతారు."

రమ మాట్లాడలేదు.

"అయితే అదే నీ అభిప్రాయమా?" అనడిగాడు రమేశ్.

రమ తల అడ్డంగా తిప్పుతూ; "లాభంలేదు. అంత డబ్బు నష్టపోవడం నావల్లకాదు." అన్నది.

రమేషు వివేచనా శక్తి ఆశ్చర్యంగా అంతర్హితమైపోయింది. రమ తనకు ఈ విధమైన సమాధాన మిస్తుందని అతను వూహించలేను. తన అభ్యర్థనను రమ త్రోసిపుచ్చుతుందని అతను కలలోకూడా వూహించలేను.

రమ తలెత్తి అతని ముఖంచూసి అంతరాత్మలోని ఘర్షణనుకూడా పసిగట్టింది. మరో క్షణంతర్వాత "చూడండి, ఈ ఆస్తి కేవలం నా ఒక్కదానిదే కాదు; జతీన్‌దికూడాను. ఈ ఆస్తికి నేను కేవలం సంరక్షకురాలిని మాత్రమే!"

"కాదు రమా, యిందులో సగం నీదికూడాను."

"అవును, పేరుకు మాత్రమే! ఆస్తి అంతటికీ జతీన్ సర్వాధికారి అవుతాడనే సగం నాపేర పెట్టారు. అంతే!" అన్నది రమ.

ఐనప్పటికీ రమేశ్ మరింత వినయంగా "ఏమిటిరమా! ఈ కొద్దిడబ్బుకోసరం నువ్వు ఆలోచిస్తున్నావా? ఈ ప్రాంతంలో అందరికంటే మీ పరిస్థితులు బాగానేవున్నయ్ కదా! ఈ నష్టం నీకొక లెక్కలోనిదా? నేను నిన్ను వినయపూర్వకంగా అభ్యర్థిస్తున్నాను రమా! ఆలోచించు. ఈ కొద్దిపాటి ఆదాయంకోసరం పేదవాళ్ళ బ్రతుకుల్ని ఎందుకిట్లా ధ్వంసం చేస్తారు? కాని రమా...నువ్విటువంటి సమాధానం చెబుతావని నే నెన్నడూ అనుకోలేదు" అన్నాడు రమేష్.

రమ మరింత శాంతంగానే "నేను నష్టాన్ని భరించలేనంతమాత్రాన నిర్దయురాలినేనైతే...సరే అలాగే అనండి. కాని మీకు వాళ్ళమీద అంత ఆదరాభిమానాలుంటే... పోనీ ఆ నష్టాన్ని మీరే ఎందుకు భర్తీ చెయ్యకూడదూ?" అనడిగింది. రమ మాటల్లోని నిగూఢమైన వ్యంగ్యం సూటిగా రమేష్ మనసుకు తగిలింది. ఆ మాటతో రమేశ్ మండిపోయి "రమా! మనుషుల విలువ డబ్బుదగ్గరగాని తేలవు. దీనిముందు ఎటువంటి ఆదర్శాలూ ఎందుకూ కొరగావు.

డబ్బుదగ్గరే మనిషి వాస్తవిక రూపమేమిటో బయటపడి పోయింది. నీ నిజమైన వ్యక్తిత్వమేమిటో యివాళ బయట పడింది. కాని నువ్వు యిటువంటిదానవని నే నెన్నడూ అనుకో లేదు. నువ్వు క్షుద్రదాతవు గావనే యిన్నాళ్ళూ విశ్వసిం చాను. నిన్ను కేవలం నిర్దయురాలవే అన్నంతమాత్రాన చాలదు; నీచురాలవు, మహా నీచురాలవు !"

"నేనా ?" అసహ్యా ఆశ్చర్యాలతో రమ కళ్ళు విప్పింది.

"అవునవును. నువ్వే! అతిహీనురాలవు, నీచురాల వూను! ఈ విషయాన్ని గురించి నేనెంత బాధపడ్డానో, ఆవే దన పడుతున్నానో నువ్వు పసిగట్టావు. అందుకే నష్టపరిహారం అడుగుతున్నావు పెద్దన్నయ్యలాంటివాడే అడగలేనిమాట, నువ్వు నిస్సంశయంగా అడిగావు. పురుషుడు ఏ మాటైతే అనడానికి సంకోచించాడో-అది నువ్వు ఆడదానివై కూడా నిర్భయంగా అడగకలిగావు నేను యివ్వదలిస్తే యింతకంటే ఎక్కువ నష్టపరిహారాన్నే యివ్వగలను. కాని రమా ఒక్క- సంగతి చెబుతున్నా విను; ప్రపంచంలో ఎన్నోరకాల పాపా లున్నయ్. కాని దయార్ద్రహృదయాన్ని గాయపరచడంకంటే మరో మహాపాపం ఏదీలేదు. ఇవాళ సరిగ్గా నువ్వు ఆపనే చేశావు."

కసాయివాని చేతిలో పసువులాగా రమ విహ్వల దృష్టితో అలాగే చూస్తూ వుండిపోయింది.

"నాలో ఏమూల దౌర్బల్యంవుందో ... దాన్నాధారం చేసుకొని నువ్వు ఏం సాధిద్దామనుకుంటున్నావో-అది నీకు

సాక్ష్యంకాదు రమా! నే ముందే చెబుతున్నాను విను రమా! నేనిప్పుడే వెళ్ళి సౌజన్యంగానే గట్టు తెగ్గొట్టిస్తాను. మీకు చేతనయినదేదో మీరు చేసుకోండి" అని రమేషు వెళ్ళిపోతున్నాడు.

అతన్ని మళ్ళీ పిలిచి "నా గుమ్మంలోనికొచ్చి నన్నే అవమానించి వెళుతున్నందుకు మీరేమీ సంజాయిషీ చెప్ప నవసరం లేదుగాని, మీరు తలపెట్టిన సాహసమాత్రం మంచిదికాదు; అల్లా చెయ్యకండి!" అన్నది రమ.

"ఎందుకని?" - నడిగాడు రమేషు.

"ఎందుచేతనంటే, మీ చేత అవమానింపబడికూడా మీతో వాదవివాదాలు పెంచుకోవడం నా కిష్టంలేదుగనుక" అంది రమ.

ఆ మాటలు అంటుండగానే ఆమె ముఖం అకస్మాత్తుగా అస్వాభావికమైన శ్వేతవర్ణంగా మారిపోయింది. పెదిమలు వొణుకుతున్నయ్. యీ దృశ్యాన్ని రమేషు అంత సంధ్యచీకట్లోకూడా చూడగలిగాడు. కాని ఆ సమయాన మనస్తత్వాన్ని గురించి స్థిరంగా ఆలోచించే వ్యవధి అతనికి లేదు. అంచేత "వాద ప్రతివాదాలు నాకు యిష్టంలేదు రమా ఆ సంగతి నీకూ తెలుసు. కాని యింతకాలంగా నీమీదున్న సదభిప్రాయమూ, సద్భావనా యీ క్షణాన నాలో చీమ తలకాయంతైనా లేదు.. సరే... యికనే వెళుతున్నాను..."

రమపిన్ని పైన ఎక్కడో ఠాకూర్ పూజామందిరంలో వున్నదేమో, క్రిందజరిగిన యీ తుఫానుసంగతి ఆమె కేమీ తెలియలేదు. క్రిందకొచ్చి చూసేసరికి రమ పనిమనిషిని వెంట

బెట్టుకొని వెళ్ళుతూవుండడం కనిపించింది. ఆశ్చర్యంతో రమ నుద్దేశించి "ఎక్కడికమ్మా వెడుతున్నావూ?" అనడిగింది. యీవేళప్పుడు బయటఅంతా బురదగా వుందిగదా!"

"ఒకసారి వేణీదగ్గర కెళ్ళొస్తాను పిన్నీ" అని అన్నది రమ.

"దారిలో అసలు బురదే లేదమ్మగారూ! చినబాబు గారు ఎంచక్కని రోడ్డు వేయించారనుకున్నారు? కుంకుమ పడినా మళ్ళీ ఎత్తుకోవచ్చు! భగవంతుడు ఆయనకు నూరేళ్ళ ఆయుస్సు యివ్వాలి. పేదవాళ్ళను యిప్పుడు ఏ పామూ-పురుగూ కరుస్తుందన్న భయమేలేదు" అన్నది పనిమనిషి.

అప్పుడు రాత్రి సుమారు పదకొండు గంటలై వుంటుందేమో! వేణీబాబుగారి చండీమండపం దగ్గరనుంచి మనుషులు నెమ్మదిగా మాట్లాడ్డం వినిపిస్తూనేవుంది. ఆకాశంలోని మేఘాలు చెదిరిపోవడంవల్ల త్రయోదశివెన్నెల స్పష్టంగా వరండాఅంతా పడుతూనేవుంది. వరండాలోని పెద్దస్తంభాన్నానుకొని ఒక ముసల్మాన్ భీమకాయుడు కళ్ళుమూసుకు కూర్చునివున్నాడు. అతని నుదుటినుంచి రక్తం యింకా ప్రవహిస్తూనేవుంది అతని వంటిమీది బట్టలన్నీ అంతకుముందే రక్తంతో తడిసిపోయినయ్. వేణీ అతన్ని అతి నెమ్మదిగా సముదాయిస్తూ "అక్బర్! నా మాటవిని ఠాణాకువెళ్ళి రిపోర్టు యివ్వు! ఏడేళ్ళపాటు వాణ్ని మూయించకపోతే నాపేరు వేణీయేకాదు!" వేణీ వెనక్కుతిరిగి రమ నుద్దేశించి "రమా, నువ్వయినా నచ్చచెప్పు, చూస్తూ వూరుకుంటావేం!" అన్నాడు.

ఈసారి అక్బర్ ఆరే కళ్ళు తెరిచాడు. కాళ్ళు బార చాపుకు కూర్చున్నాడు. "శభాష్ ... నిజంగా చినబాబు తల్లిపాలే తాగాడు కాబట్టే కఱ్ఱసాములో అంత నేర్పు సంపాదించాడు." వేణీ ఆశ్చర్యపడి "అదే నేనడిగేది! నువ్వు అతని దెబ్బకే గాయపడ్డావా, లేక అతని నౌకరు దెబ్బకు గాయపడ్డావా?" అనడిగాడు.

అక్బర్ పెదాలు చిరునవ్వుతో మెరిసినయ్. "ఆ హిందూస్తాని నౌకరా! ఎడిచాడు వెధవ! వాడికి కఱ్ఱదెబ్బ ఏంవచ్చు? ఏంరా గౌహర్ ఏ దెబ్బకేగా వాడు మట్టికరచి పడ్డాడు?" అక్బర్ యిద్దరి కొడుకులూ ప్రక్కనే కూర్చుని వున్నారు. వాళ్ళుకూడా బాగానే గాయపడ్డారు యీ దెబ్బ లాటలో. మరోక్షణం తర్వాత "నాచేతి దెబ్బగనుక వాడికి తగిలినట్లయితే నిజంగానే చచ్చివుండేవాడు." అన్నాడు మళ్ళీ అక్బర్.

రమ మరింత దగ్గరగావచ్చి నిలబడింది. అక్బర్ తన ప్రాంతంలోని పీర్‌పూర్ గ్రామంలోవుండే ఒక ఆసామి. గతంలో చాలాసార్లు తన లాఠీబలంతో వీళ్ళకు చాలా లాభం చేకూర్చి పెట్టాడు. అంచేతనే సాయంత్రం జరిగిన అవమానానికి ప్రతీకారం తీర్చుకోవడం కోసరం అక్బర్‌ను పిలిపించి చెరువుకు కాపలా పెట్టించింది రమ. ఆ ప్రయత్నం ఆమె కేవలం క్షణికోద్రేకంలోపడి చేసిందే తప్ప దూరదృష్టితో చేసిందికాదు. అదీగాక తన హిందూస్తానీ నౌకరు బలంతో రమేష్ ఏం సాధిస్తాడో చూద్దామనికూడా ఆశించింది. అంతే గాని ముష్టియుద్ధాల్లోనూ కఱ్ఱదెబ్బల్లోనూకూడా రమేష్

యింత ఘటికుడని ఆమె కలలోకూడా వూహించలేదు అక్బర్ రమవేపుచూస్తూ; "అప్పుడు చినబాబుగారు నౌకరు చేతిలో లాఠీకర్ర తీసుకుని ఎదురుగా నిలబడ్డారు. మేం ముగురం తండ్రీకొడుకులం నిలబడ్డాం. అంత చీకట్లోకూడా బాబుగారి కళ్ళు చింత నిప్పుల్లా మెరిసినయ్. ఆయన నన్ను ఉద్దేశించి; "అక్బర్, నువ్వు మా సిలాడివై పోయావు ఇప్పుడో, అన్నారు. గట్లు తెగ్గొట్టకపోతే రైతులంతా ఆకలితో చచ్చి పోతారు. అందుకని గట్లు తెగ్గొట్టవలసిందే! నీకూ నీవూళ్లో కొంత పొలంవుందిగదా; అన్ని సంగతులూ నీకూ తెలుసు. అంతా ధ్వంసమైపోతే ఎట్లావుంటుందో కాస్త ఆలోచించు" అన్నారు.

"నేను చినబాబుగారికి సలాంచేసి "భగవంతునిమీద ఒట్టు పెట్టుకుంటున్నాను బాబూ! మీరు కాస్త తప్పుకోండి. మీవెనక నిలబడి ఈ గోతులు తవ్వుతున్న వాళ్ళపని నేను చూస్తాను." అన్నాను. అంతలోనే వేణికి వొళ్ళుమండినంత కోపం వచ్చింది అసహ్యించుకుంటూ "ఛీ ఛీ విశ్వాస హీనుడా! సలాంచేశాడంట సలాం! ఏడవలేకపోయావ్. అందుకేనా నిన్ను అక్కడకు పంపించింది!" అన్నాడు.

ఆమాట తండ్రికీ యిద్దరు కొడుకులకూ కష్టం కలిగించింది. కోపంతో చప్పున లేచారు కర్రలు పుచ్చుకుని. మరు క్షణం ఆలస్యమైతే ఏంజరిగేదో కాని, అక్బర్ కఠినంగా వేణి నుద్దేశించి, "ఖబడ్దార్ పెదబాబూ! నువ్వేమైనా అను గానీ, విశ్వాసహీనులని మాత్రం అనకు! మేం ఎంత చెడ్డా ముసల్మానులం! ఏమైనా సహిస్తాముగాని ఆ మాట సహిం

చం! అన్నాడు. నుదుటిమీదనుంచి అరచేత్తో రక్తాన్ని అద్దిరమకు చూపిస్తూ "అక్కా! పెదబాబుగారు మమ్మల్ని విశ్వాసహీనులని నిందిసున్నారు. ఇంటోకూర్చుని మమ్మల్ని విశ్వాసహీనులని నిందించడం తేలికేగాని కాస్త అట్లా బయటి కొస్తే తెలుస్తుంది. చినబాబుగారి ప్రతాపం.

"చినబాబూ, చినబాబూ అంటా వాడిగొప్ప! కాస్త అట్లా వెళ్ళి ఆమాటే ఠాణాలో చెప్పరాదూ? అది చేత కాదు మళ్ళీ! పోయి పోలీసుయిన్స్పెక్టరుతో అట్లాగే చెప్పు, చెరువుదగర కాపలాకాస్తుంటే, చినబాబువచ్చి యిట్లా తల పగలకొట్టాడని" అన్నాడు వేణీ!

అక్బర్ నెత్తి నోరూ కొట్టుకుంటూ "బాప్‌రే బాప్! యింతపెద్ద అబద్ధమా పెదబాబూ! ఇదా నువ్వు మాకు నేర్పేది?" అనడిగాడు అక్బర్.

"పోనీ అది కాకపోతే మరోమాట చెప్పు కనీసం ఆ గాయమైనా చూపించు! అంతే! తెల్లవారేసరికి వారంటు తెప్పించి బొక్కలో తోయించకపోతే చూడు! రమా, నువ్వైనా నచ్చచెప్పరాదూ? ఇట్లాంటిసమయం మళ్ళీ ఎప్పుడొస్తుందీ?" అన్నాడు వేణీ.

రమ ఏమీ మాట్లాడలేదు. అక్బరును తదేకంగా చూస్తున్నది.

అక్బర్ తల అడ్డంగా తిప్పుతూ "అమ్మా! యిది నా వల్లకాదు" అన్నాడు.

వేణీ బెదిరిస్తూ "నువ్వొక్కడివి పిచ్చిసన్యాసివిరా! ఎందువల్ల కాదు?" అనడిగాడు.

అక్బర్ చికాకుపడుతూ "ఏమిటి పెదబాబూ మీరు చెప్పేది? నేను తప్పుడుసాక్షం చెప్పనా? ఆ మాట చెప్పక పోతే యీ ఏమవ్వాళ్ళవాళ్ళూ నన్ను సర్దార్ అని అనరా?" అని రమ నుద్దేశించి, "అమ్మా! మీరు ఆజ్ఞాపిస్తే ప్రతి వాడినైనా జైలుకైనా పోతానుగాని, వాదినెట్లా అవుతాను?" అన్నాడు.

రమ నెమ్మదిగానే "ఏం అక్బర్, యిది నీవల్లకాదా" అనడిగింది.

వెంటనే అక్బర్ తల అడ్డంగా తిప్పుతూ "కాదమ్మా, నావల్లకాదు. ఇంకేదైనా చేస్తానుగాని యీపని చెయ్యలేను. కచేరీకిపోయి ఈ గాయాలుమాత్రం చూపించను... లేరా గొహర్, పోదాం పదండి. ఫిర్యాదులుచెయ్యడం మనవల్ల కాదు."

తండ్రీ యిద్దరు కొడుకులూ వెళ్ళిపోయారు.

వేణీకి వల్లమాలినంత కోపంగావుంది. ఆయన ఆశించి నది వాళ్ళవల్ల జరగలేదు. కళ్ళు చింతనిప్పుల్లా చేసుకొని వాళ్ళ ముగ్గుర్నీ నానాతిట్లూ తిట్టాడు. రమ తటస్థంగా వుండడంఏమిటో వేణీకి ఎంత ఆలోచించినా అంతుబట్టలేదు. అందువల్ల నివురుగప్పిన నిప్పులాగా లోలోపలే మండిపోతు న్నాడు.

నయానా భయానా ఎంతచెప్పినా వినిపించుకోకుండా, లక్ష్యపెట్టకుండా కొడుకుల్ని వెంటబెట్టుకుని అక్బర్అలీ వెళ్ళిపోగానే రమ దీర్ఘంగా నిట్టూర్చింది. అకారణంగానే ఆమె రెండుకళ్ళూ చెమ్మగిల్లినయ్. ఇంత ఘోరమైన పరా

జయమూ అవమానమూ జరిగిన తరువాత కూడా తన మనసులో ఏ విధమైన కల్లోలమూ లేకుండా యింత ప్రశాంతత ఎట్లా కలుగుతున్నదో కూడ ఆమెకు అర్థం కావడంలేదు. అంతేకాక ఆమె గుండెలమీద నుంచి పెద్దశిల తొలిగి పోయినట్టుగా వుంది. ఈ భావనకు ఎంత వెదికినా కారణం కనిపించడంలేదు.

ఇంటికి తిరిగి వచ్చి పడుకుంది. కాని నిద్రవస్తేనా! ఆనాడు తారకేశ్వర్‌లో తను స్వయంగా రమేశ్‌కు ఎదురుగా కూర్చుని భోజనం పెట్టింది. ఆదృశ్యమే ఎంత కాదనుకున్నా మాటి మాటికీ జ్ఞాపకం వొస్తున్నది. అంత సుకుమార సుందరమైన ఆ శరీరంలో అపురూపమైన మమత, కారుణ్యతతో పాటు యింత తేజస్సు ఎక్కడ దాగివున్నదా అని ఆలోచించిన కొద్దీ; ఆమె కళ్ళవెంట అశ్రుధార అనంతంగా స్రవిస్తూనే వుంది.

# 12

చిన్న తనంలో ఒకసారి రమేష్ రమను ప్రేమించిన మాట నిజమే! కాని అది కేవలం బాల్యచేష్టగానే పరిగణించవచ్చు. దాని ప్రభావం భావి జీవితంపై యింత గాఢమైన, గంభీరమైన ముద్ర వేస్తుందని ఆనాడు అనుకోలేను. ఈ సంగతి తారకేశ్వర్‌లోనే రమేశ్‌కు మొదటిసారిగా అనుభవానికొచ్చింది. ఆ అనుభవంతో అతను ఎన్ని ఆశాసౌధాలు

నిర్మించుకున్నాడో ఆ సంగతి అతనికే తెలుసు. కాని ఆ తరువాత అతను పొందిన మరోగొప్ప అనుభవం అతన్ని పూర్తిగ విచలితుణ్ణి చేసింది. ఆనాడు సంధ్య చీకట్లో రమతో కలిగిన అభిప్రాయ భేదాలతో - తాను నిర్మించుకున్న ఆశా సౌధాలను తానే నిర్మూలించుకున్నాడు. ఇహ అప్పటినుంచి అతను క్రమంగా రమకు దూరంగా జరిగి పోతున్నట్టే తోచింది. ఈనాడు వెనక్కు తిరిగి చూసుకుంటే తనకూ - ఆమెకూ మధ్య కొన్ని యోజనాల పర్యంతం నిష్ప్రయోజనమైన ఎడారేతప్ప, మరొకటి ఏదీ కనిపించడంలేదు. ఆమెతో కలిగిన ఈ ఎడబాటు కూడా తన జీవితంలో యింత కల్లోలాన్ని రేపుతుందని అతను అనుకోలేదు. చదువు సంధ్యలపట్ల యింత అనాసక్తి. ఆహారపానీయాల పట్ల యింత నిర్లక్ష్యం, చివరకు బ్రతుకుమీదే యింత రోతపుడుతుందని అతను వూహించలేదు. ఇటువంటి పరిస్థితుల్లో అసలు ఆ వూళ్ళో యింక ఒక్క రోజు కూడా వుండడం దుర్భరమనిపించే స్థితిలో సరిగ్గా ఈ సంఘటనే జరిగివుండకపోతే; ఆ మనో వ్యాకులతతో అతను ఎటుపోయేవాడో, ఏమై పోయేవాడో ఎవరూ చెప్పలేరు ?

కాంపుకు ఆవలివడ్డున పీర్‌పూర్ గ్రామం వీళ్ళ జమీందారీ లోనిదే! గ్రామస్తులంతా ముస్లింలే! ఒక రోజున వాళ్ళందరూ కలిసి రమేశ్ దగ్గరకు వొచ్చారు. వాళ్ళ అభియోగం ఏమిటంటే; వాళ్ళు అందరూ ఈ జమీందారీలోని ప్రజవే ఐనప్పటికీ జాతిదృష్ట్యా ముస్లిములు కావడంవల్ల వాళ్ళ పిల్లల్ని ఎవర్నీ స్కూళ్ళలో అడుగుపెట్ట నివ్వరట ! ఈ విషయంలో చాలాసార్లు ఎంత ప్రయత్నించినా ప్రయోజనం

శూన్యమే అయిందిట! ఉపాధ్యాయులు ఏ విధంగానూ యీ ముస్లిమ్ పిల్లల్ని బడిలో చేర్చుకునే వాళ్ళు కాదట. ఈ మాటలు విని రమేశ్ కోపంతో "ఇంత అన్యాయమా?" అన్నాడు అసహ్యంతో కంపించిపోతూ ఇంత అత్యాచారాన్ని నేనెక్కడా చూళ్ళేదు. మీ పిల్లల్ని అందర్నీ యిక్కడికి తీసుకురండి. వాళ్ళను నేను స్వయంగా బడిలో చేర్పిస్తాను." అన్నాడు.

"మేము కూలి రైతులమే ఐనప్పటికీ శిస్తులు చెల్లించే వ్యవసాయం చేసుకుంటున్నాము. అదీగాక ఏ విషయంలోనైనా హిందూ రైతులు భయపడ్డంతగా మేం భయపడం. కాని దానివల్ల ప్రయోజనం ఏమిటి? అనవసరంగా వాదోపవాదాలు పెరగడంతప్ప? మేమందరం కలిసి చందాలు రూపంలో కొంత సొమ్ము ప్రోగుచేయగలం. మీరు కూడా కాస్త సాయం చేస్తే-మా కార్యం నెరవేరిపోతుంది." అన్నారు ముస్లిమ్ రైతులు.

వాద ప్రతివాదాలతోనూ దెబ్బలాటలతోనూ రమేశ్ పూర్తిగ విసిగిపోయాడు. అంచేత పీర్‌పూర్ గ్రామస్థులు చెప్పినమాట కొంచెం సమంజసంగానే కనిపించింది. కొత్త స్కూలు స్థాపించడానికి రమేశ్ కూడా సిద్ధపడ్డాడు. వాళ్ళతో పరిచయం ఏర్పడ్డ తరువాత అతని మానసిక స్థితిలో కొంత మార్పు వచ్చినమాట నిజమే! గత సంవత్సరం జరిగిన సంఘటనల వల్ల అతని మనసులో ఏర్పడ్డ గాయాలు క్రమంగా మానిపోవడం మొదలైనవి. అదీకాక మ్‌వాంపూర్‌లోని హిందువుల్లాగా ఈ ముస్లిమ్‌లు చీటికి మాటికీ తగాదాలు పడేరకం

కాదు. ప్రతి స్వల్ప విషయాన్ని కొండంతగా చేసి అల్లాడిపడే రకం కాదు. అనవసరంగా అయినదానికీ కానిదానికీ కోర్టుల చుట్టూ తిరిగే రకం కాదు. ఏ విషయమైనా తనులో తామే నిర్ణయించుకుని, యిరుగు పొరుగు పెద్దల మాటకు కట్టుబడి వ్యవహరించే తరహా వ్యక్తులు. కష్టసమయాల్లో ఒకరి కొకరు అండగా నిలబడి ఈ విధంగా సమస్యలు పరిష్కరించుకునే వ్యక్తులను ఈనాటి హిందూ సమాజ లో అతనికెవరూ కనిపించలేదు.

నిజం చెప్పాలంటే జాతి, కులమతాల విషయంలో రమేశ్‌కు ఎటువంటి పట్టింపులూ లేవు. ఇరుగు పొరుగునవున్న ఈ రెండు గ్రామాల ప్రజల్నీ పోల్చిచూసి నప్పుడు, కుల మతాల విషయంలోని పట్టింపు అసలే కనిపించేదికాదు. అది కేవలం మిథ్య అనిపించేది. అంతేగాక అసలు యీ కులమత భేదాలూ, సమాజంలోని యీ హెచ్చుతగ్గులే హిందూ జాతి పతనానికి కారణం ఐవుంటుందని కూడా అతను గ్రహించేసు కున్నాడు. ముస్లిమ్ జాతిలో ఉచ్ఛనీచాలనేవి లేవు; అందరూ సమానులే! అంచేతనే ఆ సమాజం అంత కట్టుదిట్టంగా వుంటుంది. ఈ జాతి భేద భావనే హిందూ సమాజాన్ని యింత భ్రష్టం చేసివుంటుంది. అయితే ఈ రోగానికి విరుగుడు లేదా? అనడిగితే లేదనే చెప్పవచ్చు. ఎంచేతనంటే గ్రామీణ సమాజంలో అసలు యిలాంటి మాటే అనడానికి అవకాశం లేనప్పుడు, యిక వాళ్ళమధ్య పరస్పరాభిమానాలను కలిగించే యత్నం కేవలం నిష్ప్రయోజనమే అవుతుంది. ఇటు వంటి వ్యర్థ ప్రయత్నం కోసరం తన గ్రామంలో సంవత్స

రాలకరబడి కాలాన్ని దుర్వినియోగం చేసినందుకు అతనికీనాడు ఎంతో పశ్చాత్తాపం కలిగింది. ఇక ఈ వూరి గ్రామస్థులైన హిందువులు ఎంతకాలంనుంచో యీ అంతర్ద్వేషాలతో నే సతమతమై పోతున్నారు. ఇక వీళ్ళను సంస్కరించడం విధాత చెయ్యావలసినదే తప్ప, తనలాంటి వాడికి అసాధ్యంగా కనిపించింది. దీని కోసరం అవసరమైతే పునరాలోచించుకో కావాల్సిందే ననిపించింది.

అనేక ఇతర కారణాలవల్ల రమేశ్ ఈ మధ్య పెద్దమ్మను కలుసుకోలేకపోయాడు. ఆ రోజు దెబ్బలాట జరిగినప్పట్నుంచీ, ఆమెను ఒకసారి కలుసుకోవాలని అనేకసార్లు అనుకున్నాడు. కాని అనివార్య కారణాలవల్ల అది సాధ్యం కానే లేదు. ఇవాళ ఉదయమే ఆ యింటికి వెళ్ళి వరండాలో నిలబడ్డాడు. పెద్దమ్మ వివేచనాశక్తి, దూరదృష్టి పట్ల అతనికెంత గాఢమైన విశ్వాసం వున్నదో అతనికే తెలియదు. వరండాలో అంత తెల్లవారు ఝామునే స్నానంచేసి, శుభ్రమైన బట్టలు ధరించి ఏదో పుస్తకం చదువుతూ ఆమె కనిపించేసరికి, రమేశ్‌కు ఎంతో ఆశ్చర్యం కలిగింది. ప్రభాతకాలపు నిర్మలమైన వెలుగులో ఆమెను చూడటమే ఒక వింత అనుభవంగా తోచింది అతనికి. ఆమె కళ్ళజోడు పెట్టుకుని ఏదో పుస్తకం చదువుతూ, యాదృచ్ఛికంగా తలెత్తి చూసేసరికి ఎదురుగా రమేశ్ కనిపించాడు. అకస్మాత్తుగా అతన్ని చూడడంతో ఆమెకు కూడా కాస్త ఆశ్చర్యం కలిగింది. వెంటనే పుస్తకం మూసి అతన్ని ఆదరంగా లోపలికి ఆహ్వానించి కూర్చోబెట్టింది. కొన్ని క్షణాలు తన మధురదృష్టితో అతన్ని

చూసి; "ఏంనాయనా రమేశ్, యింత పెందలాడే వచ్చావు?" అనడిగింది. ఆప్యాయంగా.

"నిన్ను చూసి చాలా రోజులైందిగదూ పెద్దమ్మా! చూడాలనిపించి వొచ్చాను. అదీగాక పీర్‌పూర్‌లో మరో క్రొత్తస్కూలు కూడా స్థాపించాము" అన్నాడు.

"అవును ఆ సంగతి విన్నాను! కాని మన వూళ్ళో స్కూలుకు యిదివరలో లాగా నువ్వు వెళ్ళడం లేదుట, నిజమేనా?" అని అడిగింది.

ఆ సంగతే చెప్పాలని వచ్చాను పెద్దమ్మా! ఈ వూరి వాళ్ళ కోసరం ఏ మంచిపనిచేసినా వ్యర్థమే ననిపిస్తుంది. పొరుగువాడి పచ్చదనం చూసి సహించలేని వీళ్ళకు మనం ఏ హితోపదేశాలు చెయ్యగలం? వీళ్ళకున్నంత అహంకారం అజ్ఞానం ప్రపంచంలో మరెవ్వరికీ వుండవేమో ననిపిస్తుంది. ఇలాంటి వాళ్ళకోసరం మనం యెంత శ్రమపడ్డా-అంతా బూడిదలోపన్నీరే అవుతుంది. మన శ్రమ ఫలించేచోట ఎంత శ్రమపడినా అది అంతరాత్మకు శ్రమ అనిపించదుగదా! అందుకే వాళ్ళ శ్రేయస్సు కోసమే పాటు పడదామనిపిస్తున్నది." అన్నాడు రమేశ్ ... ...

"నువ్వు చెప్పేది క్రొత్త సంగతేమీకాదు రమేశ్, గతంలో చాలామంది చెప్పిందే! ఈ పృథ్విమీద నిజమైన శ్రేయోభిలాషులకు శత్రువులు కూడా ఏమంత తక్కువ వుండరు. అందుకని గతంలోని చాలామంది భీరువుల్లాగే నువ్వూ వెనకడుగు వేస్తే...యింక సాధించేదేమిటి? ఈ మహత్తరమైన భారాన్ని భగవంతుడే నీకు అప్పజెప్పాడు;

ఈ బరువు నువ్వు మోయకతప్పదు... అది సరేకాని రమేశ్, నువ్వు వాళ్ళ చేతిపళ్ళుకూడా త్రాగుతున్నావటగా! నిజమేనా? అనడిగింది ఆమె.

రమేశ్ నవ్వుతూ, "అప్పుడే అలాంటి ఫిర్యాదులు నీ దాకా వచ్చాయన్నమాట! ఇంకా త్రాగలేదుగానీ, నిజంగా త్రాగితే మాత్రం తప్పేమిటి? మీలాగా నాకు జాతిభేదాలు లేవు" అన్నాడు. పెద్దమ్మ ఆశ్చర్యపడుతూ, "ఏమిటీ, జాతి భేదాలు లేవూ? అయితే సనాతన ధర్మాలను కూడా నువ్వు పాటించవన్నమాట!"

"సనాతనధర్మాలు కొన్ని లేవని నేననను, ఉన్నాయ్. కాని వాటిని నేను పాటించను." అన్నాడు.

"ఎందుకని?"

రమేశ్ ఉత్తేజితుడై, "ఎందుకో ఆ సంగతికూడా చెప్పాలా? ఈ జాతి భేదమనే దుర్భావనే ఈ మానవ సమాజాన్ని యింత కలుషితం చేసింది. సమాజంలో కొందర్ని మనం నీచులుగా పరిగణిస్తే వాళ్ళు ఎప్పుడూకూడా ఉచ్ఛ జాతులమీద తిరుగుబాటు ధోరణితోనే ఆలోచిస్తుంటారు. తమకు అంటగట్టిన నీచత్వాన్ని వొదిలించుకోడానికే వాళ్ళు అన్ని విధాలా ప్రయత్నిస్తారు. ఉచ్ఛజాతుల క్రింది బానిసత్వాన్ని రూపుమాపుకోడానికే వాళ్ళు శతవిధాల యత్నిస్తారు, అది సహజం కూడాను. హిందూజాతిలో "సంఘటిత శక్తి" అనేదిలేదు. నిజం చెప్పాలంటే ఈ జాతి తమను తామే అంతరింప జేసుకునే ఒకరకం. భస్మాసురజాతి! తమ తమ జాతులను అన్నివిధాలా పరిరక్షించుకుంటూ అభ్యు

దయాన్ని సాధించకం అనేది ప్రాచీనకాలంనుంచీ వున్న ఒకానొక ధర్మం! కాని మన హిందూజాతి ఈ ధర్మాన్ని త్యజించడం వల్లనే నానాటికి భ్రష్టమై పోతున్నది. ఇంకా ఆ విధంగానే హిందూజాతి క్రమంగా అంతరించిపోతూ, అదే చోట ముస్లిముజాతి తన ఆధిక్యతను నిలబెట్టు కుంటుంది. ఐనప్పటికీ హిందూజాతికి వివేకోదయం కావడంలేదు."

విశ్వేశ్వరి నవ్వి; నీ మాటలు విన్న తరువాత కూడా నాకు వివేకోదయం జరగనట్టు! రమేశ్, ఒక్క సంగతి చెబుతావిను. హిందూజాతి క్రమంగా అంతరించి పోతున్నదనే నాకు తెలుసు. అంతవరకూ అంగీకరిస్తాను. కాని అట్లా జరిగేందుకు కారణాలు వేరు. ఆ దోషం సమాజానిదే! అంతే కాని నీచజాతివాళ్ళ జాతి భ్రష్టత వల్లనే హిందువులు నశించి పోతున్నారనే మాట నేను ఒప్పుకోను." అన్నది.

కాని అనుభవజ్ఞులు చెప్పేది అదేగద!" అన్నాడు రమేశ్.

"అనువజ్ఞుల అంచనాకు తర్కానికీ సంబంధ మేమిటి రమేశ్? పోనీ ఈ ప్రశ్నకు సమాధానం చెప్పు; ఎక్కడైనా ఏ గ్రామంలోనైనా ఫలానా యింతమంది నిమ్న జాతివాళ్ళు ఏముస్లిమ్మతాన్నో క్రైస్తవమతాన్నో స్వీకరించారని లెక్క గట్టి చెప్పగలవా? చెప్పలేవు; ఆ సంగతి నాకు తెలుసు." అన్నది విశ్వేశ్వరి.

రమేశ్ మళ్ళీ తర్కిస్తూ, "అయితేమరి నిమ్నజాతి వాళ్ళు ఉచ్చజాతివాళ్ళను ఎప్పుడూ తిరస్కార భావంతోనే చూడ్డానికి కారణం ఏమిటి?" అనడిగాడు.

రమేశ్‌కు అకారణంగా కోపం కలగడం చూసేసరికి విశ్వేశ్వరికి నుళ్ళీ నవ్వొచ్చింది. ఆమె నవ్వుతూనే 'కాదు నాయనా రమేశ్ కాదు. ఇది పట్టణం కాదు, పల్లెటూరు! ఇక్కడ ఉచ్ఛజాతి, నీచజాతి అనే పేరుతో ఎవరికీ ఎవరిమీదా ద్వేషాలుండవు. ఈ రెండురకాల జాతులూ పల్లెప్రాంతాల్లో సోదరజాతుల వంటివి. మాట వరుసకు ఏక గర్భ జనితులైన అన్నదమ్ముల వంటి జాతులివి ఒకటి రెండు సంవత్సరాలు వెనక పుట్టినంత మాత్రాన ఏ తమ్ముడూ తన అన్న పట్ల ద్వేషాన్ని, అసహ్యాన్ని ప్రదర్శించడో అలాగే ఉచ్ఛజాతి పట్ల నీచజాతి ఏ విధమైన క్రౌర్యాన్నీ ప్రదర్శించదు. ఇక్కడి కాయస్థులు తాము బ్రాహ్మణజాతీయులం కాలేకపోయామని ఎవడూ బాధపడడు. కాయస్థులూ బ్రాహ్మణులూ కులం దృష్ట్యా సమంగా వుండాలని కూడా ఎవడూ కోరడు. కాయస్థులు బ్రాహ్మణ పాదధూళి స్వీకరించడానికి ఏ మాత్రం సంకోచించరు. అన్నపాదధూళి స్వీకరించడానికి తమ్ముడు యెలా తిరస్కరించడో యిదీ అంతే! భేదం లేదు. అంతేగాని మానవ సమాజంలో అంతర్ద్వేషాలకు కులమతాలు కారణం కాదు."

రమేశ్ లోలోపలే ఆశ్చర్యపడ్డాడు. మరి అయితే అదరతా అట్లా ఎందుకు జరుగుతున్నది? ఆ గ్రామంలో అన్ని ముస్లిమ్ కుటుంబాలున్నాయ్. వాళ్ళలో ఎవరూ కూడా తమలోతాము ద్వేషించుకోరు సరిగదా, పరుల కష్టసుఖాలు తమవిగా సమిష్టివిగా ఎందుచేత భావిస్తున్నారు? ఆ రోజున ద్వారకానాథ్‌ఠాకూర్ శవం అన్ని గంటల తరబడి

అలాగే పడివున్నదే తప్ప. ఏ హిందువైనా ముందుకు రాగలిగాడా? వాళ్ళలో ఆనాడు ఏ కొంచెమైనా దూరదృష్టి. సమిష్టి బాధ్యతా కనిపించిందా? ఆ దౌర్భాగ్యుడు జీవించి వుండగా ప్రాయశ్చిత్తంచేసుకో లేదనే గద; ఆ శవాన్ని అల్లా వొదిలిపెట్టి వూరుకున్నారు? ఏం పెద్దమ్మా మాట్లాడవేం...?" అన్నాడు రమేశ్.

విశ్వేశ్వరి సమాధానం చెబుతూ; "అవును నాయనా ఆ సంగతి నాకు తెలుసు. కాని అదట్లా జరగటానికి కుల భేదాలు జాతి భేదాలూ కారణంకాదు. వాస్తవం ఏమిటంటే ముస్లిం జాతిలో ఈ నాటికీ ఒక విశిష్టమైన సజీవధర్మం ఒకటుంది. అది మన హిందూ జాతిలో లేదు. మన జాతిలో 'సజీవధర్మం' అని చెప్పబడేది ఈ నాటి గ్రామీణ సమాజంలో ఎచ్చటైనా లేకుండా అంతరించిపోయింది. ఈ నాడు మిగిలి వున్నవల్లా కేవలం అర్థం పర్థంలేని ఆచారవ్యవహారాలు, అంతకంటే అర్థరహితమైన కుహనా సంస్కారాలు మిగిలివున్నాయి."

రమేష్ హతాశుడై దీర్ఘంగా నిట్టూర్చి; "అయితే దీనికి విరుగుడు లేదా?" అనడిగాడు.

"ఎందుకు లేదు నాయనా, వుంది. జ్ఞానమార్గం ఒక్కటే దీనికి చివరిదారి. ప్రజల్ని విజ్ఞాన వంతులుగా తీర్చి దిద్దకోగలిగిన నాడే ఈ సమాజం బాగుపడుతుంది. జ్ఞాన దారిద్ర్యమే ఈ నాటి సమాజంలోని అన్ని అనర్థాలకూ మూలం! ఇప్పుడు నువ్వు పయనిస్తున్న మార్గమే విశిష్టమైనది. దాని వల్లనే ఈ సమాజానికి ఏ కొంచెమైనా మోక్షం సిద్ధిస్తుంది.

మాత్రం అతను అంగీకరించలేక పోతున్నాడు. రమేశ్ మనసులోని ఈ వైవిధ్యాన్ని పసిగట్టి "రేపటికే ఏదో మార్గం కనుక్కోవాలనీ; అసాధ్యాన్ని అకస్మాత్తుగానే సాధ్యం చెయ్యాలనీ తాపత్రయపడకు రమేశ్! జాతిభేద భావనే నిన్ను సందిగ్ధంలో పడవేస్తున్నది. జాతిభేద నిర్మూలనే అభ్యుదయ సాధనకు మార్గం అయినప్పటికీ దాన్నే ప్రధాన కారణంగా బహిర్గతం కానివ్వకూడదు. మొదటే ఆ సమస్యను తలకెత్తుకుని సతమతమై పోకూడదు. నా మాట మీద నమ్మకం లేకపోతే; నగర పరిసరాల్లోని గ్రామీణ జీవితాన్ని ఒక్కసారి చూడు; నీకే అర్థమౌతుంది." అన్నది విశ్వేశ్వరి.

కలకత్తా సమీపంలోని రెండు గ్రామాలలో రమేశ్ కు చక్కని పరిచయం వుంది. స్థూలంగా ఆ గ్రామాలను అక్కడి పరిస్థితులను, యిక్కడివాటితో పోల్చి చూసేసరికి అతని మనోనేత్రానికి కప్పబడిన నల్లనితెర తొలగిపోయినట్లయింది విచిత్రమైన ఆశ్చర్యంతో అతను విశ్వేశ్వరి ముఖాన్ని పరిశీలిస్తూ కూర్చున్నాడు. కాని ఆ సంగతి పెద్దగా గమనించకుండానే మామూలు ధోరణిలో చెప్పుకుపోతూ; "అందుకే నిన్ను యీ మాటకూ హెచ్చరిస్తున్నాను. రమేశ్! ఏ పరిస్థితుల్లోనూ నువ్వు గ్రామీణ జీవితానికి దూరంగా వెళ్ళవద్దు జన్మభూమిని పరిత్యజించి నందువల్ల అది బాగు పడుతుందనుకోవడం కేవలం భ్రమ. నీలాగే కొందరు పట్టణాలకు పోయి చదువుకొని సంస్కారవంతు లయ్యారు. అదృష్టవశాత్తూ వాళ్ళుకూడా నీలాగే గ్రామాల్లోకి తిరిగివస్తే యీ నాటి గ్రామీణ జీవనం యింత దుస్సహనీయమూ, దుర్గంధ భూ

యిష్టమూ కాకుండా వుండి వుండేది. నీలాంటి నిజ్ఞానవంతులు మరో పదిమంది వుంటే, యీ గోవింద గంగూలీ వంటి వాళ్ళు సంఘ నాయకులుగా చెలామణి అయ్యేవారూ కాదు; నీవంటి సృజనాత్మక కార్యదీక్ష కలిగినవాళ్ళు అకర్మణ్యంగా కూర్చునే పరిస్థితి వుండేదికాదు." అన్నది.

రమేశ్‌కు రమ సంగతి ఈ క్షణాన గుర్తొచ్చింది. ఆత్మాభిమాన పూరిత స్వరంతో "అకర్మణ్యంగా కూర్చున్నందువల్ల యిప్పుడు నాకేమీ చింత కలగడంలేదు పెద్దమ్మా!" అన్నాడు రమేశ్.

ఆ మాటలోని అంతరార్థం ఏమిటో ఆమె పసిగట్టింది కాని; కారణం మాత్రం ఆమెకు అర్థంకాలేదు. "అలా లాభంలేదు రమేష్. అసలు ఈ ప్రాంతాలకు రావడం అంటూ జరిగి, సంస్కరణ కార్యక్రమం ఎంతో కొంత ప్రారంభించినాక యిప్పుడు అర్థాంతరంగా వదిలెయ్యడం భావ్యంకాదు జన్మభూమి శ్రేయస్సు కోసరం నువ్వు ప్రారంభించిన ఈ సత్కార్యం యింతటితోనే ఆగిపోకూడదు." అన్నది విశ్వేశ్వరి.

"అదేమిటి పెద్దమ్మా! జన్మభూమి కేవలం నా ఒక్కడికే కాదుగద? విశ్వేశ్వరి ఉత్తేజితురాలై అవును నాయనా ఆ మాటకొస్తే ఈ జన్మభూమి నీ ఒక్కడికే! ఎంచేతనంటే జన్మభూమి యొక్క దుర్భరస్థితిని సరిగ్గా గమనించి అర్థం చేసుకున్నది నువ్వే!" ఇంతమంది జనంలో జనని ఆర్త నాదాన్ని వచ్చి రావడంతోనే విన్నవాడవు నువ్వొక్కడివే! అన్నది.

ఆ తరువాత రమేశ్ మరి తిరిగిరాలేదు. మా ఆవిడ చెప్పే పటి వరకూ అలాగే నిశ్శబ్దంగా కూర్చొని ఆ తరువాత విశ్వేశ్వరి పాదధూళి తీసుకుని వెళ్ళిపోయాడు.

భక్తి, కరుణ, కర్తవ్యనిష్ఠ మొదలైన భావాలతో అతని మనసు నిండిపోయింది. ఇంతకుముందే సూర్యోదయమైంది. తన యింటికి తూర్పుదిశలో కనిపిసున్న ఆకాశపు ఆస్పైన నీలాకాశం వైపు చూస్తూ నిలబడ్డాడు. ఇంతలో అకస్మాత్తుగా చిన్నపిల్లవాడి కంఠస్వరం వినిపించింది. వెనక్కు తిరిగి చూసేసరికి రమ తమ్ముడు జతీన్ గుమ్మానికి బయట నిలబడి తననే పిలుస్తున్నాడు.

రమేష్ అతని దగ్గరకొచ్చాడు. చెయ్యిపట్టుకుని లోపలికి తీసుకొచ్చి నెమ్మదిగా; "ఎవర్ని నువ్వు పిలిచేది?" అనడిగాడు.

"మిమ్మల్నే" అన్నాడు జతీన్.

"నన్నా! యిట్లా పిలవమని నీ కెవరు నేర్పారు?"

"అక్క" అన్నాడు జతీన్.

"అక్కా! అన్నాడు ఆశ్చర్యంగా రమేశ్. "అక్క నాతో చెప్పమని ఏమైనా చెప్పిందా?" అనడిగాడు.

జతీన్ తల అడ్డంగా ఊపుతూ; "లేదు నాకేం చెప్పలేదు. కాని తనతో పాటు నన్నుకూడా వెంటబెట్టుకు వచ్చింది." అని "అక్కడ నిలబడివుంది" అని దర్వాజావైపు చూపించాడు.

రమేశ్ ఆశ్చర్యపడి బయటకొచ్చి చూసేసరికి వరండాలో స్తంభాన్ని చాటుచేసుకుని రమ నిలబడివుంది. రమను

మరింత దగ్గరగా వచ్చి; "ఎంత అదృష్టవంతుణ్ణి! కాని మాట మాత్రం కబురు పంపితే నేనే వచ్చేవాణ్ణి కద! సరే, లోపలికి రా! అని ఆహ్వానించాడు రమేశ్.

రమ ఒక్క క్షణం సందేహించింది. ఆ తర్వాత జరీన్ చెయ్యి పుచ్చుకుని రమేశ్ వెంట లోపలికి వెళ్ళింది. గదిలో బల్లమీద కూర్చుని "నేనొక వస్తువును యాచించడంకోసరం మీ దగ్గర కొచ్చాను. మన్నిస్తారనే నమ్ముతున్నాను." అంది రమ. ఆ మాట విని రమేశ్ ముఖంలోనికి తదేకంగా చూస్తూ నిలబడింది. ఆ చూపులతో రమేషు హృదయ వీణా తంత్రులు ఒక్కసారిగా ఝుమ్మున మారు మోగి ఎక్కడికక్కడ ఛిన్నా భిన్నమై పోయినవి. ఇంతకు పూర్వం అతనిలోని అపూర్వ ఆశయాలూ, ఆకాంక్షలూ అన్నికూడా ఒక్కసారిగా అంతర్థానమైపోయి, కేవలం గాఢాంధకారమే మిగిలింది. తనను తాను సంబాళించుకుని "ఇంతకూ నువ్వు ఆశించేదేమిటి?" అనడిగాడు. కాని తన ముఖంలోని విషాదచ్ఛాయలు రమ గుర్తించకుండా దాచలేకపోయాడు. రమ మొదటి లాగానే తదేకంగా చూస్తూ; "ముందు వాగ్దానం చెయ్యాలి" అనడిగింది.

రమేశ్ నవ్వి, అది సాధ్యం కాదు రమా! ఏ సంగతీ తెలుసుకోకుండా వాగ్దానం చెయ్యగలిగే శక్తి గతంలో నాలో ఏ కొంచమైనా వుంటే — దాన్ని నువ్వే ధ్వంసం చేశావు. ఇప్పుడు నాలో ఆ శక్తిలేదు." అన్నాడు.

రమ ఆశ్చర్యంగా, "నేనా?" అన్నది.

"నీకు తప్ప ఆశక్తి యింకెవరికున్నది రమా! ఇవాళ నేనొక సంగతి చెబుదామనుకుంటున్నాను. నా మాటమీద నీకు విశ్వాసం వుంటే, నమ్మ లేకపోతే నిగిభ్యంతరంగా మానెయ్. అసలు యిదంతా యిప్పటికే సంపూర్తి ఐపోయి నట్లయితే ఈ సంగతి చెప్పవలసిన అవసరమే వుండేదికాదు" అని ఒక్క క్షణం ఆగి; "ఇవాళ; ఇటు నాకుగానీ అటు నీకుగానీ ఏ విధమైన కష్టమూ సుఖమూ లేదు కనుకనే ఈ సంగతి చెబుతున్నాను. ఆనాటివరకూ నా మనసులో నీకు సంపూర్ణ స్వాతంత్ర్యమూ, స్వేచ్ఛా వుండేవి నీకు లభ్యం కానిదటూ నాదగ్గర ఏమీ వుండేదికాదు. ఎందుకో తెలుసా?" అనడిగాడు రమేశ్.

రమ సిగ్గుతో తలవంచుకొని "తెలియదు" అన్నది. ఆమె హృదయం సిగ్గుతోనూ క్షోభతోనూ దహించుకు పోతున్నది.

"విని కోపగించుకోవద్దు రమా! నేను ముందే చెబుతున్నాను. ఇప్పుడు సిగ్గుపడవలసిన అవసరం కూడా ఏమీ లేదు ఇదేదో పాత కథ విన్నట్టుగానే విను." అన్నాడు రమేషు.

రమకు అయిష్టంగానే వుండి ఆ మాటలు వినకుండా వ్యతిరేకిద్దామనే మనసులో అభిప్రాయం. కాని సిగ్గుతో తల ఇంతగా వాలి పోయుందం టే తిరిగి ఏ క్షణకాలం కూడా అతని ముఖంలోనికి సూటిగా చూడలేక పోతున్నది. రమేషుమాత్రం ప్రశాంతంగానే; 'రమా నేనునిన్ను ఎంతగా ప్రేమించానో బహుశ నీకు తెలియదనుకుంటాను. నా జీవితకాలంలో నేను మనసారా

ప్రేమించిన వ్యక్తి అంటూ వుంటే-ఆమె నువ్వే తప్ప మరో కరు లేదు. చిన్నతనంలో మా అమ్మ మనిద్దరికీ వివాహం జరుగుతుందని అంటుంటే నేను చాలా సార్లు విన్నాను. ఆ తర్వాత ఆ ఆశలన్నీ అడియాసలై పోయిన రోజున నేను ఎంతగా కుమిలికుమిలి దుఃఖించానో, నాదురదృష్టానికి ఎంతగా విలపించానో నీకు తెలియదు. నాకారోజు ఇప్పటికీ బాగా గుర్తు!" అన్నాడు రమేశ్.

రమకు చెవుల్లో సీసం కరిగించి పోస్తున్నట్టుగా వుంది. తనకు అత్యంత పరిచితమైన అనుభూతిని, వేదనాభరితమైన గతానుభవాన్ని తిరిగి ఈనాడు అనుభవించవలసి వస్తున్నందుకు ఆమెకు ఎంతో కష్టంగా వుంది. కాని ఎంత ప్రయత్నించినా ఈ పరిస్థితినుంచి బయటపడేందుకు తనకు అవకాశమే లభించక అట్లాగే వింటూ శిలాప్రతిమలా కూర్చున్నది. విష-అమృతాల మిశ్రమంలాంటి రమేశ్ మాటలు ఆమె హృదయాన్ని ఎట్లాచీల్చుకు పోతున్నాయో ఆసంగతి సర్వాంతర్యామికే తెలుసు.

"ఇదంతా నీకు వినిపించడం నిజంగా అన్యాయమే! ఈ అనుమానం తోనే ఆనాడు తారకేశ్వర్‌లో నీ సాన్నిధ్యంలో భోజనం చేస్తూకూడా ఈ ప్రసక్తి తీసుకురాలేను. సరిగ్గా ఆనాడే నా గతజీవితాన్నంతటిని ఒక్క క్షణంలో మార్చివేశావు. ఆ క్షణాన నాలో కలిగిన భావోద్వేగాన్ని ఏంత తీవ్రంగా ప్రయత్నించి నిల్రదొక్కుకున్నానో నాకు తెలుసు. అది మాత్రం నాకు తీరని వేదనకాదా?" రమ ఇక భరించలేకపోయింది. ఆమె సహనం అంతరించి పోతున్నది.

మరో క్షణం తర్వాత; "మళ్ళీ ఇవాళ నన్ను ఒంటరిదాన్ని చేసి అవమానిస్తున్నారు." అన్నది.

"అవమానమా? ఏదీ? ఇందులో అవమానమేముంది? నేను ఎవరి కథైతే చెప్పబోతున్నానో, ఆకథకు సంబంధించిన రమా యీనాడు లేదు, రమేశ్ అంతకన్నా లేడు! సరే పోనీయ్. ఆనాడు అంత అపూర్వమైన సంపూర్ణ విశ్వాసం నీపట్ల నాకెందుకు కలిగిందో చెప్పలేనుకాని; నువ్వ ఏం చేసినా, చెప్పినా, అది నాశ్రేయస్సుకే చేస్తావనే నమ్మేవాణ్ణి. నాకు హాని జరగడం నువ్వు సహించవని, సహించే గుణం నీలో లేదనే పూర్తిగ నమ్మాను. ఆ కారణం చేతనే నీకు చెప్ప కుండానే నీఛాయలో నా శేషజీవితాన్ని ప్రశాంతంగా గడుపు దామని నిశ్చయించుకున్నాను. కాని... ఆ రాత్రి అక్బర్ నోటి నుంచి నువ్వే వాళ్ళను స్వయంగా... అరే, ఏమిటాగోల?" అని అటువేపు చూశాడు.

"బాబూ... అంటూ గోపాల్ సర్కార్ గాభరాగా లోపలికి పరుగెత్తుకొస్తున్నాడు రమేశ్ గదిలోనుంచి బయటికి వొచ్చేసరికి గుమాస్తా రొంగారుపడుతూ, "బాబూ... పోలీసులు భజువాను అరెస్టు చేశారు." అని చెప్పాడు.

"ఎందుకూ?"

"మొన్న రాత్రి రాధానగరంలో జరిగిన దొంగతనంలో భజువాకూడా వున్నాడని" అన్నాడు గుమాస్తా గోపాల్ సర్కార్.

రమేశ్ వెంటనే గదిలోపలి రమ నుద్దేశించి, "ఐతే నువ్వు వెంటనే యిక్కణ్ణుంచి తప్పుకో. పోలీసులు సోదా చెయ్యటానికి వొస్తారు." అన్నాడు రమేశ్.

రమ ముఖం నల్లబడిపోయింది. లేచి నిలబడి "మీకేమీ భయం లేదుగదా?" అని అన్నది.

"ఏమో చెప్పలేను. అసలు సంగతేమిటో నాకు తెలియదు." అన్నాడు రమేశ్.

అకస్మాత్తుగా రమ పెదాలు వొణికినయ్. తానే ఆరోజున ఫిర్యాదు చేసిన సంగతి ఆమెకు గుర్తొచ్చింది. రమ ఏడుస్తూ, "నేను వెళ్ళను!" అన్నది. రమేశ్ నిశ్చేష్టుడై అలాగే వున్నాడు కొన్ని క్షణాల వరకూ. "ఛీ ఛీ యిక్కడ వుండొద్దు రమా, చప్పున వెళ్ళిపో!" అన్నాడు.

ఆ తరువాత రమేశ్ రమ మాటలమీద శ్రద్ధ చూపలేదు. బలవంతంగా జతీన్నూ రమనూ చెయ్యి పుచ్చుకుని దొడ్డి వాకిలినుంచి బయటకు పంపించి లోపల గడియ వేశాడు.

# 13

దొంగతనం నేరంమీద భజనాను జైల్లో పెట్టి రమారమి రెండు నెలలు కావస్తున్నది. ఆరోజున సోదా జరిగినప్పుడు రమేశ్ యింట్లో అనుమానాస్పదమైన వస్తువేదీ దొరకలేదు. భైరవాచార్యులు సాక్ష్యం చెబుతూ, దొంగతనం జరిగిన

నాటి రాత్రి భజువా తనతోపాటే వున్నాడనీ, యిద్దరూ కలిసే సంతకు వెళ్ళమనీ చెప్పాడు. అయినప్పటికీకూడా భజువాను వ్యక్తిగత హామీల మీదకూడా పోలీసులు విడిచిపెట్టలేదు.

వేణీవచ్చి "రమా! మనం చాలా తెలివిగా యుక్తిగా వ్యవహరించాలిసుమా! లేకపోతే శత్రువు చేతిలో మనం హతమారిపోతాం! ఆనాడు చేపల వాటాకోసరం యజమాని చెప్పగానే వాడు యింతలావు లాఠీ పుచ్చుకు వచ్చాడే... ఆనాటి సంఘటన గురించి అప్పుడే రిపోర్టు రాయించవుంచడం ఎంత మంచి పనైనదో చూశావా? లేకపోతే, వాడిని యిరికించడం అంత తేలికైన పనికాదు. నౌకరుతోపాటే యజమాని పేరుకూడా ఆనాటి రిపోర్టులో యిరికించినట్లయితే... యివాళ ఎంత బావుండేది. ఆనాడు నేను ఎంతచెప్పినా నా మాట విన్నావుకాదు." అన్నాడు.

రమ ముఖం నల్లబడిపోయింది. ఇది గమనించి, "లేదు లేదు సాక్షం చెప్పడానికి నువ్వు బోను ఎక్కవలసిన అవసరం లేదు. ఒకవేళ అవసరమైతే మాత్రం తప్పేదేముంది? జమీందారీ కోసరం ఏమైనా చెయ్యవలసివస్తుంది." అన్నాడు వేణీ.

రమ కేవలం నిశ్శబ్దంగానే వుండిపోయింది. వేణీ మామూలు ధోరణిలోనే, "వాణ్ణి రొచ్చులో దింపడం అంత తేలికకాదు రమా! వాడు మాత్రం ఏమంత తెలివితక్కువ వాడా? వాడు స్థాపించిన కొత్త స్కూలువల్ల మనకు లాభమేగాని నష్టంలేదు. అసలే ముస్లిం రైతులు అసభ్యులు;

దానికితోడు చనుపూ సంధ్యకూడా వాళ్ళకు వంటబట్టిందంటే వాళ్ళు మన చెప్పుచేతల్లో వుండరు. ఇది నిజం!" అన్నాడు.

జమీందారీకి సంబాధించిన అన్ని వ్యవహారాల్లోనూ రమ, వేణీ సలహాలనే పాటిస్తూ వస్తున్నది. వాళ్ళిద్దరిమధ్యా యింత కాలంగా అసలు అభిప్రాయ భేదమేరాలేదు. కాని ఇవాళే మొదటిసారిగా, అతని అభిప్రాయానికి అడ్డుతగిలి, "అందువల్ల మనతోపాటు రమేషు కూడా నష్టపడతాడుగద!" అన్నది వేణీకి యిందులో సందేహంలేదు. అతను ముందుగానే ఒక నిర్ణయానికి వచ్చాడు గనుక దాని ప్రకారమే చెబుతూ, "వాడు తనకొచ్చే నష్టాన్ని గురించి ఎప్పుడూ ఆలోచించడు! ఏదోవిధంగా మనం వెనక పడిపోవడం, ఒక్కటే వాడిధ్యేయం! చూస్తూనే వున్నావుగా; ఈ వూరు వొచ్చినప్పట్నుంచి పిత్రార్జితపు ఆస్తిని ఎట్లా మంచినీళ్ళ ప్రాయంగా వాడుతున్నాడో! నిమ్నజాతి వాళ్ళందరూ అతన్ని 'చినబాబూ, చినబాబూ' అంటూ తెగప్రశంసిస్తారు కేవలంవాడొక్కడే మనిషైనట్టూ మనం కానట్టూ! కాని యిదంతా ఎంతోకాలం జరుగదు పోలీసుల దృష్టిలో వాణ్ణికూడా నువ్వు యిరికించావు గనుక యిక ఫరవాలేదు... చిట్టచివరిదాక ఆ వుచ్చులోపడి తన్నుకోవలసిందే!" రమ నోరెత్తలేదు.

వేణీకి ఆశ్చర్యం కలిగింది. తను చెప్పిన ఈ మాటలు విని కూడా రమ అట్లా తటస్థంగా అర్థహీనంగా వుండిపోవడం ఎందువల్లనో అతనికి అర్థంకాలేదు. సరికదా; తిరిగిరమే "ఆయన పేరు నేనే పోలీసులకు చెప్పాననే సంగతి ఆయనకు తెలుసా?" అనడిగింది.

"ఏమో! తెలియకపోతే తెలుస్తుంది. భజువా కేసులో అన్ని విషయాలూ తేటతెల్లమౌతవి."

రమ మళ్ళీ మాట్లాడలేదు. కాని ఆమె అంతరాత్మ మాత్రం తను చేసిన నీచకార్యాన్ని గురించి ఘోషిస్తూనే వుంది. మరో క్షణం తర్వాత రమ తలెత్తి "ఇప్పుడు ఎవరినోట విన్నా ఆయన మాటే!" అన్నది.

కేవలం మనవూళ్ళోనే కాదు; చుట్టుప్రక్క అయిదారు గ్రామాల్లో కూడా యిదే పరిస్థితి. ఆ వూళ్ళల్లో కూడా స్కూళ్ళు పెట్టడం రోడ్లు వేయించడం కూడా చేయిస్తున్నాడట! చివరకు పల్లీయులకు కూడా ఎంతెంత తెలివి తేటలొచ్చాయంటే, దొరల గ్రామాల్లో రెండేసి మూడేసి స్కూళ్ళు కూడా వుంటాయని తెలుసుకున్నారు. అందుచేతనే అక్కడి వాళ్ళంతా అంత మేధావులుగా వుండటానికి కారణమట. అంతేగాక కొత్తగా ఏ వూళ్ళో స్కూలు పెట్టిన తన వంతు రెండేసి వందల రూపాయలు చందా యిస్తానని ప్రచారం చేయించాట్ట! తన పిత్రార్జితం అంతా యిలాంటి కార్యాలకే వినియోగిస్తాట్ట. ఇక ముస్లిమ్‌లైతే అతన్ని సాక్షాత్తు 'దేవదూత' గానే ఆరాధిస్తున్నారు.

రమ హృదయంలో ఒక్క మెరుపు మెరిసి నట్లయింది. ఓహో, రమేశ్‌తో పాటు తానూ అంత కీర్తివంతురాలైతే ఎంత బావుండును? అనుకుంది. మరుక్షణంలోనే ఆమె మనస్సంతా రెట్టింపు అంధకారంతో నిండిపోయింది. "సరేకానీయ్ నేనూ అంత తేలిగ్గా అతన్ని విడిచిపెట్టను. ఎందుకూ పనికిమాలిన వాళ్ళు అంత ప్రయోజకులు కావడమూ; యింతంత

జమీందారీలు వుంటేకూడా మనం ఎందుకూ కాకుండా పోవడం ఎట్లా సాధ్యమో నేనూ చూస్తాను భైరవాచార్యులు సంగతిచూడు; వెధవ . భజువా తనుపున సాక్ష్యం చెప్పాడుట, పక్షి! చూస్తాగా—వాడి కూతురి పెళ్ళి ఎట్లా చేస్తాడో ! మరో ఎస్తుగడ వుండనేవుంది. గోవింద బాబాయ్ ఏంసలహా చెస్తాడో చూడ్దాం. ఏం, యీనాడు దేశంలో దొంగతనాలు జరగవా ఏం! ఈ కేసులో వాడి నౌకరుకు శిక్షపడితే...మరో కేసులో యజమానినే యిరికించడం ఎంతసేపు ?...నువ్వా మొదటే అన్నావు. శత్రుత్వంలో కూడా అతనేమీ తక్కువ తిన్నవాడు కాదని...నిమాటే నిజం అవుతుందని నేను ఆ నాడు అనుకోనే లేదు.” అన్నాడు వేణీ.

ఇప్పటికీ రమ నోరెత్తలేదు.

తన ప్రతిజ్ఞ, తన భవిష్యద్వాణి యధార్థంగా పరిణమించినప్పుడు కూడా, ఏ స్త్రీకైతే సంతోషం కలగదో ఆవిడ నిజంగా స్త్రీయేనా ? సంతోషం కలగకపోగా ముఖం నల్లబడి ఉదాసీన వైఖరి అవలంబించిందంటే ఆవిడ అంతరాత్మలోని ఆలోచనలు ఏమిటో పరాత్పరునికే తెలియాలికాని వేణీవంటి సాధారణ వ్యక్తికి ఏం అర్థమవుతుంది! కాని ఎవరికన్నా ఎవర్నీ మోసం చెయ్యాదు. రమ ముఖంచూసి వేణీ కూడా ఏకొంచెమో పసిగట్టాడు. ఆమె స్వభావం కూడా కాస్తో కూస్తో బాగానే తెలిసినవాడు గనుక లోలోపలే ఆశ్చర్యపడి వెంటనే వంటింటి వేపు వెళ్ళాడు. అక్కడ పిన్నితో ఏవో రెండు మూడు మాటలు మాట్లాడి వెనక్కి తిరిగివచ్చాడు.

అంతలో రమ వేణీని దగ్గరకు పిలిచి "అది సరేగాని రమేశ్ జైలుకుపోతే మనకు కళంకం కాదా" అనడిగింది.

వేణీ మరింత ఆశ్చర్యపడుతూ, "మనకేం కళంకం?" అన్నాడు.

"మనం ఎంత కాదనుకున్నా అతను మనకు పరాయి వాడు కాదుగద! అతనికే మనం ద్రోహం చేస్తే లోకులు ఏమనుకుంటారు?" అన్నది. రమ.

"ఎవడు చేసుకున్నది వాడనుభవిస్తాడు! అతనిసంగతి అతను చూసుకుంటాడు. ఇందులో మన దోషమేమిటి?" అనడిగాడు వేణీ.

రమ మరింత నెమ్మదిగా; "కాని రమేశ్ నిజంగా దొంగతనం చేస్తాడా? ఇతరుల శ్రేయస్సు కోసరం తనఆస్థినే త్యాగం చేసేమనిషి ఈ పనిచేస్తాడంటే ఎవరైనా ఎట్లా నమ్ముతారు? అతని సంగతి లోకులకు తెలియదా? ఇటువంటి పనులు మనం తలపెడితే... నలుగురిలో తల ఎత్తుకుని ఎట్లా తిరగ్గలం? అనడిగింది.

రమ ఒక్క క్షణం మనసులోనే యితని ముఖాన్ని రమేశ్ ముఖంతో పోల్చిచూసి, తలవంచుకుంది అలాగే వుండిపోయింది. "పల్లీయులు మనముందు భయంతోద్దీ నోరెత్త లేకపోవచ్చు. కాని మనిషి వెనుక రాజమతనైనా రాక్షసి అనేస్తారు. ఆ తరువాత ఎంత చింతించీ ఏం ప్రయోజనం. నువ్వు నా మాట నమ్మినా నమ్మకపోయిన అది నిజం. సర్వాంతర్యామి అయిన భగవంతుడు అన్నీ గమనిస్తూనే వుంటాడు. మనం యిక్కడ జిత్తులుపయోగించి నిర్దోషులను

దోషులుగా నిరూపించి శిక్షించినా, న్యాయాన్యాయాలు విచారించే నిజమైన హక్కు భగవంతునికే వుంది. వాడి చేతుల్లోంచి మనం తప్పించుకోలేము.'' అన్నది రమ.

వేణీ కృత్రిమ విషాదాన్ని ప్రదరిస్తూ, "నా దౌర్భాగ్యం మండిపోనూ! అసలు వాడే భగవంతుణ్ణి నమ్మడే! శీతారామా యీ కాపురముంటున్న యిల్లు కూలిపోవడానికి సిద్ధంగావుంది. మరమ్మత్తు చేయించమని అడిగితే ఏం చెప్పాడో తెలుసా?...అలాంటి అనవసరపు ఖర్చులకు తన దగ్గర డబ్బులేదట! అది నిజంగా దండుగ ఖర్చేనా? ముస్లిమ్‌లకు క్రొత్త స్కూళ్ళు పెట్టించడం మాత్రం దండుగ ఖర్చు కాదు. బ్రాహ్మణ పుటక పుట్టాడేగానీ, సంధ్యావందనంరాదు; గాయత్రీమంత్రం అంతకన్న తెలియదు! పైగా జాతిభ్రష్టుడైపోయి ముస్లిమ్ కుటుంబాల్లో యథేచ్ఛగా నీళ్ళుకూడా వాగుతున్నాట్ట! కాస్తంత ఇంగ్లీషు చదివాడేమో, కులంలేదూ గోత్రంలేదు అంటాడుట! రమా; కులమతాలు త్యజించిన వాడికి ధర్మశాస్త్రాలతో పనేమిటి?'' అనడిగాడు వేణీ.

రమ యింకమాటలు పెంచకుండా వూరుకోవడమే మంచిదనుకుంది. కాని రమేశ్ అనాచారాలూ, భగవంతుని పట్ల నిర్లక్ష్యమూ, ఆమెకు విరక్తి కలిగించినయ్. వేణీ చరచరా వెళ్ళిపోయాడు. రమ లోపలికి పోయి బల్లమీద కూలబడి పోయింది. ఇవాళ ఏకాదశి, తిండీ తిప్పల బెడదలేదు. అంచేత నిశ్చింతగా శ్వాస పీల్చింది.

# 14

వర్షాకాలం వెళ్ళిపోయింది. వచ్చే దుర్గపూజా మహోత్సవాల ఆనందం, మలేరియా పీడా నెమ్మదిగా బెంగాలీ గ్రామీణ సమాజంలో తొంగిచూస్తున్నయ్. రమేశ్ కూడా జ్వరం తగిలింది. గత సంవత్సరం మలేరియా రాక్షసి నుంచి తప్పించుకున్నాడు గానీ ఈ సంవత్సరం తప్పించుకో లేకపోయాడు. మూడు రోజుల తర్వాత యివాళే కాస్త లేచి కూర్చుని క్వైనైన్ మాత్రం వేసుకున్నాడు. కిటికీలోంచి దూరంగా ఆరుబయట చూస్తుంటే కనుచూపు మేర అంతా పనికిమాలిన అడివే! దానివల్ల ప్రయోజనం ఏమిటీ? దీన్ని నిర్మూలించడానికి గ్రామస్థులు సహకరిస్తారో లేదో తెలియదు. మూడురోజులు తీవ్రమైన జ్వరం తగిలిన తరువాత అతనికి కలిగిన మొదటి ఆలోచన యిదే! ఏమైనాసరే ఏదో విధంగా దాన్ని నిర్మూలించే మార్గమేమిటో చూడాలి అనిపించింది. మనిషిగా పుట్టి అకర్మణ్యంగా పడివున్నందువల్ల నెలనూ రెండు నెలలకూ మలేరియా రాక్షసి యిట్లా ఆవరిస్తూనే వుంటుంది. ప్రజలను పీల్చి పిప్పిచేస్తూనే వుంటుంది. కొన్నాళ్ళ క్రితం ఈ విషయాన్ని గురించి కొంతమందితో ముచ్చటించి చూశాడు. సారాంశమేమిటంటే, మలేరియా రోగంవల్ల కలిగే నష్టాలేమిటో ఈ పల్లీయులలో చాలామందికి అసలు తెలి

యదు; తనకు తప్ప! అదీగాక యితరుల స్థలాల్లోని పెంటకుప్పలనూ చెత్తా చెదారాన్ని నిర్మూలించడానికి. స్వంత ఖర్చుతో మలేరియా దోమలను తోలుతూ కూర్చోడానికీ ఆ వూళ్ళో ఎవడూ సిద్ధంగా వున్నట్టు కనిపించలేదు. స్వస్థలాల్లోని పెంటకుప్పలనూ, పనికిమాలిన అడివిని నిర్మూలించడానికి ప్రతివాడూ ఏవో సాకులు చెప్పేవాడే! అసలు ఆ చెత్తా చెదారం అంతా తాము సృష్టించింది కాదనీ; తాత ముత్తాల కాలంనుంచీ అదట్లాగే వున్నదని చెప్తారు. ఎవరికి అవసర మనుకుంటే వాడే బాగు చేసుకుంటాడుగాని మన కెందుకు అనే అంటారు ప్రతివారును!. అందు కోసరం ధనంగానీ శారీరక శక్తినిగానీ ఉపయోగించడానికి ఎవరూ ముందుకు రావడంలేదు. ఈ స్థితి కేవలం ఈ వూళ్ళోనే కాక చుట్టుప్రక్కల గ్రామాల్లో కూడా అంతే! ఒకో గ్రామంలో మలేరియా వూరంతటినీ పొట్ట బెట్టుకుంటే, మరో వూళ్ళో దాని ఛాయ ఐనా కనిపించదు. కాస్త వంట్లోకి ఓపిక వస్తే ఈ మలేరియా నిర్మూలనకు ఒక పథకం తయారు చేయాలని రమేశ్ ఆలోచించాడు. తను ప్రాణ పదంగా చూసుకునే పీర్ పూర్ గ్రామస్థులైనా, కనీసం తనమాట పాటించ గలరన్న నమ్మకం అతనికి కలిగింది. రమేశ్‌కు ఇంజనీరింగ్ తెలుసు. ఇంతకాలం తర్వాత ఒక మహత్తరకార్యం లభించినందుకు తనలోతానే సంతోషించాడు.

ఇంతలో ఏడుపు వినిపించేసరికి రమేశ్ ఆ దిక్కుగా చూశాడు. భైరవాచార్యులు పెద్దపెట్టున ఆడదానిలా నెత్తీ నోరూ కొట్టుకుంటూ ఏడుస్తున్నాడు. ఆయనతోపాటువ జేసిని

డేళ్ళ పిల్లకూడా వచ్చింది. తండ్రితోపాటు ఆ పిల్లకూడా గొంతు కలిపేసరికి యిక యిల్లంతా ఏడుపుతో మారుమ్రోగి పోయింది. చూస్తూ చూస్తుండగానే ఆ ఏడుపువిని చుట్టు ప్రక్కల వాళ్ళంతా పెద్దగుంపుగా పోగయ్యారు. రమేశ్ నిర్ఘాంతపడి అట్లాగే చూస్తున్నాడు. భైరవుని తరపున బంధువులే పోయారో, ఏమైందో అసలు ఏ సంగతీ తెలియడంలేదు. అసలు ఆయన ఏ కారణం వల్ల ఏడుస్తున్నాడో రమేశ్‌కు అర్థంకాలేదు. ఎవరిని అడిగేట్టు? అతనికేమీ తోచలేదు. గుమస్తా గోపాల్ సర్కార్ అక్కడి కాగితాలు అక్కడే వొదిలేసి గాభరాగా పరుగెత్తుకొచ్చాడు. భైరవును ఓదార్చడానికి ప్రయత్నించేసరికి, భైరవుడు చప్పున గోపాల్‌సర్కారును కావలించుకుని మరింత ఘోరున ఏడుపు ప్రారంభించాడు. భైరవుడు యింత ఘోరంగా ఆడదానిలాగా ఏడవగలడని రమేశ్ ఎన్నడూ అనుకోలేదు. గోపాల్ సర్కార్ ఎంతో సేపు సముదాయించిన తరువాత; భైరవుడు క్రమంగా ఏడుపు స్థాయిని తగ్గించాడు. తాపీగా కళ్ళు తుడుచుకుని పీటకు జారగిలిబడి ఈ మహాశోకానికి గల కారణం వివరించాడు. అతను చెప్పినది విని రమేశ్ స్తబ్ధుడైపోయాడు. ఇటువంటి అత్యాచారాలు కూడా జరుగుతాయని రమేశ్ ఎన్నడూ కనీ వినీ ఎరుగడు. అసలు సంగతేమిటంటే, భైరవాచార్యుని సాక్ష్యం ఆధారంతో భజువా విడుదలయ్యాడు. పోలీసుల సందేహదృష్టి నుంచి భజువాను తప్పించడం కోసరం వాణ్ణి వాళ్ళ వూరు (గోరఖ్‌పూర్) పంపించివేశాడు. కానిసాక్షిమాత్రం ఉచ్చులో యిరుక్కుపోయాడు. భైరవునికి రాబోయే మహావిపత్తు

వూళ్ళో ఎట్లాగైతే సింగోగాని; ఆసంగతి తెలియగానే భైరవాచార్యులు సరాసరి జిల్లాకోర్టుకు వెళ్ళాడు. అక్కడ విచారించగా తెలిసిన సంగతేమిటంటే, వేణీబాబు పినతండ్రి వియ్యంకుడు, రాధానగర్ నివాసియైన సనత్ ముఖర్జీ; భైరవుని మీద వడ్డీ అసలు ఫాయిదాలతో సహా పదకొండు వందల అరవైరూపాయల పదణాలకు డిక్రీ పొందాడు. ఈ డిక్రీ నాలుగైదు రోజుల క్రితమే జారీ అయింది. ఈ డిక్రీని భైరవుని స్థిరాస్థియైన ఇల్లూ-వాకిలిమీద అమలు జరపడానికి ఏర్పాట్లు జరిగినయ్! పైగా ఇది పరోక్షపు డిక్రీకూడా కాదు. ప్రతివాది పేర సమను జారీకావడం భైరవుని పేరుమీద మరోకడు హాజరై అప్పును అంగీకరించడం జరిగిపోయింది. నిజానికి అసలు అప్పూలేదు; కోర్టులో హాజరైనవ్యక్తి అసలు భైరవాచార్యులు కాదు! ఇంత విచిత్రమైన కుట్రపన్ని ఈ పేద బ్రాహ్మడికి జోలి కట్టబెట్టి వూరినుంచే ఉద్వాసన చెప్పడానికే యీ ఉచ్చు పన్నారు, కోరులో దీనికి విరుద్ధంగా యిప్పుడు ఏం చెయ్యాలన్నా సాధ్యరాదు. చట్టప్రకారం ఏదైనా చర్య తీసుకోవాలన్నప్పటికీ, ముందు వడ్డీ అసలు ఫాయిదాలు చెల్లించి ఋణవిముక్తుడైతే తప్ప, మరోదారి లేదు. కాని యింత డబ్బు కటిక దరిద్ర బ్రాహ్మణుడైన భైరవుని దగర ఎక్కడుంది?. ఈ అన్యాయాన్ని ఎదుర్కోడానికిగానీ అప్పీలు చేసుకోడానికిగాని ముందు కోర్టులో డబ్బు చెల్లించాలి. ఆ తరువాత ఆత్మరక్షణకు ఏదైనా దారి దొరుకుతుంది. చట్టమూ, కోర్టూ, జడ్జీ అందరు యిప్పుడు నెత్తినెక్కి కూర్చున్నారు. వీళ్ళందరికీ అట్టడుగున దరిద్ర బ్రాహ్మణుడు

అణగారిపోతున్నాడు. ఈ కుట్రంతా వేణీబాబూ గోవింద గంగూలీ కలిసే చేసినపని అనే సంగతి అందరూ పసిగట్టారు. కాని భైరవునికి ఏగతి పడుతున్నా, యీ అన్యాయం యింత బాహాటంగా జరిగిపోతున్నా; అందరూ గుసగుసలుగా చెప్పుకునే వాళ్ళు, ఎదిరించేందుకు ప్రయత్నించేవాళ్ళు ఒక్కరూ కనిపించలేదు. ఎవరిమట్టుకు వాళ్ళు ఏమీ సంబంధం లేనట్టు తప్పుకునే వాళ్ళే! కాని కోర్టులనూ, చట్టాలనూ అడ్డంపెట్టుకుని ఈ నరపిశాచాలు గ్రామస్థుల జీవితాలతో ఎలాంటి చెలగాటాలాడుతుంటారో రమేశ్ యివాళ స్పష్టంగా చూడగలిగాడు. ఒకవైపు డబ్బూ, యుక్తీ ఉపయోగించి ప్రభుత్వ శిక్షలనుంచి ఈనరపిశాచాలు ఎలా తప్పుకుంటాయో, మరోవైపున జీవన్మృతులవంటి ఈ అమాయక పల్లెయులు వాళ్ళ దుశ్చర్యాలను అలాగే సంహిస్తుంటారు అందువల్లే ఈ నరపిశాచాలు అసంఖ్యాకమైన యిలాంటి నిచకార్యాలు చేస్తూకూడా, సిగ్గూయెగ్గూ లేకుండా నిర్భయంగా తలెత్తుకు తిరుగుతూ మృతప్రాయమైన ఈగ్రామీణ జీవితంమీద నిశ్చింతగా నాట్యం చేస్తుంటారు! ఇవాళ సరిగ్గా పెద్దమ్మ చెప్పిన మాటే గుర్తొచ్చింది. ఆనాడు ఆమె మర్మగర్భితం గానన్నీ; "రమేశ్; కులభేదాలు సంగతి; దాన్నట్లా తగలబడి వుండనీ... నాయనా; చీకట్లో కావలసింది కేవలం వెలుగు. ఈనాటి గ్రామీణ జీవితం అజ్ఞానాంధకారంలో మునిగి తేలు తూంది! నువ్వు ఒకే ఒక్క సత్కార్యం చెయ్యినాయినా... ముందు వాళ్ళకు జ్ఞానోదయం కలిగించు. అసలు వెలుగుఅంటే ఏమిటో వాళ్ళను తెలిసికోనీయ్. ఆ తరువాత వాళ్ళే కళ్ళు

తెరిచి ఏది తెలుపో, ఏది నలుపో చూడగలుగుతారు. ఎటు గూడీ వచ్చావు; వచ్చినవాడవు మళ్ళీ గ్రామీణ జీవితం విడిచి దూరంగా వెళ్ళిపోవద్దు! మీ లాంటి వాళ్ళందరూ క్రమంగా దూరమవుతూ వుండబట్టే ఈ గ్రామీణ జీవనంలో నరరూప రాక్షసులు యథేచ్ఛగా శివతాండవ నృత్యం చేస్తున్నారు; అని అన్నది. నిజంగా పెద్దమ్మ ఎంత గొప్పమాట చెప్పింది. నిజంగా యివాళ తానే లేక పోయినట్లయితే ఈ అన్యాయాన్ని ఎదుర్కొనడానికి ఎవడు సిద్ధపడేవాడు?

రమేశ్ దీర్ఘంగా నిట్టూర్చి తనలోతానే "ఓహో ఆదర్శగ్రామీణ జీవనమా! ఏ స్థితికొచ్చావు! ఒకప్పుడు సహృదయులకూ సన్మార్గవర్తనులకూ గ్రామీణ ప్రాంతమే జన్మభూమిగా వుండేది. ఆనాడు దుష్టశిక్షణ, శిష్టరక్షణా జరుగుతూవుండేది. కాని ఈ నాటి గ్రామీణ జీవితం కేవలం శవప్రాయంగానే తయారయ్యింది. అసహాయులైన గ్రామస్థులు అజ్ఞానంలో మునిగి అర్థరహితమైనసాంప్రదాయాలకూ సనాతన ధర్మాలకూ బానిసలై పోతున్నారు. రోజు రోజుకూ, గ్రామీణ జీవితం నిర్జీవ, విషాదభరితమై పోతున్నది. ఏనప్పటికీ గ్రామస్థులు కళ్ళు తెరవలేక పోతున్నారు. అందువల్ల పీడితుల వ్యథలు నానాటికీ పెరిగిపోతున్నాయ్. వాటిని తిరస్కరించడమే పల్లీయుల మహాపాపంగా పరిగణిస్తున్నారు. ఆ మహాపాపమే వాళ్ళను ఈడ్చుకు పోతున్నది.

ఈ ఆలోచనలతో రమేశ్ కొంత సేపటివరకూ అలాగే కూర్చుండిపోయాడు. అకస్మాత్తుగా అతని ప్రస్తుత కర్తవ్యం ఆలోచన కొచ్చింది. వెంటనే ఆ మొత్తానికి ఒక చెక్కురాసి

గోపాల్ సర్కార్‌కు ఇచ్చి మీరు అన్ని విషయాలు క్షుణ్ణంగా విచారించి కోర్టులో యీ డబ్బు జమకట్టండి. అ తరువాత ఈ కేసును పునఃపరిశీలన జరిపేందుకు కోర్టుద్వారా వెంటనే చర్యతీసుకోండి. తిరిగి యింకెప్పుడూ కూడా యిలాంటి అత్యాచారాలు జరపకుండా వాళ్ళకు తగిన శాస్తి జరిగేట్టు కట్టుదిట్టంగా చర్యలు తీసుకోండి.” అని చెప్పాడు.

చెక్కును తీసుకుని గోపాల్‌సర్కార్ కొన్ని క్షణాల వరకూ నిశ్చేష్టుడై నిలబడి పోయాడు. భైరవుడు కూడా అలాగే ఆశ్చర్యపడ్డాడు. రమేశ్ మళ్ళీ మొదట చెప్పినమాటే మరింత నొక్కి-చెప్పాడు. భైరవునికీ గోపాల్‌సర్కార్ యిద్దరు కూడా; రమేశ్ చెప్పేది నాటకమో నిజమో కొన్ని క్షణాల వరకూ అర్థంకాలేదు. నాటకం కాదని రూఢియైన మొదటి క్షణం భైరవుడు మళ్ళీ పిచ్చివానిలా ఏడుస్తూ రమేశ్ రెండు కాళ్ళూ పట్టుకున్నాడు. భోరున ఏడుస్తూనే రమేశ్‌ను దీవించాడు. భైరవుని పట్టు రమేశ్ గనుక విడిపించు కోగలిగాడు. గాని, అంతంతమాత్రం వాడైతే సాధ్యం కాకపోను. ఈ సంగతి మెరుపులాగా ఊరంతా తెలిసిపోయింది. ఈ సారి వేణీబాబూ, గోవిందుడుకూడా అంత తేలిగ్గా తప్పించుకో లేరని కూడా కొందరనుకున్నారు. శత్రువులకు తగిన శాస్తి జరపడానికే చినబాబు యింత డబ్బు ఖర్చు పెడుతున్నాడని కూడా మరి కొందరు అనుకొన్నారు. కాని భైరవునికి బదులు రమేశ్ బాబుకే ఈ ముళ్ళకిరీటం భగవంతుడు తగిలించినా, సంతోషంతోనే దాన్ని అతను శిరసావహించే వాడని, ఆ వూళ్ళో ఎవడూ అనుకోలేదు!

ఆ తరువాత ఒక నెల గడిచిపోయింది. రమేశ్ తనకు తానే స్వయంగా మలేరియా నిర్మూలన కార్యక్రమంలో మునిగిపోయాడు. భైరవాచార్యులు దావా సంగతి కూడా అతనికి జ్ఞాపకం లేదు. ఇవాళ సాయంత్రం మంగళ వాయిద్యాలు వినిపించేసరికి భైరవాచార్యుని మనుమని అన్నప్రాసన సంగతి గుర్తొచ్చింది. భైరవుడు తనను ఆహ్వానించినట్టు గుర్తు లేదు. గుమస్తాను అడిగినప్పటికీ అంటే నిజమయింది. కాని భైరవుడు అన్నప్రాసనకు కొంచెం ఘనమైన ఏర్పాట్లే చేశాడనే సంగతి కూడా అతనికి తెలియదు. మరి యింత ఘన కార్యం చేస్తూ వుండి కూడా భైరవుడు గత పదిహేను రోజుల్నుంచి అసలు కంటికే కనిపించలేదు. ఎందువల్ల? లోకులను ఆహ్వానించి తనను విడిచిపెడతాడా? ఈ అనుమానం అతనికి అసహ్యం వేసింది! శాలువా కప్పుకుని రమేశ్ తిన్నగా భైరవుని యింటివేపు బయల్దేరాడు. కొంతదూరం వెళ్ళాక రోడ్డుపక్కన నాలుగైదు కుక్కలు ఎంగిలి విస్తళ్ళకోసిరం కాట్లాడు కుంటున్నాయ్. మరి కొంత దూరంలో పొగాకు నములుతూ కొంతమంది డప్పులు వెచ్చచేసుకుంటున్నారు. వాళ్ళను కూడా దాటి భైరవుని యింటిముందు కొచ్చేసరికి చిన్న పందిరి వేసివుంది. ఊరందరూ ఉపయోగించుకునే పాత కాలపు పెద్ద లాంతర్లు వెలుగుతున్నయ్. వాటిని నుంచి పొగ వచ్చినంతగా వెలుతురు రావడంలేదు. దట్టమైన కిరసనాయిలు పొగతో అక్కడి వాతావరణమంతా కలుషితంగావుంది. శ్వాస పీల్చడానికూడా అవకాశం లేకుండావుంది. ఇరుగు పొరుగువాళ్ళు భోజనాలు చేసి వెళ్ళిపోతున్నారు. ధర్మదాసు

హరిహరరాయ్‌ను యింకాస్సేపు వుండిపొమ్మని మరీ మరీ ప్రతిమాలుతున్నాడు. గోవిందు గంగూలీ ఎవరితోనో మాట్లాడుతున్నాడు. సరిగ్గా అలాంటి సమాయాన కలలోలాగా రమేశ్ ప్రత్యక్షమయ్యేసరికి అందరి ముఖాలూ తెల్లబడి పోయినయ్. ప్రతిపక్షానికి చెందిన యిద్దరి వ్యక్తులమధ్య కూర్చుని భైరవుడు ఏవో మంతనాలాడటం చూసేసరికి రమేశ్ కూడా ముఖం వెలవెల పోయింది. అందరూ రమేశ్‌ను చూశారు. గాని ఎవడూ అప్పుడైనా సాదరంగా ఆహ్వానించలేదు. భైరవుడు అసలు చూడనట్టే నటించాడు. ఆ యింట్లో గోవిందుని చూసేసరికి రమేశ్ ఉలిక్కిపడ్డాడు వెంటనే వెనక్కు తిరిగి యింటిముఖం పట్టాడు. కాని రోడ్డుమీద అడుగు పెట్టడంతోనే అతను దిగ్భ్రాంతుడయ్యాడు; వెనకనుంచి ఎవరో "రమేశ్ బాబూ" అని పిలిచారు.

వెనుదిరిగి చూసేసరికి దీనూబాబు కనిపించాడు. అతను యిటువైపే వొస్తున్నాడు. బాగా దగ్గరకొచ్చి, "పదబాబూ, యింటికేగా ?" అన్నాడు.

రమేశ్ నవ్వడానికి ప్రయత్నించాడు గానీ సాధ్యం కాలేదు.

వెంట నడుస్తూ నడుస్తూ, "బాబూ ! భైరవునికి నువ్వు చేసిన సహాయం బహుశా వాడి తల్లితండ్రులు కూడా చేసి వుండరు ? ఆ సంగతి అందరికీ తెలుసు; ఏంలాభం పిల్లా జెల్లా ఇల్లూ-వాకిలీ, మంచీ చెడ్డా చూసుకోవాలిగద! రమేశ్ బాబూ అందువల్లే నిన్ను ఆహ్వానించడానికి... అర్థమైందా బాబూ భైరవునిదికూడా తప్పు కాదు! మీలాంటి ఈ కాలపు

వాళ్ళంతా నాగరికులు..కులభేదాలు పాటించారు!...అందు వల్లే.. అర్థమైందా బాబూ! ఇంకా రెండు రోజుల్లో పిల్ల దాని పెళ్ళికూడాను! దాన్నికూడా ఒకయింటిదాన్ని చెయ్యాలిగదా! లోకులుసంగతి నీకు తెలియనిదేముంది? అర్థం చేసుకోనాయనా!" అన్నాడు దీనుబాబు.

రమేశ్ హీనస్వరంతో "అవునవును అర్థమవుతూనే వుంది!" అన్నాడు. మాటల్లోనే రమేశ్ యింటిముంకు కొచ్చారు. ఇద్దరూ యింటిముందు నిలబడ్డారు. దీనూబాబు సంతోషాన్ని వ్యక్తపరుస్తూ "మీలాంటివాళ్ళు కాకపోతే మరెవరు అర్థం చేసుకుంటారు? పాపం భైరవుని తప్పేముంది? పాపం వాడూ పెద్దవాడైపోయాడు; వాడికీ పరలోక చింత అనేది వుందికదా!

"అవునవును!" అన్నాడు రమేశ్.

ఆ తరువాత రమేశ్ యింటి లోపలికి వెళ్ళిపోయాడు. గ్రామీణులు తనను వెలివేశారనే సంగతి తేలిగ్గానే అర్థం చేసుకున్నాడు. ఇంట్లో కూలబడి క్షోభతోనూ అవమానంతోనూ అతనికళ్ళు ఎరుపుగా మారినయ్. భైరవుడు వేణీని గోవిందుని అంత ఆదరంగా ఆహ్వానించి గౌరవించడం అతనికి మరింత కష్టం కలిగించింది. అంతేకాక అన్ని సంగతులూ తెలిసి కూడా, గ్రామస్థులు తనను బహిష్కరించి; భైరవుని ప్రవర్తనను సమర్థించడం హృదయానికి రంపపుకోతలా వుంది. తనకు చెప్పలేదు, కనీసం ఆహ్వానమైనా లేదు.

భైరవుని ప్రవర్తనే ప్రశంసా పాత్రమనే దృష్టితో చూస్తున్నారు. "ఓరి భగవంతుడా! ఏమిటిదంతా? రమేశ్ కుర్చీలో

కూలబడ్డాడు. దీర్ఘంగా నిట్టూర్చి "కృతఘ్నత జాతియొక్క ఈ మహా పాపానికి ప్రయశ్చిత్తమేమిటి? ఇంత అసహ్యామూ అనూహ్యామూ ఐన అవమానాన్ని నువ్వు ఎలా క్షమిస్తావు? అన తనలోతాను అనుకున్నాడు.

# 15

రమేశ్‌కు అసలు ఆ విధమైన అనుమానమే రాలేదు. కాని గోపాల్ సర్కార్ కచేరీ నుంచి తిరిగివచ్చి సరిగ్గా ఆ సంగతే చెప్పాడు! మరింత విచిత్రమైన సంగతేమిటంటే భైరవాచార్యులే పూర్తిగా కుట్రతో వ్యవహరించడం! అసలు జరిగిన సంగతేమిటంటే కోర్టులో పునఃపరిశీలన కోసరం వేసిన దావాకు భైరవుడు హాజరు కానేలేదు. అంచేత రెండో సారికూడా మొదటి తీర్పే ఖాయమై వ్రారుకుంది. రమేశ్ కోర్టులో కట్టిన డబ్బంతా వేణీకే దక్కింది. ఈ సంగతి తెలియడంతోనే రమేశ్‌కు వాళ్ళు తెలియని ఆవేశమూ, కోసమూ కలిగినయ్. దొంగదావానుంచి భైరవుని తప్పించ డంకోసరం తాను ఖర్చు పెట్టినదంతా యిట్లా బూడిదలో పన్నీరవుతుందని అతను అనుకోలేను. పోనీ భైరవుడైన విశ్వాస పాత్రంగా నిలివ గలిగాడా అంటే, అదీలేదు. లేక పోగా ప్రత్యర్థులతో చేరిపోయాడు! పోయిన డబ్బునుగురించి రమేశ్‌కేమీ చింతలేదుగానీ; మనుషులు యింతనీచాతినీచంగా

ఎట్లా వ్యవహరిస్తాగో అతనికి అంతుబట్టలేదు. పాముల్లోనూ తేళ్ళలోనూ మాత్రమే విషాన్ని చూశాడుగానీ; నిలువెల్లా విషం కలిగిన మనిషిని తానింత కాలమూ చూడనేలేదు. ఇంత కాలానానికి సరిగ్గా అలాంటి మనిషి భైరవుని రూపంలోనే కనిపించేసరికి అతని ఆగ్రహానికి హద్దులేకపోయింది. ఉన్న వాడు వున్నట్టే వెంటనే లేచి బయటకు బయల్దేరాడు. కోపంలో తనను తాను సంబాళించుకోగలిగిన స్థితికూడా అతనికి లేదు. చింతనిప్పులాంటి యజమాని కళ్ళుచూసి గుమస్తా అర్థంచేసుకుని అతి నెమ్మదిగా; "బాబూ! ఎక్కడికైనా వెడుతున్నారా ?" అనడిగాడు.

"ఇప్పుడే వొస్తాను" అని చప్పున దూసుకుపోయాడు రమేశ్.

భైరవుని యింటిముందుకెళ్ళి లోపలికితొంగిచూశాడు. ఎవరూ కనిపించలేదు. లోపలికి అడుగుపెట్టాడు. ఆ సమయాన ఆచార్యునిభార్య సంధ్య దీపం వెలిగించి తులసికోట దగ్గరకు వెళ్తున్నది. అకస్మాత్తుగా రమేశ్‌ను చూసి నిశ్చేష్టురాలై అలాగే నిలబడిపోయింది. రమేశ్ గతంలో ఎన్నడూ యిట్లా రాలేదు; యిప్పుడెందుకొచ్చాడో అర్థంకాక ఆమె గుండెలు దడదడలాడి పోతున్నాయ్.

"ఆచార్యులెక్కడ ? "అనడిగాడు ఆమెను"

ఆమె అస్పష్టమైన స్వరంతో ఏమని గొణిగిందో కాని, దాని సారాంశం ఆయన 'యింట్లోలేరు' అన్నట్టు అతనికి అర్థమైంది.

రమేష్‌వంటి మీద చొక్కాగానీ, శాలువాగానీ అసలు లేవు. సంధ్య చీకట్లో అతని ముఖం కూడా అంత స్పష్టంగా కనిపించడంలేదు. సరిగా ఆ సమయంలోనే ఒళ్ళో చంటిపిల్లను పెట్టుకొని భైరవుని పెద్దకూతురు లక్ష్మి రమేష్‌ను చూసింది. కాని అతను ఎవరో తెలియక, "ఆయన ఎవరు?" అనడిగింది తల్లిని.

అసలే గజగజ లాడిపోతున్నదేమో ఆమె జవాబు చెప్పలేదు రమేష్ అసలు మాట్లాడనే లేదు.

లక్ష్మి భయపడిపోయి గావుకేకలు పెడుతూ; నాన్నోయ్ ఎవరో యింట్లో జొరబడ్డారు, మాట్లాడ్డంలేదు. బాబోయ్!" అని అరిచేసింది.

"ఎవడ్రావాడు !" అంటూ భైరవుడు యింట్లోనుంచి బయటికొచ్చి చూసేసరికి అతని కళ్ళు అలాగే నిలబడి పోయినయ్.

సంధ్య చీకట్లోనైనా రమేష్‌ను భైరవుడు సరిగ్గానే గుర్తించాడు.

రమేష్ కాండ్రించి, వుమ్మేసి, "ఛీ దౌర్భాగ్యుడా !" అన్నాడు. క్షణంలో మరింత ముందుకుపోయి తన బలమైన చేత్తో భైరవుణ్ణి రెక్కపుచ్చుకుని యివతలకు లాక్కొచ్చాడు. బయట వరండాలో నిలవేసి, "ఏమిటీ నువ్వు చేసినపని ? యిదేనా చెయ్యవలసింది ?" అని గర్జించాడు.

భైరవుడు బేజారయిపోయి, "బాబోయ్, నన్ను చంపుతున్నాడు నాయనోయ్. ఒసే పెద్దమ్మాయ్, వేణుబాబుకు

కబురుచెయ్యవే తల్లోయ్." అని ఆడదానిలా రాగాలు తీస్తూ ఏడుపు ప్రారంభించాడు.

భైరవుని ఏడుపుతోబాటు పెదబాబ్బలతోపాటు, యింకెల్ల పాది కూడా గొంతులు కలిపారు.

రమేష్ అతన్ని గట్టిగా పట్టుకుని ఒక విదిలింపు విదిలించి, "ఛీ నోరుముయ్; నువ్వు చేసిన పనేమిటి, చెప్పు?" అని మళ్ళీ అరిచాడు. భైరవుడు గొంతుపోయేట్టు ఏడుస్తున్నాడేగానీ అతనిమాటకు సమాధానం చెప్పడంలేదు. ఈ ఏడుపులూ పెడబొబ్బలూ విని యిరుగుపొరుగు వాళ్ళంతా చేరారు. కాని కోపంతో మండిపోతున్న రమేష్ అసలు ఈ సంగతే పట్టించుకోలేదు. గుంపుగా జేరిన వాళ్ళంతా కళ్ళప్పగించి చూస్తూ నిలబడ్డారేగాని ఎవడూ ముందుకు రాలేకపోయాడు. రమేష్ ముఖంలోని క్రోధాగ్నిని చూసేసరికి ఎక్కడ వాళ్ళక్కడే జావజావ అయిపోయారు. రమేష్ పట్టునుంచి భైరవుని విడిపించడానికి ఆ గుంపులో ఎవరికీ గుండెల్లేక పోయినయ్. గోవిందుడుకూడా ఆ గుంపులో కనిపించాడుగాని, మళ్ళీ అంతలోనే మాయమైపోయాడు! వేణీకూడా తొంగిచూసి తప్పుకున్నాడు. వేణీ కనిపించడంతోనే భైరవుడు మరింత బిగ్గరగా ఏడుస్తూ, "పెదబాబూ, పెదబాబూ, రక్షించు పెదబాబూ," అని ఏడ్చాడు. కాని పెదబాబు వినిపించుకోనేలేదు; ఎటు పోయాడో తెలియదు.

ఇంతలో గుంపులోనుంచి దారిచేసుకొని అకస్మాత్తుగా రమ వొచ్చింది సరాసరి రమేష్ దగ్గరకుపోయి చెయ్యి పట్టుకుని, "ఇక చాల్లే, విడిచిపెట్టండి." అన్నది.

రమవేపు కోపంగా చూస్తూ. "ఎందుకూ?" అనడి గాడు.

రమ రుద్ధకంఠంతో పెదిమలు పళ్ళతో నొక్కి-పట్టి "యింతమంది మధ్య ఈ అల్లరి మీకు సిగ్గులేదా? సిగ్గుతో నేను చచ్చిపోతున్నాను." అన్నది.

అప్పుడు రమేష్ తలెత్తి గుంపువేపు చూశాడు. ఆ క్షణానే భైరవుని చెయ్యి కూడా విడిచిపెట్టాడు.

రమ కోమలస్వరంతో; "యికపదండి; యింటికి" అన్నది.

రమేష్ నిస్సంకోచంగా అక్కణ్ణుంచి వెళ్ళిపోయాడు. అకస్మాత్తుగా మాయలాగా సమాప్తమైన ఈ దుర్భాగ్యకాండ అక్కడవాళ్ళకు ఆశ్చర్యం కలిగించింది. ఎంతో పెద్ద ప్రళయం జరుగుతుందని చూస్తున్న వాళ్ళందరికీ యిది ఎంతో ఆశాభంగం కలిగించింది వాళ్ళకు మరో విచిత్రంగా తోచిన సంగతేమిటంటే, అంత ఉగ్రహరూపం దాల్చిన రమేష్, రమ చెప్పిన రెండుమాటలకే చల్లబడి వెనక్కి వెళ్ళిపోవడం అంత ఉద్రేకంలోనూ రమమాటకు అతను అంత గౌరవాన్ని ఎందుకిచ్చాడా? అనేది అక్కడి వాళ్ళందరకూ ఆలోచనీయాంశమయింది.

గుంపు అంతా చెదిరిపోయింది తాపీగా గోవింద గంగూలీ ప్రత్యక్షమై అనవసర కోపాన్ని నటిస్తూ "ఔరా! ఎంత దుర్మార్గం ఎంత దుర్మార్గం! ఇంట్లో జొరబడి యింత అల్లరి చేస్తాడా? దీనికి ప్రతీకారం ఏమిటి?" అని అంటున్నాడు.

భైరవుడు రెండు మోకాళ్ళ మధ్య తలపెట్టుకుని వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు. అసహాయంగా అతను వేణీ వైపు చూశాడు. రమకూడా అక్కడేవుంది." మనం మాత్రం తక్కువ చేశామా? ప్రతీకారం ఏ కారణంతో చేస్తాం?" అన్నది.

వేణీ ఆశ్చర్యపడుతూ; "ఏమిటీ నువ్వనేదిరమా?" అనడిగాడు.

భైరవుని పెద్దకూతురు స్తంభన్నానుకుని యింకా ఏడుస్తూనేవుంది. దెబ్బతిన్న పాములాగా ఆమె బుసకొడుతూ, "అవునురమా! నిజమే! నువ్వు వాళ్ళ తరఫున మాట్లాడక పోతే నీకెట్లా? ఎవడన్నా నీయింట్లోజొరబడి మీనాన్ననికూడా యిట్లాగే చావమోదితే అప్పుడు తెలుస్తుంది బాధ!"అన్నది. కసిగా!

లక్ష్మి మాటలకు రమ మొదట ఆశ్చర్యపడింది. తండ్రిని కాపాడినందుకు ఆమె మాటల్లో చీమతలంతైనా కృతజ్ఞత లేకుసరిగదా; ద్వంద్వార్థం కూడావుంది. ఆ మాట సహించ రానిదే అయినా రమ తనను తను సంబాళించుకుని, "మా నాన్నకు మీ నాన్నకూ చాలా వ్యత్యాసం వుంది లక్ష్మీ! ఇద్దర్నీ ఒకేవిధంగా పోల్చడం సరికాదు. నేను ఎవరి తరఫునా మాట్లాడ్డంలేదు; ఏది న్యాయమో అదే చెబుతున్నాను." అన్నది.

లక్ష్మి పల్లెటూరిపిల్ల. పోట్లాటలో వెనక్కు తగ్గే రకం కాదు. మరింత ముందుకొచ్చి "రమేశ్ తరుఫున మాతో దెబ్బలాడటానికి నీకు సిగ్గులేదూ! గొప్పింటి కూతురువనే నీ

ముందు ఎవరూ ఏమీ అనలేరనేకద! కాని ఎవడికి తెలీసు నీ సంగతి? ఇంత నాటకమాడుతూ యింతమందిలో తలెత్తుకు తిరగడానికి నీకు సిగ్గువేయటంలేదు; మరొకళ్లయితే గొంతులోతు నీళ్ళలో మునిగి చచ్చేవాళ్ళు."

వేణీ లక్ష్మిని మందలిస్తూ "నిన్నిట్లా వాగమని ఎవరు చెప్పారు? మాటకు మాట ఎందుకట్లా వాదిస్తావ్ అనవసరపు వాదనలెందుకు. అవుసరం ఎందుకులేదు ఎవరి మూలంగానైతే మా నాన్నకు ఈ దౌర్భాగ్యం సంభవించినదో వాళ్ల తరపునే రమ వాదిస్తున్నదిగదా ఒకవేళ మా నాన్నే చసిపోయుంటే" అని అన్నది లక్ష్మి.

రమ క్షణకాలం నిశబ్దంగా ఉండిపోయింది. వేణి మాటలోని వ్యంగ్యం వినేసరికి రమకు మళ్ళీ కోపంవచ్చింది. లక్ష్మిని ఉద్దేశించి "మీ నాన్నచావు ఆయన చేతిలోనే సంభవించియుంటే అది నిజంగా మీనాన్న భాగ్యమే అనుకోవచ్చు ఆయనకు నిజంగా స్వర్గమే లభించేది" అన్నది. లక్ష్మి మరింత మండిపడుతూ "అందుకే ననుకుంటా నీవింత తపనపడి చస్తున్నది" అన్నది. రమ నోరెత్తలేకపోయింది.

వేణవైపుచూస్తు "వేణీబాబూ వింటున్నావుగా? నువ్వయినాచెప్పు" అని అసహాయంగా అతనివైపు చూసింది.

వేణి క్షోభపడుతూ "నేనేమి చెప్పనురమ! లోకులేమనుకొంటారో, ఏమనుకోరో ఆ సంగతి మనకెందుకు" అన్నాడు.

"లోకులేమనుకొంటారు" అందిరమ.

వేణీ సహజంగానే ఏమనుకుంటే మనకేం? దానివల్ల మనకేమైన నష్టమా? అని అన్నాడు.

వేణి ప్రకటించిన ఈ మిథ్యాసానుభూతిని రమ బాగానే అర్థం చేసుకొన్నది. కొన్ని క్షణాలవరకూ నిశ్శబ్దంగా ఊరుకొని నీ శరీరం చిల్లులుపడ్డా, పడకపోయినా అందరికీ నీలాంటి వజ్రసమానమైన శరీరాలుండవుగా! కాని ఆ లోకుల చేత కూడా అనిపించేదెవరు; నువ్వేగా? అన్నది రమ.

నేనా? అన్నాడు ఆశ్చర్యంగా వేణీబాబు.

రమ తనను తాను సంభాళించుకొని "అవును నీ కంటే ఇంకెవరున్నారు? ప్రపంచంలో నువ్వు చెయ్యని నీచ కార్యాలు మాత్రం ఇంకేమున్నాయ్? దొంగతనము, జూదము, కుట్ర. కొంపలంటించటం అన్నీ అయినాయి. ఇక నీలాపనిందలొక్కటే మిగిలిపోయినాయ్" అన్నది.

వేణి అప్రతిభుడై జవాబు చెప్పలేకపోయాడు.

"లోకంలో నీకెన్ని సంగతులు తెలిసినా ఇదొక్కటి మాత్రం నీకు తెలియదు వేణీబాబు ఏ స్త్రీకూడా తన శీలాన్ని గురించి నిందపడటం సహించదు, నన్నిరకంగా అవమానించడంవల్ల నీకు కలిగే ప్రయోజనం ఏమిటి" అని అడిగింది రమ

వేణీ భయపడుతూ "నాకేం లాభం? కాని లోకులు తెల తెల్లవారుఝామునే రమేష్ యింటినుంచీ నువ్వు రావటం చూస్తే నేనేం చేసేది!!?" అన్నాడు.

రమ తనను మామూలు ధోరణిలోనే "యింతనుంది మధ్య నేను నీలో ఏమీమాట్లాడదలుచుకోలేదు వేణీబాబూ! నీ మనస్సులో ఏముందో నాకు తెలుసు. ఒకవేళ నేను సర్వ భ్రష్టురాలిని కావడం జరిగితే నాతోపాటు నీకూ అదే గతి పడుతుంది. అంతేగాని నీ ఒక్కడివి సుఖపడలేవు" అన్నది.

భైరవునిభార్య ఇంత వరకూ అక్కడే నిశ్శబ్దంగా నిల బడి ఉన్నది. ఇప్పుడు రెండడుగులు ముందుకు వచ్చి తన కోమలమైన కంఠస్వరంతో రమ నిద్దేశించి "పిచ్చిదానివై పోతున్నావా తల్లీ, ఆయనెవరు? నీ సంగతాయనకు తెలి యదా......"

అని తనకూతురు లక్ష్మి నుద్దేశించి "లక్ష్మి నువ్వుస్త్రీ వై పుట్టి సాటిస్త్రీని ఆ విధంగా అవమానించడం తప్పమ్మా! భగవంతుడుకూడా క్షమించడు, ఈ వేళ రమ నీకు చేసిన ఉపకారం మరొక స్త్రీ అయితే జన్మలో మర్చిపోదు." అని అన్నది.

ఆ తరువాత ఆమె రమను వెంటపెట్టుకొని లోపలికి తీసుకువెళ్ళింది. భైరవునిభార్య తన భర్త నుద్దేశించి చెప్పిన ప్రత్యక్షసత్యం అక్కడున్న వాళ్లందరూ తలొకవిధంగా అర్థం చేసుకొన్నారు పొరుగువారి పేచీలను ఆసక్తితో గమనించేం దుకు అక్కడ జేరిన వాళ్లెవరుకూ ఇది నచ్చలేదు.

ఈ సంఘటన ఎలా సమాప్తమైనప్పటికీ చదువు సంస్కారం కలిగిన రమేశ్‌కు మాత్రం తల కొట్టివేసినట్లుగా వుంది. రెండుమూడు రోజులవరకు అతడు బయటకు రాలేక పోయాడు.

ఇది నిజంగా సిగ్గుపడవలసిన సంగతే అయినప్పటికీ ఇందులో రమకూడా భాగం పంచుకుంది. ఇందువల్ల రమేశ్ హృదయం కాస్త తేలిక పడ్డట్లయింది. అయినప్పటికీ కూడా ఈ సిగ్గు, మానాభిమానాల మూలంగాను ఇంకా కొన్నాళ్ళ వరకూ ఇల్లు విడచి బయటకు వెళ్ళకూడదని అనుకున్నాడు. కాని అవతల తన మూలంగానే రమ అవమాన భారంతో క్రుంగి పోతున్నదనే సంగతి అతనికి తెలియదు. ఎవరు ఎవరి మూలంగా అవమాన భారాన్ని సహిస్తున్నారో ఆ సంగతి ఇద్దరిలో ఏ ఒక్కరూ అర్థం చేసుకోలేక పోతున్నారు.

కాని ఈ విధంగా ఎన్నోరోజులు గడవలేదు. ఈ వేళ సాయంకాలమే పీర్‌పూర్‌లోని ముస్లింలంతా పంచాయితీ సమావేశం జరుపుతున్నారు. ఆసమావేశానికి రమేశ్ నాహ్వానించ డానికొచ్చారు. అసలీ సమావేశాన్ని కొన్నాళ్ళక్రిందట రమేశ్ స్వయంగా ఏర్పాటు చేశాడు. దాని ప్రకారమే పంచాయితీ ఏర్పడి ఇప్పుడు రమేశ్ కోసం వచ్చారు.

ఈ సంగతి తెలిసి రమేశ్ వెళ్ళక తప్పలేదు.
పీర్‌పూర్ గ్రామస్థుల పంచాయితీని గురించి రమేశ్ మొదటి నుంచీ శ్రద్ధతీసుకుంటూనే వున్నాడు. ప్రతి గ్రామంలోను దరిద్రుల సంఖ్య అధికంగానే ఉన్నదనే సంగతి అతను తెలుసుకొన్నాడు. తమకున్న కొద్దిపాటి భూమిలోనే సేద్యం చేసుకొని వాళ్ళు జీవిస్తూ వుంటారు. వాళ్ళకు స్వయంగా భూములనేవి లేవు. ఇతరుల స్థలాల్లో నివసించడంవల్ల దానికి పన్నులు చెల్లించవలసి వస్తున్నది. వీళ్ళు ఇతరుల భూముల్లో కూడ పని చేసుకుంటుంటారు రెండురోజులు పని దొరక్క

నాలుగురోజులు జబ్బు పడివున్నా ఇంటిల్లపాది పస్తే. కాని వీళ్ళకూ ఒకప్పుడు స్వంతభూము లుండేవి కాని అప్పుల మూలంగా అవి పరులపాలై పోయాయి. అప్పు యిచ్చి పుచ్చుకోడాలు పల్లెటూళ్ళలో చాలా విచిత్రంగా ఉంటుం టాయి. గ్రామాల్లో షావుకార్లు భూమిని తనఖాపెట్టుకొని అప్పిస్తారు. వడ్డీ అనే మాయాజాలం ఎంతో విచిత్రంగా ఉంటుందంటే ఒకసారి భూమి తనఖాపెట్టినవాడు ఇక వాడి జన్మలో విడిపించుకోలేడు. ఈ విధంగా రోగానికీ రొష్టుకూ, పెళ్ళికీ పేటాకులకూ భూములు తనఖాలు పెట్టకొని పోగొట్టు కొన్నవాళ్ళే. ప్రతి సంవత్సరంకూడా షావుకారు దగ్గరకుపోయి చేతులు చాపి ముష్టి ఎత్తుకోవలసిందే! ఈ విషయంలో హిందూరైతులకు ముస్లిమ్‌రైతులకు అట్టే వ్యత్యాసంలేదు. వడ్డీవ్యాపారం మీద డబ్బు సంపాదించేవాళ్ళు ఎక్కువభాగం హిందువులే! రమేశ్ తను చదువుకునే రోజుల్లో ఈ విష యాన్ని గురించి కొన్ని పుస్తకాలు చదివాడు. కాని గ్రామా ల్లోని ఈ వడ్డీవ్యాపారపు తీరూతెన్నూ చూసేసరికి అతని కెంతో ఆశ్చర్యం వేసింది. అతనిడబ్బు ఎంతో బ్యాంకులో వుంది. దానికి మరికొంతకలిపి ఈ రైతుల్ని షావుకార్ల గుప్పి ళ్లలోనుంచి తప్పించాలని రమేశ్ ఆలోచించాడు. కాని ఒకటి రెండుచోట్ల తన ప్రయోగం ఎందుకూ కాంకుండా విఫ లమై పోయింది. వాళ్ళు ఎంత అమాయకులు, విశ్వాస పాత్రులు అని తానెంతగా విశ్వసించాడో అది కేవలం అబద్ధం అని తేలింది. వాళ్ళు నిజంగా పేదవాళ్ళు అసహాయులే అయినప్పటికీ వాళ్లలో దుష్టబుద్ధికి కూడా కరువు ఏమీ లేదు.

అప్పుతీసుకొని మర్చిపోయేవాళ్ళే ఎక్కువనుంది. సరళత్వం సాధుత్వం చాల కొద్దిమందిలో మాత్రమే కనిపించేది. ఇక అబద్ధాలు నిస్సంకోచంగా చెప్పేవాళ్ళు. ఇతరులను తేలిగ్గా మోసపుచ్చేవాళ్ళు. ఇరుగుపొరుగు కుటుంబాల్లోని ఆడపిల్లల సౌందర్యాన్ని గురించి సిగ్గులేకుండా చర్చించేవాళ్ళు. ఆ సమాజంలో బ్రహ్మచారులకే కొదువలేదు. మరోవైపున బాల్య, ప్రౌఢ, విధవకులకూడ కొదువలేదు సచ్ఛరిత్రతా పవిత్రతా పైపైవాలే తప్ప లోపలంతా మిథ్య. కాని పల్లె సమాజమూ, వాళ్ళు చెప్పిందే వేదమూ! పోలీసుకూ దొంగకూ మధ్య ఏ సంబంధమున్నదో వీళ్ళకూ ఈ సమాజానికి మధ్య ఇదే బాంధవ్యం. కాని స్థూలంగా ఆలోచిస్తే వీళ్ళు దరిద్రులు, అసహాయులు, దుర్బలులూనూ. వీళ్ళని ద్వేషించడం కేవలం పొరపాటే అవుతుంది ఆకతాయి సంతానాన్ని చూచి ఆ తండ్రి పడేబాధే రమేశ్ ఈ సమాజాన్ని చూసి ఆ అనుభూతిని పొందుతున్నాడు. అందువల్ల నేపీర్‌పూర్‌లో క్రొత్తగా కట్టిన స్కూల్లో పంచాయితీ సమావేశాన్ని ఏర్పాటు చేశాడు. ఇంతకు ముందే సంధ్య చీకట్లు వ్యాపించినవి. అయినా శుక్ల పక్ష దశమినాటి వెన్నెలలో అడవిప్రాంతం స్పష్టంగా కన్పిస్తూంది. పీర్‌పూర్ గ్రామం పోవడానికి అదేదారి. రమేశ్ ఇప్పుడో మరోక్షణానికో బయలుదేరుదామని అనుకుంటున్న సమయాన రమ అకస్మాత్తుగా వచ్చి మంచం దగ్గర నిలబడింది. అక్కడ కొంచెం చీకటిగానే ఉంది. బహుశా పని మనిషి అయి ఉంటుందనుకొని "ఏంకావాలి?" అనడిగాడు రమేశ్.

"మీరు బయటికి కెడుతున్నారా !"

రమేశ్ ఆశ్చర్యపడి రమా ! అని అన్నాడు" యింత వేళప్పుడొచ్చావేం ?"

ఈ వేళప్పుడు ఎట్లా వొచ్చిందో చెప్పవలసిన అవసరం లేకపోయినా; ఎందుకొచ్చిందో మాత్రం చెప్పవలసేవుంది ఐనప్పటికీ కూడా కొన్నిక్షణాల వరకూ 'ఎట్లా ప్రారంభించడమా ? అనే సందేహంతోనే వుండిపోయింది. పరోక్షణం తర్వాత; "మీరు కులాసాయేగద !" అనడిగింది.

"కులాసాయే, గాని రాత్రిపూట యింకా జ్వరం వొస్తూనేవుంది" అన్నాడు రమేశ్.

"అయితే కొన్నాళ్ళు బయటకు ఎక్కడికైనా వెళ్ళ కూడదా ?" అని అన్నది.

రమేశ్ నవ్వి; "అవును అది నిజమే ! కాని ఎట్లా వెళ్ళను ? అని అన్నాడు.

రమేశ్ నవ్వడం రమకు ఏమాత్రం నచ్చలేదు. "నాకు తీరిక వుండటం లేదనేగా మీరనేది ! కాని ఆరోగ్యం కంటె మించిన ఘనకార్యాలుంటాయా ? అని అన్నదిరమ.

రమేష్ మొదట్లాగే మళ్ళీ నవ్వి, 'ఆరోగ్యం ముఖ్యం అనే సంగతి నాకూ తెలుసు. కాని కొన్ని పనులు ప్రాణంకంటే కూడా ముఖ్యం ! సరేపోనీయ్ అదంతా...నీకు మాత్రం తెలియదా ?"...అని అన్నాడు

రమతల అడ్డంగా తిప్పుతూ; "నాకేమీ తెలియవు; తెలుసుకోవాలనీ లేదు. కాని ఏ విధంగానైనాసరే కొన్నాళ్ళు మీరు ఈకుగ్రామంపూరు విడిచిపెట్టి వెళ్ళవలసిందే ! వెళ్ళే

ప్పుడు గుమస్తా గోపాల్ సర్కార్‌కు చెప్పి వెళితే- ఆ జమా ఖర్చులు నేనేచూస్తూంటాను.” అని అన్నది.

రమేశ్ విస్మయంగా; “నువ్వుచూస్తావా? కాని...” అని ఆగిపోయాడు.

“కాని ఏమిటి” అంది రమ.

“కాని నేను నిన్ను విశ్వసిస్తానన్న నమ్మకం ఏమిటీ!”

రమ వెంటనే నిశ్సంకోచంగా “ఎవరు నమ్మినా నమ్మకపోయినా మీరు నమ్మగలరు!” అని అన్నది.

రమ అన్నమాటలు విని ఒకక్షణం రమేశ్ ఆశ్చర్య పడ్డాడు. ఆమె ధృఢత్వం అతన్ని విచలితుణ్ణి చేసింది. మరో క్షణం తర్వాత; “సరే నన్నాలోచించుకోనీయ్” అన్నాడు.

“లేదు రమేశ్ బాబూ! యిందులో ఆలోచించవలసిం దేమీ లేదు. నువ్వు విధిగా వెళ్లేతీరాలి. లేకపోతే...” అని ఆగిపోయింది రమ.

రమేశ్ తనను తాను సంబాళించుకుని; సరే నే వెళ తాను. గాని యిందువల్ల నీకు కలిగే ప్రయోజనం ఏమిటి? గతంలో నువ్వు నన్ను ఉద్ధరించింది మాత్రమేమూంది. ఇవాళ మళ్ళీ క్రొత్తగా నాకేదో సాయపడేందుకు ప్రయత్నిస్తున్నావు. ఉన్నమాటేదో స్పష్టంగా చెప్పు! నే వెళ్ళినందువల్ల నీకు కలిగే లాభం ఏమిటీ? అనడిగాడు. సమాధానం కోసరం అతను రమ ముఖంచూశాడు.

ఈ మాటతో రమ ముఖంలో వచ్చిన మార్పేమిటో ఆ చీకట్లో రమేశ్ అంత స్పష్టంగా, చూడలేకపోయాడు. మరోక్షణం వరకూ రమ తనను తాను సంబాళించుకుని

"అయితే వినండి, స్పష్టంగానే చెబుతున్నాను. మీరు వెళ్ళి నందువల్ల నాకు కలిగే ప్రయోజనం ఏమీ లేదూ. వెళ్ళక పోయి నందువల్లనే నాకు ఎక్కువ హానిజరిగే అవకాశంవుంది. మీకు విరుద్ధంగా నేను సాక్ష్యం చెప్పవలసి వస్తుంది." అన్నది రమ

రమేశ్ విస్మయంగా; "అదా సంగతి? పోనీ అసలు సాక్ష్యమే చెప్పకపోతేనేం?" అనడిగాడు.

రమ కొంచెం ఆగి; "ఏమిటీ; అసలు సాక్ష్యమే చెప్పక పోవడమా? చెప్పకపోతే సమాజం నన్ను బహిష్కరిస్తుంది. నాలుగైదు రోజుల్లో దుర్గాపూజా ఉత్సవాలు ప్రారంభ మౌతాయి. ఆ తరువాత తమ్ముడి ఉపనయనం జరగవలసింది. వీటన్నిటికీ కూడా ఏ ఒక్కడూ మా గుమ్మంలో అడుగు పెట్టడు. పండక్కీ పబ్బానికీ కూడా ఎవరూ మా యింటికి రారు." అని అన్నది.

రమేశ్‌కు అంతా అర్థమైంది. కాని తనను తాను సంబాళించుకోలేక "యింకా ఏం జరుగుతుందీ?" అనడిగాడు.

రమ అసహాయింగా, "ఇంకా ఏమౌతుందీ? అంతా సర్వనాశనమే! వొద్దుబాబూ వొద్దు; అట్లాంటి పరిస్థితి కల్పించకండి; మీ కాళ్ళు పట్టుకుంటాను; ప్రాధేయపడతాను. ఈ వూరునుంచి వెళ్ళండి అని అన్నది రమ.

కాస్సేపటి వరకూ యిద్దరూ మౌనంగా వున్నారు.

గతంలో ఎప్పుడు ఎక్కడ రమన చూసినా రమేశ్ హృదయం ఆనందంతో స్పందించేది. ఎంత ప్రయత్నించినా తనను తాను స్థిమిత పరుచుకోలేక పోయేవాడు తన బల

హీనత మీాద తనకే సిగ్గూ, కోపమూ కలిగేవి. తిరిగి ఈ నాడు యిప్పుడు రమను ఒంటరిగా తనయింట్లో చూడటంతో అతని హృదయం ఒక్కసారిగా ఉద్వేగం పొందింది. కాని రమ చెప్పిన చివరిమాటతో అతని హృదయం కఠినంగా మారిపోయింది. రను చూపిన ఆందోళనకు అట్టడుగున అఖండమైన స్వార్థం మిళితమైవుండటం అతనుస్పష్టంగా చూడగలిగాడు. ఆ స్వార్థమూర్తి అతని హృదయానికి స్పష్టంగా గోచరించింది.

రమేశ్ దీర్ఘంగా నిట్టూర్చి. "సరే, నేను వెడతాను. కాని యివాళ మాత్రం కాదు. ఈ రాత్రి నేను వెళ్ళిపోయి నందువల్ల నీ కెంత ప్రయోజనం చేకూరినప్పటికీ అంతకంటే అమూల్యమైన కార్యమొకటి ఈ రాత్రే నేను చెయ్యవలసి వుంది. అందుచే ఈ రాత్రే నేను వెళ్ళడం సాధ్యంకాదు... నీ పనిమనిషిని పిలువు... నేను వెంటనే బయటికి వెళ్ళాల్సి వుంది." అన్నాడు రమేష్.

రమ నెమ్మదిగా; "అయితే ఈ రాత్రికి వెళ్ళడం అసంభవమేనా?" అనడిగింది.

"అసంభవమే... ఏదీ నీ పనిమనిషి ఎక్కడి కెళ్ళిందీ?" అన్నాడు రమేష్.

"లేదు నేను ఒంటరిగానే వచ్చాను." అన్నది రమ.

రమేష్ ఆశ్చర్యంతో "ఏమిటీ? నువ్వు వొంటరిగానే వొచ్చావా?" అన్నాడు.

రమ యింతకుముందు బాగానే శాంతస్వరంతో, "నౌకర్లు వెంటవుంటే మాత్రం వాళ్ళు గూనుంచి నన్ను రక్షించగలరా ?" అన్నది.

"అది నిజమే కావచ్చు ! కాని లోకులు వేసే నిందల నుంచైనా తప్పుకోవచ్చుగద ? చాలా రాత్రయింది రాణీ !" అని అన్నాడు.

ఓహో ... చాలాకాలాంగా మర్చిపోయినపేరు! వెయ్య దగిన నిందలేవో లోకులు యిప్పటికే వేశారని చెప్పాలని రమ అనుకుంది. కాని ఆమాట తన మనసులోనే ఫ్రంచుకుని "దానివల్ల కూడా ఏమీ ప్రయోజనంలేదు రమేష్‌బాబూ ! మరీ అంత చీకటిగా లేదు; నేను వెళ్ళగలను !" అన్నది రమ. తిరిగి జవాబుకూడా ఆశించకుండానే రమ బయటికి వెళ్ళి పోయింది.

# 16

ప్రతిసంవత్సరం దుర్గాపూజా ఉత్సవాలను ఎంతో వైభవంగా జరిపించేది రమ. పూజ ప్రారంభించడానికి ముందురోజునే వూళ్లోని రైతులందర్నీ ఆహ్వానించి పంక్తి భోజనాలు పెట్టేది. జగదాంబ ప్రసాదం కోసరం వూరు వూరంతా ఆ యింటి ముందు బారులుతీరి నిలబడేవారు. అర్ధ రాత్రి దాటిపోయిన తరువాత కూడా; ప్రసాదం పెట్టేవాళ్ళకూ;

పుచ్చుకునే వాళ్ళకూ విరామం వుండేదికాదు. ఇంట్లో ఎక్కడా కాలుమోపి కూర్చునే సందుకూడా వుండేదికాదు. కేవలం గ్రామంలోని హిందువులే కాక, పీర్‌పూర్‌లోని ముస్లిం కుటుంబీకులు కూడా తరలి వచ్చేవారు. ఈ సంవత్సరం అసలు రమాకు వంట్లో ఏమంత బావుండడంలేదు; అంచేత మునుపటి కంటె మరింత ఘనమైన ఏర్పాట్లే యీ సంవత్సరం చేసింది. చండీమండపంలో దుర్గాదేవి ప్రతిమ, పూజాసామాగ్రి వగైరాలున్నయ్. క్రింద ఉత్సవంకోసరం విశాలమైన ప్రాంగణం వుంది. అంత్యపూజ కూడా అయిపోయింది; రెండు ఝాములు దాటి మూడోఝాము కూడా ప్రారంభమైంది. చివరకు సంధ్యవేళకూడా అయింది. ఆకాశంలో సప్తమి చంద్రుడుకనిపిస్తున్నాడు. అయినప్పటికీ ఆవిశాలప్రాంగణంలో యిద్దరుముగ్గురు తప్ప అంతా శూన్యంగానే వుంది. ఇంట్లో వండి వార్చిన అన్నపు బుట్టలు అట్లాగే, చల్లారిపోయినయ్. యిహ కూరలుగతి సరేసరి! ఇంతవరకూ నిమ్నజాతులవాళ్ళు ఒక్కళ్ళుకూడా యీ ప్రాంగణం వైపు అసలు తొంగిచూడనే లేదు! రైతులుగానీ కూలీలుగానీ ఒక్కడుకూడా జగదాంబ ప్రసాదానికి రానేలేదు.

ఓహో! అన్ని ఆహారపదార్థాలు దండుగైపోతున్నయ్! నిమ్నజాతివాళ్ళ కింత అహంభావం! చివరకు ఏ పాదుగింటావిడకూడా యివాళ యిటు తొంగిచూడనైనా చూళ్ళేదు. చేతిలో హుక్కాపుచ్చుకొని వేణీ ఆదుర్దాగా యింట్లోనుంచి బయటికీ బయటినుంచి యింటోకి తిరుగుతున్నాడు. కోపంతో అవమానంతో మండిపడుతున్నాడు,

చిందులు త్రొక్కుతున్నాడు. "చూస్తా చూస్తా : వీళ్ళమదం ఎంతవరకు వుందోచూసి; తగినశాస్తి చేయిస్తా ... గాడిద కొడుకులు...ఎంత అహంకారం !..." అని యింకా యింకా ఏవేమో అంటున్నాడు గోవిందుడు, ధర్మదాసు మాల్దాక్ మొదలైన పది పన్నెండుమంది అక్కడే కూర్చుని; యింత అద్భుతమైన మాయాజాలాన్ని ఏ దేవత సృష్టించాడా అని దీర్ఘంగా ఆలోచిస్తున్నారు. అరె, ఎంత విచిత్రం కాకపోతే; హిందువులు ముస్లిమ్‌లూ ఏకమైపోతారా ! అని విస్తు పోతున్నారు.

మరోవైపున పిన్ని రణచండీ రూపం ధరించి తన అజ్ఞాత శత్రువులకు శాపనార్థాలు పెడుతున్నది ఇంత విచిత్రమైన కోలాహలం మధ్య అన్య మనస్కంగా ఎవరైనా వుంటే; అది ఒక్క రమే ! ఆమె నోటినుంచి ఒక్కమాట కూడా అనలేదు. ఈదోషాన్ని ఆమె ఎవరికీ అంటగట్టనూలేదు. కోపంతో ఎవరినీ శపించనూలేదు. నిజంగా యీామె ఆరమేనా ? అని పిస్తుంది ఎవరికైనా. కాని ఆమె అంతరాత్మలో ఎంత క్షోభ పడి పోతున్నదో ఆ సంగతి ఎంతమందికి తెలుసు. కాని నిజంగా బాధపడుతున్నట్టు మాత్రం ఆమె అంగీకరించే స్థితిలో లేదు. ఈ సమయాన ఆమెలో ఏ విధమైన ద్వేషమూ, రోషమూ పట్టుదలాలేదు. నిర్వికారంగానే వుంది. అవమాన భారంతో వాలిపోయిన కనురెప్పల వెనుక బహుశా ఒక విధమైన వ్యథా కరుణా వుండివుండవచ్చు. మరింత స్పష్టంగా పరిశీలిస్తే ఆ కనురెప్పల వెనుక అనంత దుఃఖ మహాసముద్రం కూడా వుండి వుండవచ్చు. ఏనాడైనా ఆదుఃఖసముద్రం కట్టలు

తెంచుకోవటమే జరిగితే యీ సమస్తలోకాన్నీ నిజంగానే తనలో లీనం చేసుకుంటుంది.

చండీ మండపంలోని లోపలిద్వారంనుంచి రమ ప్రతిమ దగ్గరకొచ్చి ఎదురుగా నిలబడింది. ఆమెను చూడ్డంతోనే మళ్ళీ ఆమె శ్రేయోభిలాషులంతా ఆమెచుట్టూచేరి నిమ్నజాతి వాళ్ళను, వాళ్ళ ఏడేడుతరాలదగ్గర్నుంచీ శపించడం మొదలెట్టారు. రమ వాళ్ళను చూసి అసహాయింగా నవ్వింది. తల్లి కొమ్మ నుంచి వేరుచేయబడ్డ పువ్వు మానవుని చేతిలో ఎంత అసహాయంగా నవ్వుతుందో సరిగ్గా రమ ఆ విధంగానే నవ్వింది. ఆ నవ్వులో ఏ విధమైన దోషమూ లేదు, ఆశ, నిరాశలు, మంచీ-చెడూ రాగద్వేషాలు; వీటన్నిటికీ అతీతమైన నవ్వు అది! కాని ఆ సంగతి ఎంతమందికి తెలుసు!

వేణీ అకస్మాత్తుగా; "లేదురమా! యిదేమంత స్వల్ప విషయంకాదు. దీని వెనుక బ్రహ్మాండమైన కుట్రవుంది" అన్నాడు ఆవుద్రాగా. తన రెండు చేతులూ పిడికిళ్ళు గట్టిగా మూసి; "ఈ వెధవల అంతు తేలుస్తాను" అన్నాడు కోపంగా.

రమ యిప్పటికీ మాట్లాడలేదు.

వేణీ అదే ధోరణిలో, "వెధవలు ... కుక్కలు ... ఎవడి ఆసరా చూసుకుని వీళ్ళింకా కులుకుతున్నారో, వాణ్ణి బొక్కలో తోయిస్తే.! వీళ్ళకు దిక్కెవడొస్తాడో చూస్తాను. ఒక్కొక్క వెధవను పదేసి ఏళ్ళు జైలుకుపంపి వాడిగడ్డి వాడికి తినిపించకపోతే...నా పేరు వేణీ...ధూ.ధూ." అని కాండ్రించి వుమ్మేశాడు.

రమ మాట్లాడకుండానే, ఏ పనిమీద వచ్చిందో ఆ పని చూసుకుని వెళ్ళిపోయింది.

రమేశ్ నెలాపదిహేను రోజుల్నుంచీ జైల్లోనేవున్నాడు చట్టవిరుద్ధంగా యిండ్లలో జొరబడి చాకుతో భైరవుని బెదిరించడం' అనే నేరారోపణ వల్ల అతనికి యీ శిక్షపడింది. కోర్టులో ముద్దాయి పక్షాన ఎక్కువ వాదన జరగలేదు. మెజస్ట్రేటు కొత్తగా వచ్చినవాడు. అదీగాక పల్లెప్రాంతాల్లో యిలాంటి నేరాలు సాధారణంగా జరుగుతూనే వుంటాయని ఆయన అభిప్రాయం. అదీగాక ముద్దాయికి గతంలో జరిగిన ఒకటి రెండు దొంగతనాలతో సంబంధం వుండి వుంటుందని మేజస్ట్రేటు నమ్మకం. వీటికితోడు అప్పుడప్పుడు ముద్దాయి మీద చేసిన ఫిర్యాదులను కూడా గమనిస్తే మేజిస్ట్రేటు నమ్మకాలు బలపడ్డాయేగాని, తగ్గలేదు. అందుచేత ముద్దాయి యీ నేరం చేసివుంటాడనీ, యింకా కొన్ని నేరాలతో సంబంధం వుండివుంటుందనీ ఆయన అనుకున్నాడు. అందువల్ల మేజస్ట్రేటు తనతీర్పు ప్రకటించి; శిక్షానంతరం కూడా ముద్దాయిని పోలీసులు ఒక కంట కనిపెట్టి వుండాలని కూడా హెచ్చరించాడు! బోనులో నిలబడి రమేష్‌కు వ్యతిరేకంగా రమ సాక్ష్యం చెప్పవలసి వచ్చింది. ఆమె తన సాక్ష్యంలో రమేష్ భైరవుని చావకొట్టడానికి వొచ్చినమాట నిజమేనని స్పష్టంగా చెప్పింది. అయితే కత్తితో బెదరించడంగానీ; అసలు ఆ సమయాన అతనిచేతిలో కత్తి వున్నట్టుగానీ తనకు జ్ఞాపకం లేదని చెప్పింది.

కాని 'ఇది మాత్రం నిజమా? జిల్లాకోర్టు మేజిస్ట్రేటు ముందైతే రమ యీ విధమైన సాక్ష్యం చెప్పి రాగలిగింది గానీ, రేపు భగవంతునిముందు ఏమని సంజాయిషీ చెప్ప కంటుంది? అక్కడ తనకు సాక్షులు ఎవరూ లభించరు. భైరవ్నీ రమేష్ కత్తితో బెదిరించ లేదని. అసలు అతని చేతిలో కత్తి లేదనే సంగతి రమకంటే స్పష్టంగా ఎవరికీ తెలియదు! కత్తిసంగతి దేవుడెరుగు కనీసం గడ్డిపోచైనా లేదే! భగవంతుని కోర్టులో నీకు ఏం గుర్తుందీ ఏది లేదు. అని అడగరుగదా! తను చెప్పినదేమిటీ తనకు ఏది నిజంగా గుర్తున్నదో కూడా రమకు తెలుసు. ఐనప్పటికీ జిల్లాకోర్టులో నిజం చెప్పడానికి ఆమెకు నోరు రాలేదు. వేణీ నాయకత్వం వహించే ఈ దౌర్భాగ్య సమాజానికి 'న్యాయం' ఎందుకు రుచిస్తుంది? అసత్యపు మేలి ముసుగు కప్పుకుని యీ సమాజం ముందుకు రావలసి వస్తుం దని రమకు తెలుసు. ఈ నాటి సమాజంలో చాలామంది అలాగే తిరుగుతూ బ్రతుకుతున్నారు. మరో సంగతేమిటంటే యీ విషయంలో రమేశ్‌కు యింత కఠినమైన శిక్షపడుతుందని ఆమె అనుకోలేదు మహా అయితే వందో రెండొందలో జరి మానా పడుతుందనీ, ఆ కాస్తా చెల్లించి బయట పడతాడనే అనుకుంది! ఈ వూరు విడిచి వెళ్ళిపొమ్మని అతనికి చెప్పిచెప్పి ఆమె విసిగెత్తిపోయింది. అంచేత జరిమానా పడితే కాస్త యీ సారైనా కళ్ళుతెరుస్తాడనే భావించిందిగానీ, యిట్లా జరుగుతుందని అనుకోలేదు. రమేశ్ నిర్దోష వదనాన్ని చూసి మేజిస్ట్రేటు జావగారి పోయి ఏ స్వల్పశిక్షతోనో సరిపెడతా

డనుకున్నగానీ ఏకంగా ఆరుమాసాలు కఠినశిక్ష విధిస్తాడని ఆమె కలలోకూడా అనుకోలేదు. కోర్టులో రమేష్ ముఖాన్ని రమ చూడలేకపోయింది. రమేష్ మాత్రం రమను తదేకంగానే చూశాడని లోకులు చెప్పుకున్నారు. రమను, కోర్టులో రమేష్ తన తరుఫున క్రాసు పరీక్షకూడా జరుపనివ్వలేదు. తీర్పు ప్రకటించగానే గోపాల్ సర్కార్ అప్పీలు చేద్దామని రమేష్‌తో అన్నాడు కాని రమేష్ తిరస్కరిస్తూ; "వద్దు, ఆ పని నే చెయ్యదలచుకోలేదు. అన్నాడు." యింతేకాదు, నాకు యావజ్జీవ కారాగార శిక్ష విధించినా నేను అప్పీలు చెయ్యదలచుకోలేదు. యింతకంటే జైల్లో నివసించడమే నయం!" అన్నాడు రమేష్.

రమేశ్ అన్నమాటకూడా నిజమే! ఎంచేతనంటే విశ్వాసపాత్రమైన భైరవుని లాంటివాడే తప్పుడుదావాలు సాకుగా చూపి డబ్బు కాజెయ్యగా లేనిది; దానికితోడు రమ వంటి ఆత్మీయురాలే బోనులో నిలబడి; తన చేతిలో కత్తి వున్నదీ లేనిదీ జ్ఞాపకంలేదని బుకాయించి నప్పుడు ఇంక విడుదల కోసరం ప్రయత్నించడం ఎందుకు? రమేశ్ లోని అజేయమైన అభిమానం మహాశిలసదృశ్యంగా రమ గుండెలపైన బడింది. ఈ బరువును రమ ఏ విధంగాను తొలగించుకోలేక పోతున్నది. ఓహో, ఎంతబరువు ఎంత కష్టం! తాను అబద్ధం చెప్పినమాట నిజమే...కాని నిజాన్ని మాత్రం పూర్తిగ దాచిపెట్టింది. అందువల్ల యింత నరకయాతన అనుభవాని కొస్తుందని ఆమె ఎన్నడూ అనుకోలేదు. 'సత్యాన్ని' మరుగు పరచినందువల్ల యింత యమయాతన పడవలసి వస్తుం

దనే సంగతి తనకు ఏమాత్రం ముందు తెలిసినా ఎంత బాగుండేది అనుకుంది రమ. చిట్టచివరకు యిప్పుడు రమకు ఒక్క సంగతే గుర్తొస్తున్నది; భైరవునికి ఉపకారం చేసినందు వల్లనే రమేశ్‌కు యింత అపకారం జరిగిందని! ఆ ఉపకారం చెయ్యడం ఎంత అపరాధమైంది?

ఆ నాడు తన ముఖంచూసే అగ్నిపర్వతంలా బ్రద్దలై పోతూకూడా; భైరవుణ్ణి క్షణంలో విదిచిపెట్టి, తనమాట పాటించి అవతలకు వెళ్ళిపోయాడు! ఆ విధంగా తనమాటను శిరసావహించినవాళ్ళు తనచుట్టూ సమాజంలో మచ్చుకైనా లేరే?

తనయింట్లో పడుకుని యీ నాడు వెనక్కు తిరిగి ఆలోచి చుకుంటుంటే ఒక మహత్తరమైన సత్యం సాక్షాత్కరించి నట్లయింది. ఏ సామాజిక భయంవల్లనైతే రమ యీ నికృష్టకార్యం చేసిందో అది నిజంగా సభ్యసమాజమేనా? వేణీలాంటి యిద్దరిముగ్గురి స్వార్థపరుల చేతుల్లో వుండిపోయిన యీ సమాజంలో వాళ్ళ స్వార్థమూ, హింసాతప్ప యింకేముంది యీ సమాజంలో? గోపిందుని విధవ వదినగారితో వేణీకున్న పచ్చి రసికబంధాల సంగతి వూళ్ళో ప్రతిపిల్లవాడికీ తెలుసే! అలాంటి వేణీ సంఘనాయకుడు! తమ నాయకత్వాన్ని అవిచ్ఛిన్నంగా ఆపుకోవడమే వీళ్ళ అంతిమ లక్ష్యం! ఇదేనా! పవిత్ర హైందవం?

ఈ అనర్థాలన్నిటకీ భైరవాచార్యులే మూలం! ఐనప్పటికీ రమ అతన్ని అసహ్యించుకోలేక పోయింది. ఎందుచేతనంటే అతనికి వయసొచ్చిన ఆడపిల్లలున్నారు, వాళ్ళకూ పెళ్ళిళ్ళు

కావాలి! కాని పెళ్ళిళ్ళే జరక్కపోతే ఆ కుటుంబం మొత్తాన్ని సంఘం బహిష్కరిస్తుంది. వాళ్ళ కుటుంబం ఎందుకూ కాకుండా పోతుంది ధర్మం లుప్తమైపోతుంది. ఇదేభయం ప్రతి హిందూ కుటుంబీకునికీ వుంటుంది. అలాంటి స్థితిలో భైరవుడు తన స్వార్థంకోసరం ఏంచేస్తే మాత్రమేమిటి?

రమ మరోవిధంగా కూడా ఆలోచించింది. తన దగ్గర యింత డబ్బుంది. మరోయింత పరంపరాగతమైన కీర్తి ప్రతిష లున్నాయ్ అయినప్పటికీ సమాజం అంటే తనకూ భయమే! తనే ఆ పరిస్థితిలో వున్నప్పుడు, పాపం భైరవుడు మాత్రం అంతకంటే ఏంచెయ్యగలడు? వేణీకి విరుద్ధంగా వ్యవహరించి నిలబడడం భైరవునికి ఎంత అసాధ్యమో రమ వూహించి తనలో తానే అసహ్యహించుకుంది. వృద్ధుడైన సనాతన్ హాజరా అటువైపుగానే వెళ్తుంటే గోవిందుడు చూసి అతనిని పిలిచాడు. ఎంతో కోపంతో నయాన-భయాన పిలవగా, పిలవగా బలవంతగా వచ్చాడు. అతన్ని వేణీముందు హాజరు పెట్టాడు. వేణీ కోపంతో "ఏంరా సనాతన్ యీ తెలివి ఎంత కాలం నుంచీ? ఇదంతా మీ స్వంత తెలివేనా?" అనడిగాడు కాస్త పౌరుషంగానే!

సనాతనుడు మామూలు ధోరణిలోనే; "పెదబాబూ! మాకు ఎరువు తెలివితేటలు ఎక్కణ్ణుంచి వొస్తాయి? మీ అంత వాళ్ళకే పరువు తెలివితేటలు లేనప్పుడు మాకెట్లా లభిస్తుంది?" అనడిగాడు.

"ముఖంమీదే కొట్టినట్టు సమాధానం చెబుతున్నావేంరా?" అన్నాడు వేణీ;

కోపంతో ఆపైన మరేమీ అనలేక, వేణీకి కొంత ఆశ్చర్యం కూడా కలిగింది. ఎంచేతన టే సనాతనుని స్థిరాస్థి అంతా వేణీ దగ్గరే తనఖా పెట్టివుంది. వాడు మొన్న మొన్నటిదాకా ఉదయా స్తమానాల్లోనూ వేణీదగ్గరకు హాజరై చేతులు జోడించి పాదాభివందనం చేసి పోయేవాడు. అలాంటి సనాతనుడు యివాళ యిట్లా మాట్లాడుతుంటే మరి వేణీకి ఆశ్చర్యం కలగదా ?

గోవిందుడు అగ్నిలో ఆజ్యం పోస్తూ; "మీకు కాస్త కొమ్ములొచ్చాయి లేరా సనాతన్ ! లేకపోతే జగదాంబ ప్రసాదానికైనా-కనీసం పిల్లవాడైనా యిటుకేసి రాక పోతాడా ? అది సరేగానీ అసలు సంగతేమిటిరా ?" అనడిగాడు.

వృద్ధుడు సవ్వి; "మాకు కొమ్ములెందుకు కొస్తాయి బాబూ ! నా బ్రతుకుకాస్తా మీా చేతుల్లోనే తెల్లవారి పోయింది...సరే పోనీండి...జగదాంబ ప్రసాదం కానివ్వండి, మరేదైనా కానివ్వండి; యికమీాదట బ్రాహ్మణ కొంపల్లో మాత్రం ఒక్కముద్దకూడా ముట్టుకునేదిలేదు. ఇంత పాపం భూదేవి మాత్రం ఎట్లా భరిస్తుంది బాబూ ! "ఒక్కసారి సనాతనుడు దీర్ఘంగా నిట్టూర్చి, రమవేపుచూసి ఆమె నుద్దేశించి అమ్మా, మీారు కాస్త జాగ్రత్తగా వుండండి. పీర్‌పూర్ ముసల్మాన్ యువకులు మీాకు దూరమైపోతున్నారు. చినబాబుగారు కాస్త జైలునుంచి బయటికొచ్చారంటే...యిహ ఆ తర్వాత ఏం జరుగుతుందో చెప్పలేం ! అంతా యిక ఆ దుర్గే చూడాలి! ఈ మధ్య రెండుమూడు సార్లు పెద్దబాబుగారి

యింటిచుట్టూ తిరిగి వెళ్ళారు. ఆయన ఎదట పడ లేదుగానీ... పడినట్లతే మాత్రం...కాళ్ళు చేతులూ వుండేవో లేవో చెప్ప లేను..." అని అంటూ వృద్ధుడు వేణీవైపు చూశాడు. వేణీ ముఖం భయంతో నల్లగా కప్పువేసి పోయింది.

సనాతనుడు అదే ధోరణిలో చెబుతూ, "దుర్గముందు నన్నెందుకు అబద్ధమాడిస్తావు పెదబాబూ! వున్నమాట చెబు తున్నాను.; కాస్త రాత్రీ-పగలూ జాగ్రత్తగా వుండటం మంచిది. ఎవడు ఎటునుంచి వొస్తాడో-ఏంచేస్తాడో చెప్పలేం!"

వేణీ ఏదో అనాలనుకున్నాడుగానీ నోటినుంచి మాట పెగలేదు. అతనంత పిరికివాడు యీ పృధ్విమీద మరొక డెవడూ వుండడు!

ఇంతసేపటికి రమ కల్పించుకొని కరుణాపూరిత స్వరంతో సనాతనుణ్ణి వుద్దేశించి; "సనాతన్! మీ అందరికీ అంత కోపం దేనికయ్యా? యిదంతా చినబాబును గురించేనా?" అనడిగింది.

సనాతనుడు ఒకసారి దుర్గప్రతిమవైపు చూసి; "దేవత ముందు అబద్దాలు చెపితే నరకంలో కూడా చోటు దొరకదు తల్లి! అందుకే వున్నమాట చెబుతున్నాను. నువ్వన్నమాటే నిజంతల్లి! మాకంటే కూడా ముస్లిమ్‌లు మరింత మండిపడి పోతున్నారు. వాళ్ళు చినబాబును సాక్షాత్తూ 'దేవదూత' గా భావించి ఆరాధిస్తున్నారంటే నమ్మండి! ముంజేతి కంకణానికి అద్దమెందుకు? కావాలనుకుంటే మీరే కాస్త పరిశీలించి చూడండి. సరిగ్గా చినబాబుగారిని జైలుకు పంపినరోజున జాఫ రాలీ వెయ్యిరూపాయలు కొత్తస్కూలుకు చందాయిచ్చాడు.

నిజానికి జాఫరాలీ సంగతి మీకు తెలియనిదేముంది; ఎంగిలి చేత్తోనైనా కాకిని విదిలించనంత పిసినిగొట్టుగదా! అటువంటి వాళ్ళే చినబాబుగారిని గౌరవించి ఆదరాభిమానాలతో ఆయన్నే ఆదర్శంగా పెట్టుకున్నారంటే, యిందులో ఏమాత్రం అతిశయోక్తిలేదు. పైగా మసీదులో ఆయన పేరుమీద ప్రార్థనలు కూడా జరుపుతున్నారు. "అన్నాడు సనాతనుడు.

విషాదభరితమైన రమ ముఖంలో యీక్షణాన అవ్యక్తమైన ఆనందం క్షణకాలం తొణికింది! అప్రహతంగా సనాతనున్నే అలాగే చూస్తూ కూర్చున్నది. అకస్మాత్తుగా వేణే, సనాతనుని చెయ్యి పుచ్చుకుని; "సరిగ్గా యీమాటే నువ్వు పోలీసు యిన్‌స్పెక్టరుతో చెప్పాలి! ఇందుకు ప్రతిఫలంగా నీకు రెండెకరాల సాగాణీ భూమి యిస్తాను రా సనాతన్! నేనీమాట దేవతసాక్షిగా ప్రమాణం చేసి చెబుతున్నాను; నా మాట నమ్ము" అన్నాడు వేణీ బాబు.

సనాతన్ నిర్ఘాంతపోయాడు. కొన్ని క్షణాలవరకు వేణీ ముఖాన్ని తదేకంగా చూస్తూ; "యింక నేను ఎంతోకాలం బ్రతకను పెదబాబూ! ఈ అశాశ్వతమైన ప్రతిఫలం కోసరం యీ గడ్డి నేను తింటే... రేపు నా శవాన్ని కాకులు కూడా ముట్టవు పెదబాబూ! ఆ రోజులు గతించినయ్ బాబూ! చిన బాబుగారు పాతపద్ధతులకు చాలా వాటికి స్వస్తిచెప్పారు." అన్నాడు సనాతన్.

"అయితే బ్రాహ్మణదేవత అభ్యర్థన గాలికిపోయి నట్టేనా?" అనడిగాడు మధ్యలో గోవింద గంగూలీ.

సనాతనుడు తెలూపుతూ; "ఆ పని నా వల్ల కాదు బాబూ! నిజం చెబితే మీకు కోపం వొస్తుంది గంగూలీ బాబూ! ఒకరోజున పీర్‌పూర్ స్కూల్లో చినబాబుగారు మాట్లాడుతూ, నాలుగు దారపుపోగులు మెడలో వేసుకున్నంత మాత్రాన ఎవడూ బ్రాహ్మణుడు కాలేడని ఆయన చెప్పారు. నేను నిన్న మొన్నటి పసివాణ్ణేమీ కాదుగదా గంగూలీ బాబూ! నాకు అందరి సంగతులూ తెలుసు. మీరు చేసేపనులు నిజంగా బ్రాహ్మణులు చెయ్యదగిన పనులేనా? రమతల్లి, నువ్వే చెప్పమ్మా; నేనేమైన పొరపాటు మాట్లాడుతున్నానా?" అన్నాడు సనాతనుడు.

రమ సమాధానం చెప్పలేక తలవంచుకుంది. సనాతనుడు మరింత ఉత్సాహపూరితుడై యింకా కొన్ని సంగతులు చెబుతూ; "చినబాబుగారి మాటలూ-చేతలూ చూసి పీర్‌పూర్ యువకులంతా పిచ్చివాళ్ళు అయ్యేరంటే నమ్మండి: ఆయనను తమ ఆరాధ్యదైవంగా భావిస్తున్నారు. చినబాబుగారు జైలుకు వెళ్ళినప్పట్నుంచీ యీ రెండు గ్రామాల్లోని యువకులూ రోజూ జాఫరాలీ దగ్గర సమావేశ మౌతున్నారు. వాళ్ళు బహిరంగంగానే ఏమంటున్నారో తెలుసా? అసలు నిజమైన జమీందారు చినబాబేనని, మిగతా వాళ్ళంతా దొంగలు, పచ్చిదొంగలనీ! అదీగాక మనం పన్నులు కడుతున్నప్పుడు జమీందారుకు ఎందుకు భయపడాలి" అని అంటున్నారు. జమీందారు బ్రాహ్మణుడై బ్రాహ్మణునిలాగే వుండాలి; లేకపోతే మనమెంతో. వాళ్ళా అంతే! అంటున్నారు." అని చెప్పాడు సనాతన్.

వేణీ ఆఃుపణువునా జ్వలించి పోయాడు. పాలిపోయిన ముఖంతో; "వాళ్ళందరికీ నా ఒక్కడిమీదే ఎందుకంత కడుపు మంట?" అనడిగాడు.

"కోపగించుకోకు వేణీబాబూ! అన్ని అనర్థాలకూ మూలం మీరేనని వాళ్ళు బాగానే పసిగట్టారు." అన్నాడు సనాతనుడు.

వేణీ మారు మాట్లాడక వూరుకున్నాడు. సనాతనుని వంటి నిమ్నజాతివాడి నోటినుంచి యిలాంటి నగ్న సత్యాన్ని వినికూడా వేణీ నోరెత్తలేక పోయాడంటే బహుశా అతని మానసిక స్థితి సరిగ్గా వుండి వుండకపోవచ్చు. అతని మనస్సు దడదడ లాడుతూవుంది.

"అయితే వాళ్ళందరూ జాఫరాలీ యింటిని కేంద్రంగా ఏర్పాటు చేసుకున్నా రన్నమాట! అయితే వాళ్ళంతా అక్కడేం చేస్తుంటారు?" అనడిగాడు గోవింద గంగూలీ.

సనాతనుడు ఒక్కక్షణం గంగూలీ ముఖాన్ని పరిశీలనగా చూసి; "నాకేం తెలుసు బాబూ! కాని మీరు మంచిని కోరేవాళ్లే అయితే యిక ఆ విషయాలను గురించి ఆట్టే ఆరా తియ్యకండి! వాళ్ళందరూ ఒక్కటైపోయారు. హిందూ ముస్లిమ్ భేదాలే వాళ్ళకు లేవు! చినబాబుగారు జైలుకు పోవడంతో వాళ్ళంతా దుఃఖపూరితులై ఒకరికొకరు సానుభూతిపరులయ్యారు. యిప్పుడు మీరెందుకు వాళ్ళను గురించి కల్పించుకుంటారు?" అన్నాడు సనాతనుడు

సనాతనుడు వెళ్ళిపోయాడు. కొన్ని క్షణాలవరకూ అంతా నిశ్శబ్దంగానే వుంది. ఎవ్వరు ఏమీ మాట్లాడలేక

పోయారు. రమలేచి లోపలికి వెళ్తున్నసమయంలో ఆమె నుద్దేశించి, "నువ్వు అన్ని సంగతులూ విన్నావుకదూ?" అనడిగాడు వేణీ.

రమ చిన్నగా నవ్విందేగాని ఏ మాటా చెప్పలేదు. ఆమె నవ్వుచూసి వేణీకి వళ్ళు మండినట్టుగా వుంది. మరో క్షణంతర్వాత భైరవునుద్దేశించి, "పోరా గాడిదకొడకా! నీ మూలంగానే యీ అనార్థాలన్నీ దాపురిస్తున్నయ్." అని "రమా, నువ్వు ఆనాడు వీణ్ణి ఆదుకోవడానికి వెళ్ళకపోయి నట్లయితే-అసలు యింత రభస జరిగేదికాదు. నీకేం. నీకు నవ్వులాటగానే వుంటుంది! నువ్వు ఆడదానివి; యింట్లోనుంచి అడుగుపెట్ట నవసరం లేకుండానే అన్నిపనులూ జరిగిపోతాయి. కాని నాకెట్లా కుదురుతుంది? నిజంగానే ఎవడన్నా నాపుర్రె పగలకొడితే?...ఆడదాని మాటలు వినడంవల్లే యీ అనర్థా లన్నీ జరుగుతాయి." అన్నాడు. ఆ క్షణాన వేణీముఖం సంకోచ క్రోధావేశాలతో మిశ్రమమై వివర్ణమైపోయింది.

రమ అతని మాటలు విని స్తబ్ధురాలై పోయింది. వేణీ తత్వం ఆమెకు బాగా తెలుసు. అయినా అతను యింత సిగ్గుమాలిన అభియోగం చెయ్యగలడని ఆమె ఎన్నడూ అను కోలేదు. ఏమాటా మాట్లాడకుండా కొన్ని క్షణాలవరకూ అక్కడే నిలబడి ఆ తరువాత అక్కణ్ణుంచి వెళ్ళిపోయింది. ఆ తరువాత వేణీ రెండు లాంతర్లు తెప్పించి, నలుగైదుగురు మనుషుల్ని పిలిపించుకుని నాలుగువైపులా కాస్త పరకాయించి చూసి యింటిముఖం పట్టాడు.

# 17

విశ్వేశ్వరి యింట్లో అడుగు పెడుతూనే రుద్ధకంఠతో "అమ్మా రమా! నీ వంట్లో యివాళ ఎట్లావుందమ్మా!" అనడిగింది.

రమ ఆమె ముఖాన్ని ఒక్కసారి చూసి బలహీనంగానే నవ్వి; ఫర్వాలేదు; కొంచెం కులాసాగానే వుంది." అన్నది.

విశ్వేశ్వరి ఆమె తలవైపున కూర్చుని తల నిమురుతున్నది. గత మూడు మాసాలనుంచి రమ మంచంగానే వుంది. మలేరియా, శ్వాసకోశాలకు సంబంధించిన వ్యాధులతో ఆమె చిక్కి శల్యమైపోయింది. ఊళ్ళోని పాతకాలపు వైద్యుడే తన శక్తియుక్తులన్నిటినీ వినియోగించి వైద్యం చేస్తున్నాడు; అయినా అంతా వ్యర్థంగానే వుంది. కాని ఆ ముసలి వైద్యునికి మాత్రం ఏం తెలుసు, రమకు నిజమైన వ్యాధి ఏమిటో? ఒక్క విశ్వేశ్వరికి మాత్రమే రమ ఏ నిజమైన వ్యాధితో యిట్లా చిక్కి శల్యమై పోతున్నాదో తెలుసు. రమను ఆమె తన కన్నబిడ్డలాగానే ప్రేమిస్తుంది. రమకూడా ఏవిషయాన్ని ఆమె దగ్గర దాచిపెట్టదు. ఈ పవిత్రమైన ప్రేమాభిమానాల వల్లనే రమనుగురించి ఆమె ఆందోళన పడుతుంది. రోగం ఒకటైతే చికిత్స మవిరోధంగా జరుగుతుందని అందువల్ల ఏమీ ప్రయో

జనం వుండదనే విశ్వేశ్వరి గ్రహించింది. రమకళ్ళనుండి అనంతమైన అశ్రుధారలు ప్రవహించి ప్రవహించి శుష్కించిపోతున్నదనే సంగతి ఒక్క విశ్వేశ్వరి మాత్రమే అర్థం చేసుకున్నది. ఇంత అనంతమైన వేదనానుభవం తర్వాతకూడా రమకళ్ళలో ఏదో కొంచెమైనా కాంతి వుంటే, అది కేవలం సుదూరమైపోయిన ఒకానొక వస్తువును తనకు అత్యంత సన్నిహితంగా చూడాలన్న అభిలాష తప్ప మరొకటి కాదని విశ్వేశ్వరి రూఢి చేసుకుంది.

విశ్వేశ్వరి ప్రేమపూరితంగా "రమా !" అని పిల్చింది.

"ఏమిటి పెద్దమ్మా !" అన్నది రమ.

"నేను నీ తల్లిలాంటి దాన్నిగద ... ?"

రమ మధ్యలోనే అందుకుని "తల్లివంటి దానివేగాదు పెద్దమ్మా; తల్లివే ! నువ్వుతప్ప నాకెవరున్నారు ?"

విశ్వేశ్వరి వంగి రమఫాల భాగాన్ని ముద్దు పెట్టుకుంది. "అయితే నిజం చెప్పు, నిజంగా నీ బాధ ఏమిటి ?" అనడిగింది.

"జబ్బు" అంది రమ సంక్షిప్తంగా. ఈ క్షణాన రమ ముఖం సింధూరవర్ణంగా మారిపోయింది. యీ సంగతి విశ్వేశ్వరి గమనించింది. మరింత ప్రేమతో చిక్కుపడిపోయిన రమ కురులను వ్రేళ్ళతో సరిచేస్తూ జబ్బును "ఎవరైనా, దాచిపెట్టు కుంటారా ? నా రెండుకళ్ళూ ఆ సంగతి గమనించలేవనుకుంటున్నావా ? కాని యీ దృష్టికి కూడా అందని జబ్బు అనేది వుంటే-దాన్ని నా దగ్గిర దాచిపెట్టాలని వ్యర్థయత్నం చేయకు. దానివల్ల జబ్బు మరింత పెరుగుతుందేగాని, తరగదుగద !" అంది విశ్వేశ్వరి. అప్పటికింకా బాగా ప్రొద్దెక్క

లేను. భానుడు మెల్ల మెల్లగా నిద్రనుంచి మేల్కొన్నట్టు మబ్బుల్లోంచి తొంగి చూస్తున్నాడు. ఆ అస్పష్టమైన కాంతిని అలాగే చూస్తూ; "అయితే వేణీబాబుకు యిప్పుడెట్లావుంది?" అనడిగింది రమ.

"ఇప్పుడు బాగానేవుంది. తలమీది గాయం పూర్తిగ మానడానికి యింకా కొంతకాలం పడుతుంది. అయినా అయిదారు రోజుల్లో హాస్పిటల్‌నుంచి విడుదల చేస్తారు" అని చెప్పింది విశ్వేశ్వరి.

రమ ముఖంలో గోచరిస్తున్న విషాదాన్ని విశ్వేశ్వరి గమనించి; దాన్ని గురించి నువ్వేమీ విచారించకు తల్లీ! జరిగిందేదో అది వాడి మంచికే జరిగింది..." అంది. రమ ముఖంలో కనిపించిన ఆశ్చర్యాన్ని కూడా గమనించి "నువ్వను కునేదేమిటో నాకు తెలుసు రమా! యిదేగా; తల్లినై వుండి, కొడుక్కి జరిగిన యీ ఘోర ప్రమాదానికి విలపించకపోగా అలా జరగడమే మంచిదని దీవిస్తున్నాననేగా నీ ఆలోచన! కాని నిజం చెబుతున్నాను రమా, అందువల్ల నాకు సుఖమే కలిగిందో దుఃఖమే కలిగిందో స్పష్టంగా విశదపరచి చెప్పలేను. ఎంచేతనంటే అధర్మానికీ అన్యాయానికీ భయపడని వాడికీ, సిగ్గూలజ్జ మానాభిమానాలు లేని వాడికీ కూడా తన ప్రాణాల మీద తనకు తీపివుంటూనే వుంటుంది. ఆ భయంకూడా లేక పోతే యీ ప్రపంచమే ఏనాడో తారుమారై వుండేది. అంచేత నాకేమనిపిస్తుందంటే ఆనాడు కలువా కొడుకు వేణీ తల పగలగొట్టి ఎంత ఉపకారం చేశాడో...ఆ మాత్రం వుప కారం వేణీ ఎన్నడూ చేసి వుండడు. మనిబాగ్గును మనం ఏ

గంగలో ముంచినా దాని రూపాన్ని మార్చలేం! దాని రంగును మార్చాలంటే దాన్ని నిప్పు చెయ్యవలసిందే!" అన్నది విశ్వేశ్వరి.

"అయితే ఆ రోజున యింట్లో ఎవరూ లేరా?" అనడిగింది రమ.

"ఎందుకు లేరూ, అందరూవున్నారు. కలువా కొడుకు అకస్మాత్తుగా రానూ లేదు, అకస్మాత్తుగా కొట్టనూ లేదు. అన్నీముందే ఆలోచించుకొని అన్నిటికీ సిద్ధపడే వేణీని కొట్టడానికి వచ్చాడు. అట్లా కొట్టినందువల్ల జరిమానాపడినా జైలుశిక్ష పడినా, దేనికైనా సిద్ధపడేవచ్చాడు! ఆ కుర్రాడికి వేణీమీద వ్యక్తిగతమైన ద్వేషమేమీ లేదు; కేవలం రమేశ్‌కు జరిగిన అన్యాయం వల్లనే వాళ్ళకంత కోపాలు పెరిగిపోయినయ్. వాదోపవాదాలు జరిగినయ్. కోపం పట్టలేక వాడు తన కావడి బద్దతో వేణీ తలమీద కొట్టాడు. ఆమాత్రం దెబ్బకే వేణీ స్పృహతప్పి పడిపోయాడు. వాడు వెళ్ళిపోతూ, యిప్పటికైనా బుద్ధి తెచ్చుకుంటే సరేసరి; లేకపోతే నా తరువాత మరొకడూ, యింకొకడూ కూడా యిట్లాగే నీకు శాస్తి చేస్తారు అని చెప్పిపోయాడు వాడు." అని చెప్పింది విశ్వేశ్వరి.

రమమెల్లగా; "అయితే ఒకడూ-ఇద్దరూ కాదన్నమాట! మొత్తం అందరూ దళంగా ఏర్పడ్డారన్నమాట!" సరేకాని పెద్దమ్మా, వీళ్ళందరికీ అకస్మాత్తుగా యింత సాహసం ఎట్లా వచ్చిందంటావు? అనడిగింది రమ.

విశ్వేశ్వరి కొంచెంగానవ్వి, "ఆసంగతి నీకు తెలియదా రమా ! వీళ్ళందరికీ యింత జ్ఞానాన్ని సాహసాన్ని ఎవరు ప్రసాదించారో వాళ్ళను నువ్వు ఎరుగవా? ఒకసారి అగ్ని రగుల్కొవడమే జరిగితే-అది అంత తేలిగ్గా చల్లారదు. ఒక వేళ బలవంతంగా చల్లార్చినా; ఆ చుట్టుప్రక్కలవున్న వస్తువులు తాపం పొందుతాయి. రమేశ్, నా రత్నాలబిడ్డ, జైలు నుంచివచ్చి ఎక్కడున్నా అతను చిరంజీవిగానే జీవిస్తాడు. వేణీ సంగతి గుర్తొస్తే-దీర్ఘంగా నిట్టూర్చడం తప్ప...యింకేం చెయ్యలేను..." అంటూ ఆమె నిజంగానే దీర్ఘంగా నిట్టూర్చింది ఈ సంగతి గమనించి విశ్వేశ్వరి చేతిని తన గుండెల మీద పెట్టుకుంది.

విశ్వేశ్వరి తనను తాను సంబాళించుకుని, "రమా! ఏకైక సంతానంవల్ల కలిగే సుఖదుఃఖాలు అనుభవించే నా లాంటివారికే అర్థమౌతాయి. స్పృహ తప్పిపోయిన వేణీని ఎత్తి బండిలో పెట్టుకుని హాస్పిటల్‌కు తీసుకుపోతున్నప్పుడు నా మనఃస్థితి ఎలావుందో యిప్పుడు చెప్పలేనుగాని, ఆ క్షణాన నేను మాత్రం ఎవరినీ నిందించలేక పోయాను. నా ఏకైక సంతానమైన వేణీకి అంత ప్రమాదం సంభవించినా, నేను కళ్ళప్పగించి అలాగే వుండిపోయానే తప్ప, నోరెత్తలేక పోయాను. ధర్మశాసనం ముందు తల్లైనా ఎవరైనా ఒక్కటే! పాపానికి ప్రాయశ్చిత్తం జరిగే తీరుతుంది; ఆ సంగతి నే నెప్పుడూ మర్చిపోలేను!" అన్నది విశ్వేశ్వరి.

రమ కొన్ని క్షణాలు ఆలోచించి; "పెద్దమ్మా, నేను నీతో ఏమీ వాదించను! కాని రమేశ్ బాబు ఏం పాపం చేశాడని ఆయన కంత కఠినశిక్ష లభించింది?

మేమంతా కలిసి చేసిన కుట్రేగా!" అన్నది.

"కాదురమా! పాపంకావటంవల్ల బద్దలయింది. అందు కేగా వేణి హాస్పిటల్ పాలయ్యాడు! యిక నువ్వు..." అని అకస్మాత్తుగా తన పెదాలమీద కొచ్చినమాటను తనలోనే దిగమింగి "నాకు తెలుసు తల్లీ. ఏ కార్యమూ శూన్యంగానే సమాప్తమైపోదు! మనం చేసిన కార్యం తాలూకు మంచిచెడ్డల ప్రభావం ఎప్పుడో ఒకప్పుడు తప్పకుండా కనిపిస్తుంది. కాని ఒకడు చేసిన పనికి యితరులుకూడా ఎందుకు బాధ్యులౌతారో; దాని దుష్ఫలితాన్ని చుట్టుప్రక్కల వాళ్ళు కూడా ఎందుకు అనుభవించవలసి వస్తుందో ఆ సంగతి మాత్రం నేను చెప్ప లేను." అన్నది విశ్వేశ్వరి.

రమకు తాను చేసినదేమిటో తనకు గుర్తొచ్చి దీర్ఘంగా నిట్టూర్చింది. విశ్వేశ్వరి మామూలు ధోరణిలో చెపుతూ; "యిందువల్ల నాకూ జ్ఞానోదయం జరిగినట్లయింది. మొదట్లో చిన్నాపెద్దా అనేకమైన మెట్లు ఎదురౌతాయి. వీటన్నిటినీ అధిగమించి ముందుకు పోగలిగే ధైర్యం కూడా కావాలి. ఒకరోజున రమేశ్ హఠాత్తుగా వీడ్కోలు చెప్పడానికి నా దగ్గరకొచ్చాడు. 'పెద్దమ్మా, నే వెడుతున్నాను. ఈ గ్రామస్థులకు ఉపకారం చెయ్యాలనుకోవడం కేవలం వ్యర్థం. ఎక్కణ్ణుంచి వచ్చానో తిరిగి అక్కడికే వెళ్ళిపోతాను" అన్నాడు. నేను రమేశ్‌ను ఆపి 'కాదు నాయనా, నా మాట విను.

తొందరపడినందువల్ల సత్ఫలితాలు కలుగవు. ప్రారంభించిన కార్యాలను అసంపూర్తిగా విడిచిపెట్టి పారిపోవడం భావ్యం కాదని చెప్పాను. నా మాట అతడెన్నడూ కాదనలేదు అతనికి శిక్ష పడిందని విన్నరోజున, నేనే అతన్ని బలవంతంగా యిక్కడ వుంచి, నేనే ఆ శిక్ష వేయించానా అనిపించింది కాని వేణినికూడా హిస్పిటల్లో చేర్చినరోజున; ఫర్వాలేదని జైలు కెళ్ళడం మంచిదేనని అనిపించింది. మరో సంగతేమిటంటే బయటి ప్రపంచంనుంచి వొచ్చి యీ గ్రామీణ సమాజాన్ని సంస్కరించడం యింతకఠిన మనేసంగతి నేనూహించలేదు. సమాజాన్ని సంస్కరించేటప్పుడు-సంస్కర్తే సమాజంలో అంతర్భాగమైపోతే తప్ప, సత్ఫలితాలు కలుగవు. తన విద్యా సంస్కారాలతో పాటు కార్యదీక్షకూడా కలిగిన రమేశ్ ఈ సమాజంలో అడుగుపెట్టినప్పుడు అతనంత సంస్కారవంతుడు ఈ సమాజంలో మరొకడు లేడు. ఎవరూ అతని స్థాయినిఅందు కోలేక పోయారు; చివరకు నేనుకూడా! కాని ఏంలాభం, అతన్ని స్వేచ్ఛగా బయటికి వెళ్ళనివ్వలేకపోయాను; సమాజంలో నిలబెట్టలేకపోయాను!'' అని అన్నది విశ్వేశ్వరి.

రమ ఏదో చెప్పాలనుకుంది. కాని విశ్వేశ్వరీ మళ్ళీ ప్రారంభించి; "కాని యిందుకు నేనేమీ చింతించడంలేదు. ఈ సారి మీరందరూ కలిసి అతన్ని మీతోపాటు అధఃపాతాళానికి యీడ్చారు! సాధారణ జనంతో కలిపివేశారు. యిందువల్ల మీరు ఎంత మహాపాపం చేశారో నేను చెప్పనుగాని, రమేశ్ జైలునుంచి వచ్చిన తరువాత 'సత్యాన్ని' ప్రత్యక్షంగా మాత్రం చూడగలడు, యిదినిజం!'' అన్నది విశ్వేశ్వరి.

పెద్దమ్మ చెప్పిన మాటలోని అంతరార్థమేమిటో రమకు బోధపడలేదు. "రమేశ్ బాబుకు యిందులో హీనస్థితి ఏముంది? మా అన్యాయాల మూలంగా ఆయన ఎన్ని చిక్కులు ఎదుర్కొనవలసి వచ్చినా ఆ కళంకం ఆయన కెందుకు అంటుతుంది? అసంభవం! ఆ కళంకం మమ్మల్నే సర్వభ్రష్టం చేస్తుంది ఆయనకేమీ నష్టంలేదు!" అన్నది రమ.

విశ్వేశ్వరి మ్లానవదనంతో చిన్నగానవ్వి; "ఏమీ నష్టంలేదా? కాదు రమా, ఆయనకూ అంటుతుంది! అలా జరక్కపోతే పాపాన్ని భయంకరంగా మనం ఎందుకు చూస్తాం? ఉపకారానికి బదులు ప్రత్యుపకారం చెయ్యకపోగా, అపకారమే చేస్తూ కృతఘ్నత కొద్దీ దాతయొక్క ఔన్నత్యానికి అంతరాయం కలిగించకపోతే అదంతా వ్యర్థమే! నీకు తెలుసు తల్లి! కాని నీ యీ స్వగ్రామమైన కువాంపూరు నివాసియైన రమేశ్ తిరిగి మొదటి రూపంలో మాత్రం యిక మీదట చూడలేరు! అతను తిరిగివచ్చిన తరువాత గాని నా మాట మీరు నమ్మరు ఏ చేతినుంచైతే రమేశ్ అక్షయదానాలు చేశాడో-ఆ చేతినే భైరవుడు నరికివేశాడు!" కొద్దిసేపాగి తనలోతను అనుకుంటున్నట్టుగా;" యింతవరకూ ఏం జరిగిందో అంది మంచే జరిగింది. కాదని ఎట్లా అనుకోగలం? రమేశ్ చేతినుంచి అక్షయదానాలు అందుకోకలిగిన గీత గ్రామస్థులు ముఖాన లేనప్పుడు, యిక వాళ్ళకు మిగిలింది అతని భగ్న హస్తమే! దాని ప్రతిఫలమే వాళ్ళు అనుభవించవలసి వుంటుంది." విశ్వేశ్వరి ముఖం గంభీరంగా మారిపోయింది.

విశ్వేశ్వరి చేతిని నెమ్మదిగా నిమురుతూ కరుణాపూరిత స్వరంతో "పెద్దమ్మా! ఒక్కమాట చెప్పు; తప్పుడుసాక్ష్యం ద్వారా నిరపరాధిని శిక్షించినందుకు ప్రాయశ్చిత్తమేమిటి? దానికేదైనా వుందా?" అనడిగింది రమ.

విశ్వేశ్వరి బయటకు చూస్తూ చిక్కుపడినరమ కురులను వ్రేళ్ళతో చిక్కు తీస్తున్నది. ఈ మాట విని రమ ముఖంలోనికి చూసేసరికి రమ కన్నులనుండి అశ్రుధారలు స్రవిస్తున్నయ్. పెద్దమ్మ ఆదరంగా రమకన్నీళ్ళు తుడిచి, "రమా! యిందులో నీ తప్పేముంది? నీపై నిందలభారాన్ని మోపి, భయపెట్టి నీ చేత అవి చేయించిన వాళ్ళదేతప్పు! యిందుకు నువ్వు చేసుకోవలసిన ప్రాయశ్చిత్త మేదీలేదు తల్లి... "అంటూ విశ్వేశ్వరి మరోసారి ఆమె కన్నీళ్ళు తుడిచింది. పెద్దమ్మ చూపిన యీ నిష్కల్మష సానుభూతి, వాత్సల్యంతో రమ అంతర్యంలోని దుఃఖసముద్రం కట్టలు తెంచుకుని ప్రవహిస్తున్నది. మరి కాస్సేపటికి రమ తనను తాను సంబాళించుకుని, "ఆయనకు రమేశ్ బాబంటేనే విరోధం! ఏదో విధంగా శత్రువును నాశనం చెయ్యడమే వేణీబాబు ధ్యేయం! కాని నా ఉద్దేశ్యం మాత్రం అదికాదు పెద్దమ్మా!" అన్నది రమ. "ఎందుకని?" అని విశ్వేశ్వరి రమ ముఖంవైపు చూసేసరికి ఆమె ముఖంలో ఒక్కొక్క మెరుపు మెరిసి నట్లుంది. ఒకానొక సంశయం యింతకాలంగా విశ్వేశ్వరి మనసులో తారట్లాడుతుండేది. ఈ క్షణాన ఆ సంశయం తీరిపోయినట్లయింది. విశ్వేశ్వరి స్పష్టంగా గుర్తించి ఒక క్షణం వేదనా

భరితమైనవిస్మయాన్ని పొందింది. రమ ఆంతర్యంలోని నిజమైన బాధ ఏమిటో యిప్పుడు విశ్వేశ్వరికి స్పష్టమైంది.

రమ కళ్ళు మూసుకుని వుంది. విశ్వేశ్వరి ముఖం చూడకుండానే "పెద్దమ్మా!" అని పిలిచింది.

పెద్దమ్మ ఆశ్చర్యపడి తలూపింది.

రమ గుర్తించి 'ఒక్కసంగతి చెప్పాలివుంది పెద్దమ్మా?...పీర్ పూర్ లో జాఫరాలీ యింట్లో చాలామంది యువకులు రోజూ సమావేశమై, రమేశ్ బాబు చెప్పినట్టే సంస్కరణ కార్యక్రమాలనుగురించే చర్చించుకుంటుండే వాళ్ళు. కాని వాళ్ళందర్నీ 'రౌడీగుంపు'గా కేర్కొని పోలీసులకు అప్పగించాలని ఒక కుట్ర ఆలోచనల్లో వుంది. ఈ సంగతి నాకు తెలుసి నేను ముందుగానే మనిషిని పంపించి యీ కుట్రను గురించి వాళ్ళకు తెలియచేసి జాగ్రత్తపడేలా హెచ్చరించాను. పోలీసులకు కావలసింది కూడా యిలాంటివేగా! కాని ఒకసారి వాళ్ళ చేతుల్లో పడితే యింకేముంది?' అన్నది రమ.

విశ్వేశ్వరి రోమరోమాలు పుంకించినయ్. ఆశ్చర్యంతో "ఏమిటీ నువ్వనేదీ? అనవసరంగా పోలీసుల్ని పిలిపించి వేణీ యీ ఉపద్రవానికి కలపద్దాడా?" అనడిగింది.

మరోక్షణం తర్వాత, "వేణీబాబుకు జరిగిన ఆ దుర్ఘటన బహుశా దీని ప్రభావమే ననుకుంటాను. నన్ను క్షమించగలవా పెద్దమ్మా!" అనడిగింది రమ.

విశ్వేశ్వరి ముందుకువంగి రమ లలాటాన్ని ముద్దు పెట్టుకుంది. "వేణీ తల్లినై వుండి నేనే క్షమించ లేకపోతే

మరెవరు క్షమించగలరు? నేను నిన్ను మనఃపూర్వకంగా ఆశీర్వదిస్తున్నానమ్మా; భగవంతుడు నిన్ను పది కాలాలపాటు చల్లగా చూడాలి!" అన్నది విశ్వేశ్వరి.

రమ తన చేతులతో తన కన్నీళ్ళు తుడుచుకుని "పెద్దమ్మా! యిప్పుడు ఒక్క సంగతిని గురించి మాత్రం నాకు సంతోషంగా వుంది. రమేశ్ బాబు జైల్లోనుంచి రాగానే యిక యీ సమాజంలో ఆయనకు ప్రత్యర్థులు ఎవరూ వుండరు. అందువల్ల ఆయన తలపెట్టిన సంస్కరణ కార్యక్రమాన్ని నిర్విఘ్నంగా కొనసాగించుకోగలడు! చిరకాలంగా నిద్రావస్థలో వుండిపోయిన యీ సమాజం తన కృషి ఫలితంగా ఎంతగా మేల్కొన్నదో ఆయన గ్రహించి ఆనందించగలడు. కాని ఆనందంలో ఆయన నన్ను క్షమించగలరో లేదో...?" అని అన్నది రమ.

విశ్వేశ్వరి ఒక్కమాట కూడా మాట్లాడలేకపోయింది. కళ్ళనుండి అశ్రుబిందువులు జారి రమ నుదుటిమీద పడినయ్. కొన్ని క్షణాలవరకు యిద్దరూ మౌనంగానే వుండిపోయారు.

"పెద్దమ్మా!" అన్నది రమ.

"ఏమమ్మా!" అనడిగింది విశ్వేశ్వరి.

మేమిద్దరమూ నిన్ను హృదయ పూర్వకంగా ప్రేమించాం; యీ విషయంలో మేమిద్దరమూ ఒక్కటేగదూ?" అనడిగింది రమ.

విశ్వేశ్వరి మరోసారి ముందుకు వంగి రమ నుదుటిని ముద్దుపెట్టుకుంది.

పెద్దమ్మా; అందువల్లనే నేను నీకొక భారాన్ని అప్ప గిస్తున్నాను. ఒకవేళ నేను చనిపోయిన తరువాతనైన రమేశ్ బాబు నిన్ను క్షమించకపోతే...నా మాటగా ఆయనకు ఒక్క సంగతి మాత్రం చెప్పు పెద్దమ్మా...నేనెంత హీనురాలననీ, పరమ నికృష్టమైన దాననని ఆయన అనుకున్నారో...నిజా నికి అంత హీనురాలను కానసే సంగతి ఆయనకు తెలియ చెయ్యి. అదీగాక ఆయనకు నేనెంత కష్టం కలిగించానో- అంతకు రెట్టింపు దుఃఖాన్ని కూడా నేను అనుభవించానని చెప్పు...బహుశా నీ నోటిమీదుగా ఆయన యీ మాటలు వింటే విశ్వసించగలరు అనుకుంటాను." అన్నది రమ.

విశ్వేశ్వరి వంగి రమను గాఢంగా కౌగలించుకుని చంటిపిల్లలా బావురుమని ఏడ్చింది. కొంతసేపటి తర్వాత "పెద్దమ్మా! మనం ఏ పుణ్యక్షేత్రాలకైనా సుదూర ప్రాంతా నికి వెళ్ళిపోదాం. ఈ వేణీ, యీ రమేశ్, యీ దుష్టసమా జం యీ దౌర్భాగ్యాలు ఎక్కడ వుండవో అలాంటి నిత్య ప్రశాంత పుణ్యభూమికి వెళ్ళిపోదాం. ఏ క్షణాన కళ్ళు తెరిచిచూచినా ఎదురుగా దేవాలయ శిఖరాలు తప్ప మరొ కటి కనిపించని తావుకు వెళ్ళిపోదాం. ఎక్కడ అహర్నిశలూ భగన్నామ సంకీర్తనలు శ్రవణహాయిగా వినిపిస్తాయో; ఎక్కడ జగన్నాటక సూత్రధారుని లీలలు ప్రస్తుతించ బడ తాయో అక్కడకు వెళ్ళిపోదాం! మనం వెళ్ళిపోయే సమ యం వొచ్చిందని అర్థమైనప్పుడే-వెళ్ళిపోవడం మంచిది. మనం జన్మించింది విశిష్టబ్రాహ్మణ సమాజంలో. పరలోకాలకు పోయే ముందైనా, మనసు నిశ్చింతగా వుండేట్టు చూసు

కోవడం ముఖ్యం. విషాదహృదయులకు ఏ లోకంలోనూ స్థానం వుండదు." అన్నది విశ్వేశ్వరి.

రమ కొన్ని క్షణాలవరకూ మౌనంగా పడివుంది; దీర్ఘంగా నిట్టూర్చి, "నా అభిప్రాయంకూడా సరిగ్గా అదే పెద్దమ్మా !" అని అన్నది.

# 18

జైలు నాలుగు గోడల వెలుపల తానింత కాలంగా పడిన శ్రమకు భగవంతుడు యింత చక్కని ప్రతిఫలాన్ని లభింప చేస్తాడని రమేశ్ పిచ్చిగా, స్వప్నంలోగానీ వూహించ లేక పోయాడు. ఆరుమాసాల కఠినశిక్ష అనుభవానంతరం, యివాళ మొదటసారిగా పాదం బయట పెట్టేసరికి రమేశ్‌కు ఎంత ఆశ్చర్యం కలిగిందో చెప్పలేం ! గొడుగు వేసుకుని స్వయంగా తనను ఆహ్వానించడానికి వేణీ ముందుగా నిల బడ్డాడు. ఆయన వెనుక రెండు పాఠశాలల తాలూకు ప్రధా నోపాధ్యాయులు, ఆ తరువాత విద్యార్థుల బృందమూ నిలబడి వున్నారు. హిందూ, ముస్లింరైతులు కూడా చాలామంది ఉత్సాహంతో ముందుకొచ్చారు. అందరికంటే ముందుగా వేణీ రమేశ్‌ను గాఢంగా ఆలింగనం చేసుకుని రుద్ధకంఠంతో "రమేశ్ తమ్ముడూ ! రక్తసంబంధం ఎంత బలీయమైనదో, నేను యివాళే అర్థం చేసుకున్నాను. ఆ జాదూముఖర్జీకూతురు

ఆ దౌర్భాగ్యపు మనిషి - సిగ్గూ లజ్జా మానాభిమానాలు లేకుండా యింత శత్రుత్వాన్ని సాధిస్తుందనే సంగతి నేను కళ్ళుండే చూడలేకపోయాను. కాని దానికి ప్రతిఫలంకూడా నేను అనుభవించక తప్పలేదు తమ్ముడూ! ఆరునెలలు జైల్లో వున్నావంటే...నీకేం నువ్వు సుఖంగానే వున్నావు! కాని నేను! ఈ ఆరుమాసాలు ఆరుయుగాలుగా గడిపాను అనుకో! ప్రతిక్షణం అణువణువునా కంపించిపోయి, ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకుని బ్రతికాననుకో!" అన్నాడు వేణీ.

రమేశ్‌కు ఏంచెప్పాలో తోచలేదు; ఏం వింటున్నాడో అతనికి అర్థంకాలేదు. ఆశ్చర్యంతో అలాగే వింటూ ముఖాలు చూస్తూ వూరుకున్నాడు.

ప్రధానోపాధ్యాయు లిద్దరూ చప్పున వంగి రమేశ్‌కు పాదాభివందనం చేశారు. రైతులుకూడా ముందుకొచ్చి రమేష్ పాదధూళి తీసుకున్నారు. భక్తి ప్రపత్తులతో చేతులుజోడించి శతాధిక నమస్కారాలు చేశారు. మరీ వృద్ధులైనవారు ఆనందాశ్రువులు తుడుచుకుంటూ రమేశ్‌ను దీవించారు.

వేణీ దుఃఖాన్ని ఆపుకోలేక ఒక్క పెట్టున భోరున ఏడ్చాడు. రుద్ధకంఠంతో "రమేశ్ తమ్ముడూ; జరిగిందేదో జరిగిపోయింది. యిక ఎన్నడూ నన్ను విడిచి దూరంగా వెళ్ళకు! పద; మనింటికి పోదాం! అమ్మ నీకోసరం ఏడ్చి ఏడ్చి కళ్ళు కాయలు కాసినయ్!" అన్నాడు వేణీ.

గుర్రపుబగ్గీ సిద్ధంగావుంది. రమేశ్ మారుమాట్లాడకుండా బండిలో కూర్చున్నాడు. వేణీ ముందువైపు కూర్చున్నాడు. తలమీదినుంచి గొడుగు తీసేసరికి వేణీ తలమీది

మానిన గాయం తెల్లగా మెరిసింది. వేణీ దీర్ఘంగా నిట్టూర్చి తలఎత్తి దిగాయం చూపిస్తూ, "ఎవరిని నిందించేది తమ్ముడూ.. యిది నా పాపాలకు ప్రతిఫలం! సరేపోనీ...అదంతా యిప్పుడు చెప్పుకుని ఏంలాభం!" అన్నాడు. అతనిముఖం విషాదంతో నిండిపోయింది. వేణీ యీ విధంగా తన స్వయంకృతాన్ని అంగీకరించడంతో రమేశ్ హృదయం ద్రవించింది. తన పరోక్షంలో ఏదో విచిత్రం జరిగిందనే రమేశ్ అనుకున్నాడు. ఇక యీ విషయాలను గురించి అధికంగా అతనేమీ విన దలచుకోలేదు. కాని వేణీ చెప్పదలచుకున్నది. అసంపూర్తిగ యిట్లా ఆగిపోవడం అతనికేమంత నచ్చలేదు. రెండు నిము షాలు నిశ్శబ్దంగా వుండి మరోసారి దీర్ఘంగా నిట్టూర్చడం ద్వారా మళ్ళీ రమేశ్‌ను ఈ ప్రసంగంవైపు లాగాడు. మరు క్షణంలోనే, "తమ్ముడూ! నాలో మొదట్నుంచీ ఒక దోషం వుంది తమ్ముడూ! మనసులో వున్నదేమిటో మొఖాన్న అనే సేటంతవరకూ నేనుండలేను! చెప్పేదొకటి, చేసేదొకటిగా చెయ్యడం నాకు నచ్చదు! ఇతరులలాగా నేనుమనసులో ఏదీ దాచిపెట్టుకోలేను. అందువల్లే అనేకసార్లు నేను నోరు పారేసు కున్నాను. అయినా నాకు తెలివిలేదు!" అన్నాడు వేణీ.

రమేశ్ ప్రశాంతంగా వింటున్నాడు. ఇది గమనించి, మరింత అధిక వినయస్వరంతో "నాలోని యీ దోషంవల్లనే, మేము నీకు ఏ అన్యాయం చేశామని మమల్ని యిట్లా సర్వ భ్రష్టం చెయ్యడానికి సిద్ధపడ్డావని! అన్నాడు. నేను రమను స్పష్టంగా అడిగాను. రమేశ్‌ను అన్యాయంగా జైలుకు పంపించావు; ఆ సంగతి తెలిసి అమ్మప్రాణాలే పోగొట్టు

కునేందుకు సిద్ధపడింది. మేం అన్నదమ్ములం, ఆస్తిపాస్తులను గురించి ఎప్పుడేనా ఏ కొంచెమైనా పోట్లాడుకుంటే మాత్రం, మధ్య నీకేంగుకూ? అనవసరంగా మా తమ్ముణ్ణి మా రొచ్చు లోదింపావు; అమ్మకు అనంతమైన దుఃఖాన్ని కలిగించావు. యిదంతా ఎందుకు చేసినట్లు అనడిగాను" అన్నాడు వేణీ. ఈమాటలు చెబుతూ వేణీబగ్గిలోనుంచి బయటనీలాకాశం వేపు చూస్తున్నాడు. రమేశ్ ప్రత్యక్షరూపంగా ఏమీ మాట్లాడ లేదు గాని మనసులోనే వింటున్నాడు. వేణీ కొంచెం సేపాగి; "తమ్ముడూ! నిజం చెబుతున్నాను; ఆ నాటి రమ ఉగ్రరూపం గుర్తొస్తే యిప్పటికీ నాగుండెలు దడదడ లాడుతున్నయ్. పళ్ళు పటపట కొరుకుతూ, "రమేశ్ తండ్రి మా తండ్రిని జైలుకు పంపించలేదూ? యివాళ వాడి కొడుకు నా చేతిలో చిక్కితే వొదిలి పెడతానా? అన్నది రమ. అబ్బ; ఆడదానికి ఎంత అహంకారం! ఎంత రాక్షసత్వం! ఎంత ప్రతీకారవాంఛ! ఆ మాటలు వినేసరికి నా వళ్ళు మండినట్లయింది. సరేకానీయ్; తమ్ముడు జైలునుంచి రానీయ్; దాని భరతం పట్టిద్దామని వూరుకున్నాను.

ఇప్పటివరకూ రమేశ్ యీమాటలన్నీ పరధ్యానంగానే వింటున్నాడు. ఎప్పుడు తనతండ్రి రమ తండ్రిని జైలుకు పంపించాడో దాని సంగతేమిటో వివరాలు తెలియవు. ఈ వూరొచ్చిన మొదటి రోజుల్లో మొట్టమొదటసారిగా రమ పిన తల్లే యీ విషయాన్ని గురించి ప్రస్తావించిన నా నా మాటలు అన్నది. అంతకు తప్ప రమేశ్ కు యింకేమీ తెలియదు. ఆ

తరువాత ,జరిగిన దేమిటో రమేశ్‌కు తెలుసుకోవాలని పించింది.

వేణీ మామూలు ధోరణిలోనే చెబుతూ; కొట్లాటలూ-పోట్లాటలూ రమకు చిన్నప్పట్నుంచీ అలవాటే తమ్ముడూ! ఆ రోజున నిన్ను కొట్టడానికి అక్బర్‌ను పంపింది నీకు గుర్తుంది గదూ! కాని ఆ వేళ నువ్వే వాణ్ణి చావచితగ్గొట్టి పంపావు. కాని. నన్ను చూశావుగదా...వాడు...వెధవ, పంది...ఆ కలువా కొడుకు...నన్నేంచేశాడో?" అని వేణీ కొంచెం ఆలోచించి మొత్తం కథంతా టీకా టిప్పణీలతో సహా వర్ణించి చెప్పడం ప్రారంభించాడు.

"ఆ తరువాత ఏం జరిగింది?" అనడిగాడు రమేశ్ ఆసక్తితో.

వేణీ తనలోని కల్మషాన్ని కప్పెట్టుకుని లేని నవ్వు తెచ్చుకొని; "ఆ తరువాత ఏం జరిగిందో నాకు తెలియదు! ఎవరు ఎట్లా నన్ను హాస్పిటల్‌కు చేర్చారో ఎవరు మందిచ్చారో అది నాకు బాగా తెలియదు. పదిరోజుల తర్వాత బాగా స్పృహవచ్చి కళ్ళు తెరిచి చూస్తే హాస్పిటల్‌లో పడి వున్నాను. ఈ దెబ్బలో నేను బ్రతికి వున్నానంటే-అది కేవలం మా అమ్మచలవే! అలాంటి తల్లులు చాలా అరుదు!" అన్నాడు.

రమేశ్ ఏమీ మాట్లాడలేదు! కొయ్యబొమ్మలాగా కూర్చుని వింటున్నాడు. కేవలం చేతి పిడికిళ్ళు మాత్రం ఎంతో బలంగా బిగించుకొని కూర్చున్నాడు. వేణీ సహజంగా ఎంత పిరికివాడో, ఎంత తుచ్ఛుడో, ఆ సంగతికూడా రమేష్‌కు

బాగానే తెలుసు. ఎన్ని దురాగతాలైనా, ఎంత విచిత్రమైన కుట్రలైనా చెయ్యగలడు. కాని యింత పచ్చి అబద్ధాలను సైతం నిస్సంకోచంగా చెప్పగడలని రమేష్ అనుకోలేదు. ఇందువల్ల రమను గురించి తనకున్న దురభిప్రాయాలు క్రమంగా తొలిగిపో నారంభించినయ్.

రమేష్ జైలునుంచి రావడంతో వూరు వూరంతా ఆనందోత్సాహాలతో నిండి నట్లయింది. రోజూ ఎవరో ఒకరు వచ్చి తమ సంతోషాన్ని వ్యక్తంచేస్తూ పరామర్శ చేస్తూనే వున్నారు. ఇందువల్ల జైలుశిక్ష అనుభవించానన్న బాధ అతనిలో ఏ కొంచెమైన వున్నట్లయితే అదికాస్తా క్రమంగా తొలగి పోయింది. తను జైల్లోవున్న యీ ఆరుమాసాల్లోనూ యీ గ్రామాల్లో అద్భుతమైన చైతన్యం వెల్లివిరిసినట్లు అతను గమనించాడు. ఇంత స్వల్పకాలంలోనే యింత మార్పు రావడం అతని కెంతో ఆశ్చర్యం కలిగించింది. వేణీపట్ల ఏహ్యాభావం కలిగిన చిన్నచిన్న శక్తులన్నీ యీ దశలో ఏకమై ఏకైక శక్తిగా రూపొందడం వల్లనే యింత మార్పు సంభవించింది. ఇప్పుడు రమేష్ వేణీని బాగా అర్థంచేసుకున్నాడు. ఎంత దురాగతాలైనప్పటికీ వేణీపట్ల గ్రామస్థులు ఎంతవరకు బాధ్యతతో వ్యవహరించాలో అంతవరకే వ్యవహరించడం కూడా గమనించాడు.

ఇక యిప్పుడు వేణీకి తనపట్ల ఏ విధమైన ద్వేషమూ లేదని తెలుసుకున్నాడు ఊరి పరిస్థితి కూడా యిప్పుడు ఎంతో మెరుగైంది. రమేష్‌కు జరిగిన అన్యాయానికి ప్రతివాడు అంతో యింతో ఖేదపడ్డారు. గ్రామస్థులు చూపుతున్న

సానుభూతి, సకారాలు, వేణీ హృదయః ప్రవర్తన చూసేసరికి రమేశ్‌కు మరింత ఉత్సాహం లభించింది. ఆసమాసాల క్రితం తాను ఏ కార్యాలనైతే అసంపూర్తిగ విడిచి పెట్టవలసి వచ్చిందో, వాటన్నిటని యిపుడు కొట్టించిన ఉత్సాహంతో పూర్తిచెయ్యాలని వుంది. కాని శారీరకంగా అతనిలో అంత ఉత్సాహంలేదు. అంచేత కొన్నాళ్ళవరకూ పూర్తి విశ్రాంతి తీసుకోవాలనిపించింది. అంచేత విశ్రాంతి కాలంలో అతను చిన్నా-పెద్ద అందర్నీ కలుసుకుని, మంచీ-చెడ్డా పరామర్శ చేసేవాడు. ఆ విధంగా కొంత మనశ్శాంతి లభించినట్లు యేది. కాని ఒక్క విషయం మాత్రం అతని మనసులో అనుక్షణం మెదులుతుండేది. రమకు సుస్తీగా వున్నదనే సంగతి అతనికి తెలుసు. కాని ఎట్లా వుందో ఆ సంగతి యింతవరకూ ఎవరినీ అడగలేదు. రమేశ్‌కు ఆమెతో సంబంధాలు దాదాపు పూర్తిగ తెగిపోయినట్టే. దానికితగినట్టు వూళ్ళో అడుగుపెట్టే పెట్టడంతోనే యీ అనర్థాలన్నిటికీ రమే మూలమని చాలా మంది అన్నారు. జైలునుంచి వస్తున్నప్పుడు బండిలో వేణీ కూడా ఆదే విధంగా చెప్పాడు. ఈ రెండింటిని పోల్చిచూస్తే వేణీ చెప్పిందే నిజానికి దగ్గరగా వున్నట్టు తోచింది.

కొద్దిరోజుల తర్వాత ఒకనాడు మళ్ళీ వేణీబాబు రమేశ్ దగ్గరకు వొచ్చాడు. ఎందుకంటే పీర్‌పూర్ గ్రామంలో కొంత భూమి అవిభక్తంగానే వుండిపోయింది. ఆ భూమిని గురించే రమకూ వేణీకి మధ్య కొద్ది కొద్దిగా అభిప్రాయ భేదాలు ఏర్పడుతున్నయ్. దీన్ని ఆధారం చేసుకుని రమేష్‌ను రమపైకి వుసి గొల్పాలని వేణీ అభిప్రాయం.

రమను గురించి ఒక బహిరంగంగా ఎన్ని ఆడంబరాలు పల్కినా, వేణీకి ఆమె అంటే లోలోపల చాలా భయం! ఇప్పుడు సుస్తీగా వుంది. ఆమె మంచంమీదనే పడి వుంది. కోర్టువ్యవహారాలు గానీ జమీందారీ వ్యవహారాలు గానీ ఆమె స్వయంగా చూసుకునే స్థితిలో లేదు. పీర్‌పూర్ గ్రామస్థులు కూడా యీ సమయంలో రమేష్ మాటను పాటిస్తున్నారు. అంచేత పీర్‌పూర్ గ్రామంలోని భూమిని తన హస్తగతం చేసుకోడానికి యింతకంటే మంచి సమయం మరొకటి వుండదనీ వేణీ భావించి గట్టిపట్టు పట్టాడు. అనేకవిధాల రమేష్‌ను ప్రోత్సహించి; "తమ్ముడూ, ఎందుకు ఆమెను దయ తలుస్తావు? రమకు జబ్బుగా వుంటే మన పనులు మనం చేసుకోడానికి అభ్యంతర మేమిటి? జైలుకు పంపించినప్పుడు ఆమె నిన్ను ఏ మాత్రం దయ తలచింది?" అనడుగాడు వేణీ.

వేణీ చెప్పింది నిజమే! కాని ఎంత ప్రయత్నించినా రమకు విరుద్ధంగా వ్యవహరింవడానికి అతని కేమాత్రమూ నచ్చడంలేదు. వేణీ ఒక వైపున ఎంత ఆవేశాన్ని, ఉత్సాహాన్ని కలిగించినా; రమ జబ్బుసంగతి గుర్తొచ్చేసరికి రమేష్ చల్లబడి పోతున్నాడు. రమేష్ సందిగ్ధంలో పడ్డాడు. ఏ విధంగానూ దీనికి శాంతియుత పరిష్కార మార్గాన్ని కనుగొనలేక పోతున్నాడు. ఎంతసేపూ మౌనంగానే వుండిపోతున్నాడు. వేణీ శతవిధాల అతనికి ధైర్యాన్ని నూరిపోస్తున్నాడు. ఇక యీ విషయాన్ని గురించి ఆట్టే వాద వివాదాలు లేకుండా చిలే వెళ్ళిపోయాడు.

రమేష్ దృష్టి మరో విషయంపై లగ్నమై వున్నది. విశ్వేశ్వరికి లౌకిక వ్యవహారాల పట్ల మొదట్నుంచీ కొంత ఆసక్తి తక్కువే. జైలునుంచి వచ్చినతరువాత ఆమె అభిప్రాయాల్లో చాలా మార్పు వచ్చినట్టు కనిపిస్తున్నది. విశ్వేశ్వరిలోని యీ అయిష్టత యిప్పుడు కేవలం విరక్తిగా మారి పోయినట్టుకూడా అతను గమనించాడు. జైలునుండి విడుదలైన తరువాత వేణితో కలిసి యీ ఇంట్లో అడుగుపెట్టడంతో ఆమె మనసు ఎంతో సంతోషం కలిగించింది. ఆ సంతోషంతోనే వాళ్ళిద్దర్నీ విశ్వేశ్వరి హృదయపూర్వకంగా ఎన్నోసార్లు మనసారా దీవించింది. కాని దీవెనల్లోనూ, ఆనందంలోనూ ఏదో అనంత వేదన ఛాయామాత్రంగా ధ్వనిస్తుండేది. విశ్వేశ్వరి తన జీవిత శేషాన్ని కాశీలో గడపాలని నిర్ణయించుకుంది. బహుశా యిక తిరిగిరాదు కూడాను. ఈ సంగతి తెలిసి రమేష్ విస్మితుడయ్యాడు. ఆమె యిట్లాంటి నిర్ణయాని కెందుకొచ్చిందో అతనికి మాత్రమేం తెలుసు? జైలునుంచి వచ్చీరావటంతోనే అనేక పనుల్లో మునిగిపోయాడు. ఆమెతో ప్రశాంతంగా మాట్లాడే అవకాశమే అతనికి లభించలేదు. కాని కలుసుకున్న రోజున కూడా విశ్వేశ్వరి యీ సంగతి ప్రస్తావించలేదు. కాని ఇప్పుడు తెలిసిన తరువాత ఆమె ఈ నిర్ణయాని కెందుకు వచ్చిందో-తన వివేకాన్నంతటినీ వినియోగించి ఆలోచించాడు. ఈ విషయం నిజమేననీ-ఆమె నిజంగానే సర్వబంధాలూ త్యజించి వెళ్ళిపోవడానికే సిద్ధపడిందనీ నిర్ణయించుకున్నాడు. పెద్దమ్మ లేని లోటు, ఆమె అనుభవ అక్షయ భండారం తనకు ప్రాప్తించక

పోతే కలిగే తీరని లోటు పూరించేసరికి అతని కళ్ళు చెమ్మగిల్లినయ్. వెంటనే ఆమె యింటికి వెళ్ళాడు. రమా రమణి పని గంటలైవుంటుంది. పనిమనిషిని అడిగితే—ఆమె ముఖర్జీల వారింటికి వెళ్ళిందని తెలిసింది.

"యీ సమయంలోనా ?" అన్నాడు రమేష్ ఆశ్చర్య పడుతూ.

పనిమనిషి చాలా కాలంగా వుంటున్నదే! ఆమె చిన్నగా నవ్వి; ఇప్పుడు అమ్మగారు సమయాసమయాలను కూడా పాటిస్తున్నారనుకుంటూన్నారా ? యివాళ వాళ్ళింట్లో చిన బాబుగారి ఉపనయనం కదూ !" అని అన్నది.

"జతిన్‌కు ఉపనయనమా ?" అని ఆశ్చర్యపడ్డాడు. వూళ్ళోనే వున్నప్పటికీ తనకీ సంగతే తెలియదే !

"వాళ్ళే అసలు ఎవరికి చెప్పలేదు బాబూ ! చెపితే మాత్రం వాళ్ళింటికి ఎవరు వెడతారు. రమ తల్లిని అందరూ వెలివేశారుగా !" అని చెప్పింది పనిమనిషి.

రమేష్ మరింత ఆశ్చర్యపడ్డాడు. మరో నిమిషం తర్వాత కారణమేమిటని అడిగాడు. పనిమనిషి కాస్త సిగ్గునూ సంకోచాన్ని ప్రదర్శించి;" మాకేం తెలుసు చిన చినబాబూ ! రమ తల్లిమీద ఎన్నెన్ని అభాండాలూ, నిందలూ లోకులు చెప్పుకుంటున్నారో... ఆ సంగతులు మా లాంటి పేదవాళ్ళకేం తెలుసు..." అన్నది. అర్థోక్తిగా. ఆ తరువాత ఆమె వెళ్ళిపోయింది.

మరి కాస్సేపటివరకూ రమేష్ అలాగే నిలబడి తిరిగి యింటికొచ్చాడు. ఇదంతా వేణీ ప్రభావమేనని గుర్తించటానికి

ఆతనికి ఎంతో సేపు పట్టలేదు రమమీద వేణికి యింత కోపం ఎందుకో, దేనికింత ప్రతీకారం చేస్తున్నాడో-ఆతనికి అర్థంకాలేదు. రమమీద యింత నికృష్టమైన నీలాపనిందలు ఎంత ప్రచారం పొందినయో కూడా ఆతనికి అర్థంకాలేదు. ఎంత ఆలోచించినా యీ ప్రశ్నలకు అతనికి సమాధానం దొరకలేదు.

# 19

ఆ వేళ మధ్యాహ్నం ఒక విచిత్రమైన సంఘటన జరిగింది. మంగలి కైలాస్; సేఠ్ మోతీలాల్, యిద్దరూకూడా కోర్టునుంచి సరాసరి వచ్చి రమేష్‌ను ఆశ్రయించారు సాక్ష్యాధారాలతో సహా! రమేష్ సహజంగానే ఆశ్చర్యపడి, "నా అభిప్రాయాల కోసరం మీ రెందుకు తాపత్రపడతారు? అందువల్ల ప్రయోజన మేమిటి?" అనడిగాడు.

వాద ప్రతివాదు లిద్దరూకూడా ఏక కంఠంతో, "మీ మాటే అంగీకరించి కట్టుబడి వుంటాం బాబూ! ఆ జడ్జీలకంటే మీ రేం తక్కువ వాళ్ళుగనుక జ్యూరీ మెంబర్లలో కనీసం పదిమందైనా మీరూ, మీ సంబంధీకులేగదా! మీ రే ఆ అధికార స్థానంలో వుండి చెబితే-ఆ మాటను మేము అంగీకరించవలసిందేగదా! అందువల్ల మీరు యీ విషయంలో జోక్యం కలిపించుకోవాల్సిందే!" అన్నారు.

ఆ మాటలు రమేష్‌కు నిజంగానే సంతోషం కలిగించాయ్. "మీ ముందు అయితే మేం అన్ని విషయాలూ

దాపరికం లేకుండా చెప్పుకోగలం! కాని కోర్టులో సాధ్యం కాదు గదా! అదీగాక గోసిళ్ళతో డబ్బు వకీళ్ళను గుమ్మరించి వాళ్ళను సంతోషపరిస్తే తప్ప పనులు జరగవు. ఇక్కడ అలాంటి దేముంది. మన యిల్లూ-మనవాళ్ళూ! ఒక్క దమ్మిడీ ఖర్చువుండదు. వొద్దుబాబూ వొద్దు, ఆ కోర్టులూ వద్దు, వల్లకాడూ వద్దు. మంచిగానీ చెడుగానీ మీరు ఏది చెబితే-దాన్నే వేదవాక్కుగా పాటిస్తాం! మీ పాదధూళి మాకు లభిస్తే- మా కంతేచాలు. భగంవంతుడు మాకు మంచి బుద్ధి కలిగించాడు గనుకనే-మేము మీ దగ్గరకు రాగలిగాం!. అన్నాడు కైలాస్.

చిన్న పంటకాలువను గురించే అసలు వివాదం! దానికి సాక్ష్యంగా వున్న దస్తావేజులూ-అవీ రమేశ్‌కు అప్పగించారు. వాది ప్రతివాదు లిద్దరూ వెళ్ళిపోయారు; తిరిగి రేపు ఉదయం వస్తారు ఇలా జరుగుతుందని రమేశ్ ఎన్నడూ వూహించ లేదు. అంతేగాక గ్రామస్థుల మధ్య యింత సదవగాహన ఏర్పడుతుందని కూడా అతను ఆశించలేదు. వీళ్ళు రమేష్ తీర్పును, అక్షరాలా పాటిస్తారో లేదో ఆ సంగతి దేవుడెరుగుగానీ, యివాళ మాత్రం వాళ్ళు కోర్టుల్నీ చట్టాన్నీ అసహ్యించుకుని న్యాయంకోసరం తనను ఎన్నుకోవడం మాత్రం అతనికి నిజంగానే ఆనందము కలిగించింది. నిజానికి యిదేమంత క్లిష్టమైనదేమీ కాదుగానీ యీ విషయాన్ని గురించి యిద్దరు గ్రామస్థులు వివాదపడ్డారు. ఇది గ్రామీణ జీవితములో సహజము కూడానూ. కానీ రమేశ్

మాత్రము దీన్ని స్వల్పవిషయముగా పరిగణించడములేదు. ఈ చిన్న సంఘటనా ఆధారంగా అతను ఎన్నో గగనకుసుమాలను వూహించాడు! అతని మనసులో ఎన్నో క్రొత్తఆశలు చిగురించినయ్ భవిష్యత్తులో రమేష్ తన జన్మభూమికి ఏ విధమైన సేవ చేస్తాడో, ఎట్లా చేస్తాడో దాని సంగతి యిప్పుడనవసరం! స్వర్గమయమైన భవిష్యత్తును గురించి అతను ఎన్నో ఆశలు పెట్టుకున్నాడు. వసంతజ్యోత్స్న ఆకాసంలో ఎంతో అందంగా కనిపిస్తున్నది. ఆ దృశ్యాన్ని చూసి రమేష్ నిజంగా ఆనందపడ్డాడు. ఆ దృశ్యాన్ని చూస్తున్నప్పుడే సరిగ్గా రమ ముఖం ఒక్క క్షణం గుర్తొచ్చింది. ఇదే మరొక రోజైనట్లయితే అతని మనసు అసహ్యంతో కంపించి వుండేది. కాని యీ వేళ మాత్రం చీమతలంతైనా కోపంగానీ అసహ్యంగానీ అతనికో లేదు. తనలోతానే నవ్వుకుంటూ రమా, నీ వల్లనే భగవంతుడు నన్నింత కృతార్థుణ్ణి అవవుతాననీ, నువ్విచ్చిన విషమే నా పాలిట అమృత మవుతుందనీ నీకే మాత్రం తెలిసినా నన్ను జైలుకు పంపేదానవు కాదుగదా! అనుకున్నాడు.

"ఎవరదీ ?"

నేను బాబూ ... రాధను. అమ్మగారు (రమ) మిమ్మల్ని ఒకసారి పిల్చుకు రమ్మన్నారు; చాలా అవసరమైన పనిట!

రమ పనిమనిషిని పంపిందా! నా కోసరం! రమేష్ స్తబ్ధుడైపోయాడు. మళ్ళీ ఏ దుష్టశక్తీ తనతో చెలగాటం ఆడటంలేదుగదా ?

"చినబాబుగారూ...శ్రమ అనుకోకండి...ఒక్కసారి దయచేసి..." అనడిగింది పనిమనిషి.

"రమ ఎక్కడున్నదీ?" అనడిగాడు రమేష్.

"ఇంట్లో పడుకొని వుంది బాబూ!" అని ఒక్కక్షణం ఆగి, "మళ్ళీ రేపు అవకాశం వుంటుందో లేదో...యిప్పుడే ఒక్కసారి..." అంది రాధ.

"సరే, పద" అని లేచి నిలబడ్డాడు రమేష్.

రమ విచిత్రమైన స్థితిలో మంచంమీద పడివుంది. పనిమనిషి చూపినదారినే రమేష్ లోపలికి వచ్చి మంచం ప్రక్కనే కుర్చీమీద కూర్చున్నాడు. చాలా బలహీనంగా వున్నప్పటికీ రమ తన మనోబలంతోనే ఒక్కసారి లేచి రమేష్ పాదాలమీద పడింది. ఇంట్లో ఒక మూలగా చిన్నదీపం మిణుకు మిణుకు మంటున్నది దాని నిర్మలమైన కాంతితో రమ ముఖాన్ని స్పష్టంగా చూశాడుగాని, అంతమాత్రాన ఆమె శారీరక దౌర్బల్యాన్ని మాత్రం స్పష్టంగా గుర్తించడానికి అవకాశం లేదు. రమేష్ ఈ యింట్లో పాదం పెట్టేముందు అతని మనసులో అనేక సంకల్ప-వికల్పాలు మాలగా ఏర్పడినయ్. ఈ క్షణాన రమను చూడ్డంతోనే మనసులోని ఆలోచనలన్నీ తెగిన ముత్యాలమాలగా చిందరవందరై పోయినయ్.

కొన్ని క్షణాలు నిశ్శబ్దంగావుండి, కోమలస్వరంతో;- నీ ఆరోగ్యం ఎలావుంది రాణీ!" అనడిగాడు.

రమ అతని పాదాలు విడిచి కొంచెం దూరంగా కూర్చుని; "మీరు నన్ను 'రమ' అనే పిలవండి." అన్నది.

రమేష్‌కు ఎవరో వెన్నుపోటు పొడిచినట్లయింది. మరుక్షణంలో తనను తాను సంబాళించుకుని, "సరే, అలాగే పిలుస్తాను. నీకు సుస్తీగా వుందని తెలిసింది; ఎలావుందో ఆసంగతే అడుగుతున్నాను. పేరుదేముంది; ఆ పేరుతో పిలవకపోయినా ఫర్వాలేదు. అసలు నాను పిలవాలని కూడా లేదు." అన్నాడు. రమేష్.

రమ విని అర్థంచేసుకుంది. తనను తాను సంబాళించుకుని, "ఇప్పుడు కొంచెం తేలికగానే వుంది" అంది రమ. మరోక్షణం తర్వాత, "మిమ్మల్ని పిలిపించి నందుకు ఏమైనా ఆశ్చర్యం కలిగిందా?" అనడిగింది.

రమేశ్ కొంచెం తీవ్రంగానే "ఆశ్చర్యం ఎందుకూ? నీ మాటలను-చేతలకూ ఆశ్చర్యపడే రోజులు గతించిపోయినయ్. సరే, అసలు ఎందుకు పిలిచినట్టు? అనడిగాడు రమేషు.

ఈ మాటలు రమకు ఎంత కష్టంకలిగించిందో ఆ సంగతి రమేషుకు తెలియదు. వేదనాభరితమైన హృదయంతో రమ తలవంచుకుని, "రమేషుబాబూ! మీకు రెండుకార్యాలు అప్పగించాలని పిలిపించాను. మీ దృష్టిలో నేనెంత అపరాధినో ఆ సంగతి నాకు తెలుసు! అయినప్పటికీ నా పిలుపు మన్నించి వొస్తారనీ, యీ రెండు పనులూ నెరవేరుస్తారన్న నమ్మకం నాకుంది" అన్నది రమ. ఆమె రెండుకళ్ళూ నీళ్ళతో నిండిపోయినయ్. చాలాకాలంగా గూడు కట్టుకున్న దుఃఖం ఒక్కసారిగా పొంగిపొర్లింది. కంఠం రుద్ధమైపోయింది. ఈ స్థితిసంతా రమేషు స్పష్టంగా చూశాడు. ఒక్క క్షణంలో

రమేశ్ హృదయం కూడా పూర్వస్మృతుల ప్రభావంలోపడి ద్రవించిపోయింది. తనలో కలిగిన ఈ మార్పుకు అతనికేమీ విచిత్ర మనిపించ లేదు. జీవితకాలంలో యిన్నిన్నివాదోపవాదాలు జరిగినా, యిన్ని సంఘటనలు జరిగినా ప్రేమతాలూకు బంధం అవిచ్ఛిన్నంగానే వుండిపోయి నట్లయింది. ఈ అనుభవం రమేశ్ కే అపూర్వంగా కనిపించింది. కొన్నిక్షణాలు నిశ్శబ్దంగావుండి, "ఏమిటీ, నీ కోరికలు ?" అనడిగాడు రమేశ్.

రమ బెదిరిన లేడిలా కళ్ళు తెరిచిచూచి, మళ్ళీ తలవంచుకని "వేణీబాబు నీ సహకారంతో ఏభూమినైతే తనస్వాధీనం చేసుకోవాలను కుంటున్నాడో; అది నా వ్యక్తిగతమైన ఆస్థి; అంటే అందులో పదిహేను అణాలవంతు నాది; ఒక్కఅణావంతు మా ఉభయులదీను. ఆ ఆస్థిని నేను మీకు అప్పగించాలను కుంటూన్నాను." అన్నది రమ.

రమేశ్ కు మళ్ళీ కోపం వచ్చింది. "నీ కెందుకూభయం? ఇతరుల వస్తువును స్వాధీనం చేసుకునే లక్షణం నాకు గతంలో లేదు; యిప్పుడు అంతకన్నా చెయ్యలేను. నువ్వు దానం చేయదలిస్తే అందుకు చాలామంది వున్నారు. నేనుదానాన్ని స్వీకరించను." అన్నాడు రమేష్.

ఇటువంటి ప్రసక్తి యిదివరకు ఎప్పుడేనావస్తే రమ శాస్త్ర పౌరుషంగానే, ముఖర్జీల కుటుంబం చేసేదానాన్ని ఘోషాల్ వంశస్థులు స్వీకరించడం అవమాన మేమీ కాదుగదా అని, సమాధానం చెప్పేది కాని యిప్పుడామాట అనలేకపోయింది. మరింత వినయంగా; "ఆ సంగతి నాకు తెలుసు రమేషుబాబూ! ఇతరుల ఆస్థి కోసరం నువ్వు తాపత్రయపడ

వనీ, యితరులు పడినా నువ్వు సంహించవనీ నాకు తెలుసు. యితరుల ఆస్తిని తీసుకోవడం జరిగితే-అది పదిమంది ప్రయోజనం కోసరం తీసుకుంటావని నాకు తెలుసు. కాని అపరాధికి శిక్షపడవలసిందే! నేను చేసిన అపరాధాలకు శిక్షగా నువ్వీ భూమిని తీసుకోవడం అనుచితమా?" అనడిగింది రమ.

రమేషు కాస్సేపాగి, "సరే, యిది నీ మొదటి కోరికే మరి రెండోది?" అనడిగాడు.

"జతీన్‌ను నీకు అప్పగిస్తున్నాను. వాణ్ణి నీ అంతటి వాడిగా తీర్చిదిద్దు. జతీన్ కూడా పెద్దవాడైనాక నీలాగే నవ్వుతూ నవ్వుతూ కష్టాలను ఎదుర్కోగలిగిన శక్తివంతుడిగా తయారుచెయ్యి." అనడిగింది రమ.

రమేశ్ హృదయంలోని కాఠిన్యం కాస్తా మంచుగా మారిపోయింది.

కొంగుతో కన్నీళ్ళు తుడుచుకుంటూ, "కాని ఇవన్నీ నేను కళ్ళతో చూసే భాగ్యం నాకులేదు. కానీ జతీన్ అణువణువునా అతని పూర్వీకుల రక్తం ప్రవహిస్తూనే వుందన్న విశ్వాసం నాకుంది. త్యాగశీలత వాడిలో కూడా పరిపూర్ణంగానేవుంది. ఎటొచ్చీ సరైనా విద్యాసంస్కారాలు అబ్బితే—చాలు-వాడు నిజంగానే నీలాగే తలెత్తుకుని సగర్వంగా నిలబడగలడు"

రమేషు ఆ క్షణాన ఏమీ మాట్లాడలేదు. దూరంగా పాలవెన్నెల్లో మెరిసిపోతున్న భూమికేసి చూస్తున్నాడు జీవితకాలంలో తనకెన్నడూ కలగని విచిత్రమైన అనుభూతితో అక్కడ కూర్చున్నాడు. కొన్నిక్షణాల తర్వాత రమవేపు

చూస్తూ, "చూడు రమా! మళ్ళీ నన్ను బంధనాల్లో యిరికించకు! చాలా బాధల్నీ కష్టాల్నీ సహించి, చివరకు యిప్పుడు ఏ కొంచెమో సుఖాన్ని పొందుతున్నాను. నాకు దక్కిన యీ కాస్త సుఖాన్ని మళ్ళీ ఎందుకు దూరంచేస్తావు?" అన్నాడు రమేశ్.

"లేదు రమేషుబాబూ లేదు!" అన్నది రమ. "యిప్పుడు భయపడ వలసిందేమీ లేదు. నువ్వు వెలిగించిన దీపం యింతలోనే అంతరించదు. నువ్వు బస్తీనుంచి చదువూ సంస్కారాలతో వివేకంతో యీ గ్రామంలో అడుగుపెట్టినప్పుడు, యీ చుట్టూవున్న సమాజానికి అతీతంగా వుంటుండే వాడివనీ అందువల్లనే నువ్వన్ని బాధలు పడవలసి వచ్చిందనీ పెద్దమ్మ చెబుతూ వుండేది. మేము మా పాపభారంతో నిన్ను మాతో సమంగా పాతాళానికి యీడ్చుకొచ్చాం! ఇప్పుడు సమాజంతోపాటు, దానిలో ఒకనిగా జీవిస్తున్నావు గనుక నీకు భయంగానే వుంటుంది. మొదట్లో నీకు యిలాంటి సందేహాలొచ్చేవి కావు; ఎందుచేతనంటే అప్పట్లో సమాజస్థితి గతులకు అతీతంగా వుండేవాడివి. ఇవాళ నువ్వు సమాజపు పరిధిలోనే వున్నావు. అందుకే; నువ్వు వెలిగించిన యీ దీపశిఖ యింతలోనే చల్లారిపోదు అని నేనింత నమ్మకంగా చెప్పగలుగుతున్నాను. అంతేగాక ఆ జ్యోతి దినదినాభివృద్ధి చెందుతుంది." అన్నది రమ

పెద్దమ్మమాట వినేసరికి రమేశ్ ముఖం ఒక్కక్షణం ఆనందంతో మెరిసింది. "నువ్వు చెప్పేది నిజమేనా రమా?" అన్నాడు రమేశ్.

రమ మరింత దృఢ విశ్వాసంతో "అవును రమేశ్ బాబూ! నిజమే. పెద్దమ్మ చెప్పిన మాటే చెబుతున్నాను. జగీన్ పోషణభారాన్ని స్వీకరించి, నా అపరాధాలను క్షమించు రమేశ్ బాబూ! నేను నిశ్చింతగా వెళ్ళిపోవాలని ఆశీర్వదించు రమేషుబాబూ!" అనడిగింది రమ.

రమేశ్ లోలోపలే ఆశ్చర్యపడ్డాడు. కాన్పిచ్చును కడుపులో పెట్టుకున్న మేఘంలా కూర్చున్నాడు. మరి కాస్సేపాగి, "నా మాట మరొక్కటి మన్నించు రమేషుబాబూ!" అనడిగింది రమ.

"ఏమిటది?" అన్నాడు రమేశ్ నెమ్మదిగా.

"నా గురించి వేణీతో ఎన్నడూ వివాదం పడవద్దు" అని చెప్పింది రమ.

రమేషుకు అర్థం కాలేదు. "ఏమిటీ?" అనడిగాడు.

ఎప్పుడేనా ఏ సంగతేనా తెలిస్తే, దాన్ని గురించి వేణీతో వివాదం పడవద్దు. నేను అవన్నీ ఎట్లా సహించానో దానివల్ల అర్థం చేసుకో; అంతే! నేను ఎవరిమీదా ఏ విధమైన ఆరోపణలూ చెయ్యదలచుకోలేదు. వీటన్నిటికీ వ్యతిరేకంగా ఎదురుతిరిగి నిలబడాలనుకున్నాడు. పెద్దమ్మ ఏం చెప్పిందో తెలుసా? 'త్రిక్కించిన కొద్దీ అసత్యమే జటాయువౌతుంది; చిరంజీవి అవుతుంది. మనలో సహనం లేకపోతే అసత్యమనే అగ్ని మరింత రాజుకుటుందే గానీ, చల్లారదు!' ఈ ప్రత్యక్ష సత్యాన్ని, ధర్మోపదేశాన్ని మనసారా విశ్వ

సించే, నేను అనేక బాధలు నాలోనేనే సహించాను. రమేశ్ బాబూ నువ్వా యీసత్యాన్ని మర్చిపోవాకు!" అని చెప్పింది రమ.

రమేషు నిశ్శబ్దంగా ఆమెవైపు చూస్తూ కూర్చున్నాడు. రమ కొద్దిసేపు ఆగి. "యివాళ నన్ను క్షమించడానికి నీ మనసు అంగీకరించడంలేదు. ఎంచేతంటే నీ మనసులోనే అసాధారణమైన దుఃఖం కలుగుతూవుండవచ్చు. కాని యివాళ నీకు ఏది అసంభవంగా కనిపిస్తున్నదో-అదే ఒక నాటికి చాలా సహజంగానూ స్వాభావికంగాను కనిపిస్తుంది. ఆనాడు నువ్వు నా అపరాధాలన్నిటిని మనస్ఫూర్తిగ క్షమించగలవు. నాకా నమ్మకం వుంది; కనుకనే నా మనసు యిప్పుడు ప్రశాంతంగా వుంది. రేపు నేను వెళ్ళిపోతున్నాను." అంది రమ.

"రేపా ? రేపు ఎక్కడికి వెడతావు ?" అనడిగాడు రమేశ్ విస్మయంగా.

"పెద్దమ్మ ఎక్కడికి తీసికెడితే అక్కడికి !" అందిరమ నిశ్చలంగా

"కాని, ఆమె తిరిగిరాదు కదా ?" అన్నాడు రమేశ్ మరింత ఆశ్చర్యంగా.

రమ నెమ్మదిగా; "అందుకే మీఅందరికీ చివరిసారిగా నమస్కరిస్తున్నాను" అంటూ రమేషు పాదాల దగ్గర తల ఆనించింది.

రమేషు దీర్ఘంగా నిట్టూర్చి, "సరే, వెళితే వెళ్ళు రమా! కాని ఎందుకు వెళుతున్నావో చెప్పగలిగితే కారణం చెప్పి వెళ్ళు!" అనడిగాడు

రమ మాట్లాడక వూరుకుంది.

మరో కాస్సేపటికి "నీ మాటల్లోని అంతర్యమేమిటో నాకేమీ అర్థంకాలేదు. అందులోని అంతర్యం నీకే తెలియాలి లేదా భగవంతునికే తెలుసు! కాని ఏ నాటికైనా నిన్ను క్షమించగలిగిన శక్తిని ప్రసాదించమని నేనూ భగవంతుని ప్రార్థిస్తున్నాను. ఈ విషయంలో నేనెంత మథన పడుతున్నానో ఆ సంగతి సర్వాంతర్యామికే తెలుసు." అన్నాడు రమేషు.

రమ కళ్ళనుంచి బిందువులు జారిపడి పోయినయ్. అస్పష్టమైన ఆదీపకాంతిలో ఆ సంగతి రమేష్ అంతాబాగా గుర్తించలేకపోయాడు. రమ దూరంగానే వుండి మౌనంగానే మరోసారి రమేషుకు నమస్కారం చేసింది. మరుక్షణంలోనే రమేషు ఆ యింటినుంచి బయటికొచ్చాడు. రోడ్డుమీద నడుస్తున్నపుడు అతని భవిష్యత్తుకూడా అప్పటి నిర్మలమైన వెన్నెల లాగానే గోచరించింది.

మరునాడు వుదయం రమేషు వేణీ యింటికి వెళ్ళేసరికి విశ్వేశ్వరి యాత్రాసన్నహాల్లో నిమగ్నమైవుంది. సరిగ్గా ఆమె పల్లకిలో కూర్చునే సమయానికి రమేషు ఆమెకు దగ్గరగా వెళ్ళి పల్లకీ తలుపుదగ్గర నిలబడి లోపలికి చూస్తూ గద్గదస్వరంతో "పెద్దమ్మా! మేము ఏం అపరాధం చేశామని, యింత

త్వరగా నుమ్మల్ని విడిచిపెట్టి వెళ్ళి పోతున్నావు?" అనడిగాడు రమేశ్.

విశ్వేశ్వరి తన దక్షిణ హస్తాన్ని రమేశ్ తలపైనుంచి "అపరాధమా? పోనియ్ నాయనా ఆ సంగతులు; యిప్పుడవన్ని ఎందుకు? అవుసరం మాత్రం ఏముంది?" అని ఒక క్షణం ఆగి, "ఒకవేళ నేను యిక్కడే గనుక చనిపోతే వేణ నా అంత్యక్రియలు జరిపేమాట నిజమే కాని; నాకు పరంలోనైనా సుఖం లభించదు! ఇహంలో నేను నా సర్వస్వాన్నీ భ్రష్టం చేసుకున్నాను. ఇంక చూస్తూ చూస్తూ పరలోకంలోని పుణ్యాన్ని కూడా ఎందుకు పోగొట్టుకోవాలి? ఆ భయం వల్లనే నేనింత త్వరగా పారిపోతున్నాను" అన్నది విశ్వేశ్వరి.

రమేశ్ కు పిడుగు పడ్డట్లయింది; ఆశ్చర్యపడిపోయాడు. పెద్దమ్మ అంతరాత్మలో తన సుపుత్రుని పట్ల యింత వేదన సంగతి అతనికి ఈ నాటికీ తెలియదు. తనను తాను సంబాళించుకుని, "మరి; రమను ఎందుకు తీసుకెళుతున్నావు పెద్దమ్మా!" అనడిగాడు.

పొంగిపొర్లే దుఃఖాన్ని విశ్వేశ్వరి బలవంతంగా దిగ మ్రింగి, గొంతు సవరించుకుని "నాయనా రమేషు! యింక ఆ తల్లికి యీ పృధ్విమీద చోటెక్కడుంది నాయనా! భగవంతుని పాదాల దగ్గరకే ఆమెను తీసుకుపోతున్నాను. ఆమెకింకా అనారోగ్యంగానే వుంది. ఐనాసరే! బ్రతికితే బ్రతుకుతుంది; లేకపోతే లేదు!

ఒకవేళ బ్రతికితే; అసలు భగవంతుడు నీకీరూపాన్ని యీ గుణాలను, యింత విశాలహృదయాన్ని ఎందుకిచ్చాడో;

యిన్నింటినీ యిచ్చి నిష్కారణంగానే యింత అప్రతిష్ఠా భారాన్ని ఎందుకు తలపై పెట్టాడో... యీ కఠినమైన ప్రశ్నకు జీవితాంతం వరకూ సమాధానాన్ని అన్వేషించమనే చెబుదామను కుంటూన్నాను. బహుశా భగవంతుని దృష్టిలో యిదేమైనా మంగళకార్యమా? యిందులో అంత రార్థం ఏమిటి? అదీకాక యిది కేవలం సమాజపు స్వేచ్ఛాక్రీడా?...వింటున్నవా రమేశ్, వింటున్నావుగదూ?...రమ వంటి అనంత దుఃఖితురాలు యీ లోకంలో యింకెవరూ లేరు నాయనా'." అంటూండగానే ఆమె కంఠం పూర్తిగ రుద్ధమైపోయింది. కళ్ళ వెంబడి అశ్రుధార అవిచ్ఛిన్నంగా ప్రవహిస్తూనేవుంది ఆమె యింతగా దుఃఖించడం రమేశ్ గాని మరొకరుగానీ ఎన్నడూ చూడలేదు.

రమేశ్ విచిత్రమైన పరిస్థితిలో పడ్డాడు. మరి కాస్సేపటికి విశ్వేశ్వరి తనను తాను సంబాలించుకుని, "రమేషు, మరొక్కమాట చెబుతున్నాను నాయనా! రమను ఎన్నడూ అపార్థం చేసుకోవాకు! ఆమెను సరిగా అర్థంచేసుకోడంలో ఇతరులు పొరపాటు పడినా, నువ్వుమాత్రం పొరపాటు పడవద్దు. వెళ్ళేముందు నే నెవరిమీదా ఏ ఆరోపణలూ చెయ్య దలచుకోలేను. కాని రమకంటే శ్రేయోభిలాషులు నీ కెవరూ లేరనే సంగతి మాత్రం ఎన్నడూ మర్చిపోవద్దు." అని చెప్పింది విశ్వేశ్వరి.

"కాని, పెద్దమ్మా!" అని రమేషు ఏదో చెప్ప బోతున్నవాణ్ణి విశ్వేశ్వరి తన చేతిని రమేషు నోటిగా అడ్డుగా పెట్టి, "ఇందులో కానీ, గీనీ ఏముంది నాయనా! నువ్వు

విన్నదంతా అబద్ధం, నువ్వు చెప్పబొయ్యేది పొరాపాటు! ఆరోపణలకు ఎక్కడైనా హద్దున్నదా నాయనా? యికనువ్వు ఎక్కువ చెప్పకు. నువ్వు అన్యాయాన్నీ అహింసనూ ఎను రోకని నీ జీవిత పథంలో మరింత ఔన్నత్యాన్ని పొందాలనే రమ ఆంతర్యంలోని అభిలాష! అందువల్లే నోరు మూసుకుని అన్ని బాధలనూ సహిస్తూ వచ్చింది. అడుగడుగునా అగ్ని జ్వాలల్లో జ్వలించిపోయిందే గానీ ఎన్నడూ నోరెత్తలేదు. అలాంటివాళ్ళు యీ పృథ్వీమీద యికెందరున్నారు నాయనా!" అన్నది విశ్వేశ్వరి.

గతరాత్రి రమ చెప్పిన రెండుమూడు మాటలు యీ క్షణానజ్ఞప్తికొచ్చి రమేశ్ హృదయం వేదనతో అల్లకల్లోలమయి పోయింది. దుఃఖాన్ని దిగమ్రింగి తలవంచుకుని ఎంతో ప్రయత్నంమీద "పెద్దమ్మా! రమకోరిన చివరికోరికను జీవితాంతం వరకూ మర్చిపోననీ, నాలో అణువణువునా ఆసంగతి గుర్తుంటుందనీ చెప్పు పెద్దమ్మా!" అన్నాడు రమేశ్. తన రెండు చేతులూ చాచి పెద్దమ్మ పాదాలూ స్పృశించి అక్కణ్ణుంచి వెళ్ళిపోయాడు.



సమాప్తం



# మనము ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA114B108 |
| పుస్తకం పేరు | పల్లీయులు |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 249 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | P. Jayamma |
| పేజీలు విడదీసినది | P. Jayamma |
| స్కాన్ చేసినది | Aswini |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | NO |
| పరిస్థితి | good |